శ్రీ ర స్తు

శ్రీకృష్ణ పరబ్రహ్మణే నమః

# పతివ్రతల కథలు

(వచన కావ్యము)

ఇది

పురాణం - పిచ్చయ్యశాస్త్రిగారిచే
వ్రాయబడినది.

ప్రకాశకులు:

ఎస్. ఏ. గోపాల్ అండ్ కో.

నెం. 18, గోపాలపురం 8-వ వీధి,

మద్రాసు - 600 086.



వెల: 10-00

# విషయ సూచిక



విషయ సూచిక

సంపూర్ణము



# పీఠిక

మహాశయులారా!

మన యీ భరతఖండమునఁ బెద్దల కాలంబు నుండియు ననేక సద్గుణములను గలిగి యుత్తమోత్తమ పాతివ్రత్యసక్తలై యసమాన ప్రభావ సంపన్నలై జగద్విఖ్యాతినొంది ప్రతి దినప్రాతః సంస్మరణ పాత్రలై యొప్పు పతివ్రతా రత్నంబు లనేకులు గలిగియుండిరి. వారు తమ పవిత్ర శీలంబువలన నసమాన మహాద్భుత కృత్యంబు లాచరించి లోకులచే గొనియాడఁబడి ప్రసిద్ధికెక్కిరనియు, పెద్దలు వర్ణించి చెప్పెడి కథలవలనను, పూర్వ గ్రంథములవలనను మనము తెలిసికొని వారి యద్భుత మహిమల కాశ్చర్య నిమగ్నులమగు చున్నారము. ఆ మహా పతివ్రతలలో అనసూయ, అరుంధతి, సుకన్య, సీత, చంద్రమతి, దమయంతి, సావిత్రి మొదలుగాఁగల కొందఱు యువతుల చరిత్రములు మాత్రమే గ్రంథములలోఁ జదివి మనము తెలిసికొనియుండెదము. కాని మఱియుం బెక్కండ్రు కాంతామణులు పూర్వోక్త సతీతిలకంబుల వంటి వార లుండిరనియు వారి చరిత్రంబులును నత్యంతాశ్చర్య జనకంబులై యుండుననియు వినినపుడు మనకెంతయు విస్మయంబు గలుగును. పతివ్రతలకు జన్మస్థానమైన యీ భారతభూమియం దొక కాలంబున నట్టి వంటి వార లుండిరనియు, వేఱొక కాలంబున లేరనియు పలుకుట యుక్తమగునా? కాలమును ప్రవర్తనములును మాఱి వేఱువిధంబుగాఁ దోఁచినను, యిప్పుడును మన దేశంబునఁ బతివ్రతలైన స్త్రీలు లేకపో లేదు. లేరని తలంచుట పొరబాటు, నవివేకమును నగును. ఎందఱో పుణ్యకాంత లున్నారు! వారిని మనము తెలిసికొనలేక పోవుటచేతను తెలిసికొనఁ బ్రయత్నింపకుండుటచేతను, నెఱుంగఁజాలక గ్రంథము లలోఁ జేర్పఁబడిన వారిని కొందఱను మాత్రమే పతివ్రతలనియు మఱి యెవ్వరును లేరనియు మనము విశ్వసించుచున్నాము. ఈ విషయ

మును గూర్చి తెలిసికొనుటకుఁ బ్రయత్నించినచో నింకను నెందరెందరో మహాపతివ్రతలు గలరనుట మనకు స్పష్టమగుటయే గాక వారి యద్భుత చర్యలు మనల విస్మితులను గావించుననిః సత్యమునకు దూరము కానేరదు. దైవభక్తి, పాతివ్రత్యము, సత్యవర్తనము, పరోపకారచింత, ధర్మకార్యాసక్తి, యహింస మొదలుగాగల యుత్తమ లక్షణంబుల కునికిపట్టగు నీ పుణ్యభూమియందు పయిఁజెప్పిన వారిలో దేనికిఁగాని లోటుగలుగదు. పాపుల కిచట చోటులేదనినచో నానుడి యతిశయోక్తి గానేరదు. ఇటువంటి పావనంబైన మన దేశములో మనకు తెలియరాక మఱుగుపడి యున్న పుణ్యకాంతలయొక్క పవిత్ర చరిత్రంబులను ప్రయాసకోర్చి కొన్నింటిని సంపాదించి నేను సకల జనములకును దెలియుటకై వచనరూపంబున పతివ్రతల కథలనెడి నామముతో యీ వచన గ్రంథమును వ్రాసితిని. పురుషులకన్నను, స్త్రీలకు యీగ్రంథ మత్యంతోపయుక్తంబై యుండునని నాతలంపు. కావుననే సుబోధముగా నుండు తేటమాటలతో వ్రాసినాఁడ. ఉత్తమంబైన యీగ్రంథమును పఠించి భరతభూమియందలి గుణవంతులైన భామినుల పూర్వుల ప్రవర్తనమును దెలిసికొని, తామును వారివలెనే సత్ప్రవర్తనము, పతిభక్తియు దైవభక్తియుం గలిగి సాధ్వీమణులై మన దేశాభ్యుదయమున కాదర్శకులై సత్కీర్తిగాంచి వర్ధిల్లుదురు గాక యని కోరుచున్నాఁడ. అంతటి సద్గుణ సంపద నొసంగి భరత దేశకాంతల పాతివ్రత్య మహాత్మ్యమును వర్ధిల్ల జేయువలెనని భగవంతుని ప్రార్థించుచున్నాఁడను.

ఇట్లు, సుజన విధేయుఁడు,

# పతివ్రతల కథలు

## (వచన కావ్యము)

### 1. శ్రీదేవి కథ

మాళవదేశంబున పద్మాకరంబను నొక ప్రసిద్ధ పట్టణంబుగలదు. సకలసద్గుణ సంపన్నుఁడును, ప్రజ్ఞానిధియునైన చంద్రసేనుఁడను పేరుగల పుడమిఱేఁడు, సర్వజ్ఞుండనెడి మంత్రివర్యుని సహాయంబున నప్పురమును న్యాయశీలుండై పాలించుచుండెను. అతని భార్యపేరు మిత్రవింద, ఆమె మహాగుణవతి, శాంతస్వభావముగలది. శీలవతి, సకల సౌభాగ్యములకును నాదరమై వాంఛితంబులగు భోగము లనుభవించుచున్నను సంతానము లేమి మనంబున నెలకొని సదా బాధించుచుండెను. ఈ చింత రాజునకు సయితము మిక్కుటముగానె యున్నను, నతండు తలంపును వెల్లడింపక లోలోన నడంచుకొని తనకు సంతానమును ప్రసాదింపుమని సదా భగవంతుని ధ్యానించుచు కాలము గడుపుచుండెను.

ఒకనాడా సతీపతులు తమ విచారమునుగూర్చి ప్రస్తాపించిమాటలాడుచు, తాము పుత్రవంతులు గాకపోవుట కేదియో మహాపాపముఁ జేసియుంటిమనియు, ఆ పాప పరిహారముగా నేవేనియు సత్కార్యముల నొనరించినచో నీశ్వరుండు కరుణించి మన కొకవేళ సంతతి గలిగించుననియు నిట్లు ఆనాఁటి రాత్రియంతయుం బలుతెఱంగుల దలంచుచు కాలముఁ గడుపుచుండిరి

మఱునాఁడు చంద్రసేన భూపాలుఁడు సర్వాలంకార శోభితుడై సభా భవనంబున కరుగుదెంచి బ్రాహ్మణోత్తముల రావించి, తనకు "పుత్రసంతతి గలుగు విధంబు నెఱిఁగింపుఁ"డని యడిగెను. ప్రజ్ఞావంతులైన యా విప్రవరు లాలోచించి, "మహీవల్లభా! ఇది నీ పురాకృత పాపఫలముగాని, యిపుడుచేసిన దోషముకాదు. ఐనను, దీనికి పరిహారక్రియ లేకపోలేదు. మేము చెప్పిన చొప్పునఁ జేసినయెడల తప్పక నీవు సంతానవంతుడవు కాఁగలవు" అని పలికిరి.

రాజు:—అట్లే చేసెదను. ఏమి చేయమనెదరు?

బ్రా:—అది యొక సద్వ్రతము, మీరు సతీపతు లిరువురు నాచరింపవలెను.

రాజు:—మంచిది, ఆ వ్రతమెయ్యది? ఎట్లు చేయవలయును?

బ్రా:—అది లక్ష్మీవ్రతము, కల్పోక్తప్రకారముగా, సువర్ణలక్ష్మీ విగ్రహము నాఱుమాసములు షోడశోపచారములతో పూజింపవలయును. అంతట పాపములుతీరి మీకు సంతానము కలుగును. ఈ మాట పొల్లుకాదు.

రాజు:—బ్రాహ్మణోత్తములారా! మీ నిర్ణయమును తప్పక క్రమప్రకార మిందిరాసుందరి నర్చించెదము. కల్పమెట్లు?

బ్రాహ్మణులు లక్ష్మీపూజా విధానమును సామగ్రుల క్రమంబును నియమప్రకారమును నెఱింగించి వ్రతారంభ లగ్నమును నిశ్చయించి విన్నవించిరి. చంద్రసేన సర్వేశ్వరుండు తద్వృత్తాంతమును తన భార్యకెఱింగించి సంతోషచిత్తయైన యా సాధ్వీసహితుండై, భూసురులు నిర్ణయించిన శుభముహూర్తమున పరిశుద్ధ ప్రదేశంబునందు హేమ రమా విగ్రహమును ప్రతిష్ఠించి విధివిధానంబును దప్పక భక్తియుక్తులై సంతాన కాంక్ష యతిశయింపఁగా నిర్మలచిత్తంబులతో పూజించుచు భార్గవీ ప్రీత్యర్థంబుగా ప్రతిదినంబును ననేక దానధర్మంబులు గావించుచుండిరి.

లక్ష్మీపూజానంతర మొకనాఁటి రాత్రి మిత్రవింద కృతాహారయై శయనగృహంబున కరిగి పృథక్శయ్యపైఁ బవళించి లోకమాత యగు పద్మాలయను స్తుతించి సత్సంతానము నొసంగుమని ప్రార్థించి, యా తలంపుతోడనే కనుదమ్ములుమోడ్చి కూర్కుఁజెందెను. ఆమెవలెనే రాజు సయితము ఇందిరాదేవిని ప్రార్థించెను.

ఆరేయి నాదంపతుల కిరువురకును నేకకాలమున లక్ష్మీదేవి దేదీప్యమాన తేజోవిరాజిత రూపిణియై స్వప్నంబునఁ దోఁచి మొగంబునఁ జిఱునగవు మెఱయఁ గరుణాదృష్టులంగాంచి "మీ భక్తికిని, పూజలకును నేను మిక్కిలి సంతోషించితి, మీరు సంతానార్థము నన్ను ప్రార్థించితిరి గాన మీకు వరంబుఁ బ్రసాదింపవచ్చితి, మీ పురాకృత కిల్బిషంబు మిగుల నాధిక్యమై యున్నకతంబున నీ జన్మంబున మీకు పుత్రసంతతి గలుగనేరదు. భక్తియుక్తులై నన్ను మిగుల నారా

ధించితిరి. కావున నొకపుత్రిక మీకు గలుగునట్లు ప్రసాదించితి. ఆ సుత వలన మీకు లోకంబునఁ జెడని యశంబును పుణ్యలోక ప్రాప్తియుం గలుగఁగలదని'' వరం బొసంగి దిచ్చుమొగం బయ్యెను.

అంతట వారలిరువురును మేల్కాంచి మేనులు పులకరింపఁగా రమాదేవిని స్తుతించి కరుణాంతరంగయైన లక్ష్మి తమకు వరంబు బ్రసాదించెనని సంతుష్టాంతరంగులై వార లొండొరులు తమకు గలిగిన స్వప్నంబులు రీతిఁ దెలిసికొని యపుడు రాత్రి నాల్గవ యామంబు జరుగుచుండుటం జేసి, వేకువజామునఁ బొడమిన కలను ఫలంబు తప్పక కలుగునని పెద్దలు పలుకుచుండుటం దలంచి ''లక్ష్మిదేవికి తమపై కృపగలిగె'' ననియు, వరముఁ బ్రసాదించుటచే తప్పక తమకు సంతానంబు గలుగఁ గల''దనియు దలంచి స్థిరచిత్తులై సంతసిల్లుచుండిరి.

వారి తలంపు వ్యర్థము గాదయ్యెను. కొలఁది దినంబులకు లక్ష్మి ప్రసాదంబున మిత్రవిందాదేవి గర్భము దాల్చెను. ఆ వృత్తాంతము నెఱింగి యంతట నరేంద్రుని యానందమునకు మేరయే లేకుండెను. వారలటుల సంతోషాంబుధి నోలలాడుచుండఁ గ్రమముగా నవమాసములును నిండుటయు నొక శుభముహూర్తమున రాజపత్ని యొక యాడశిశువు జన్మించెను. తద్వార్త దెలియగానే నృపాలుండు పొలివోని సంతసంబు నొంది పురంబున చాటఁబఱచి యనేక దానధర్మములు గావించెను. పురజనులును లేక లేక తమరాజునకు కూతురు బుట్టినందుల కెంతో ఆనందమును బొందినవారై యనేకములైన కానుకలు గొనివచ్చి రాజభార్యకు సమర్పించిరి. ఇవ్విధంబున నుత్సవములతోడను వేడుకలతోడను పదిదినంబులు గడచినంతట, చంద్రసేన మహారాజు విప్రులను రావించి, శిశువునకును, తల్లికిని మంగళస్నానాది క్రియలు నిర్వర్తిల్లంజేసి, జాతకర్మ పుణ్యాహవచనాది విధులు జరిగించి లక్ష్మిప్రసాదంబునఁ గలిగిన దగుటచే యాశిశువునకు శ్రీదేవి యను నామకరణముఁ గావించి, పేదసాదులకు బ్రాహ్మణులకు నరేంద్రుండు పెక్కుదానముల నొనరించి యనంతర మాకూతు నెంతయు గారాబంబుతో బెంచుచు భార్యయుం దానును సంతుష్టినొంది వర్తించుచుండ కొంతకాలమున కాబిడ్డ కైదేండ్లు నిండి కళంక రహితమగు చంద్రబింబము కరణి నలరారుచుండెను.

మహీపతి సర్వజనులకు నల్లారుముద్దుగాఁ బెరుగుచున్న శ్రీదేవికి తత్కాలంబుల జరుగవలసిన కార్యముల నొనరించి దినదిన ప్రవర్ధమా

వయై యొప్పుచున్న యా బాలికకు సకల విద్యలును జెప్పిన నామె యనతికాలముననే విద్యలన్నియు గ్రహించి మిక్కిలి ప్రవీణురాలయ్యెను. ఆ కాలంబున తరుణులలో శ్రీదేవికి సాటి యనఁదగిన కాంతామణి యొకతెయైనను, మానవులందును మఱి దేవతలయందును సయితము గలుగదని ప్రజలామె రూప గుణ లక్షణంబుల నెంతయు గొనియాడఁ దొడంగిరి.

ఆ సుందరాంగికి బుద్ధి దెలిసినది మొదలుగా నత్యంతమగు దైవభక్తియు మాతాపితలయందును పెద్దలయందును నధిక ప్రేమయుంబును గలిగి సత్కార్యవాంఛ యతిశయింపుచుండ నొప్పుచు, దేవతారాధనము, బ్రాహ్మణపూజ మొదలగు కృత్యంబు లాచరించుటయందు నిమగ్నచిత్తయై దానధర్మంబులు సేయుచు, దయ, శాంతము, సంతోషము సంతుష్టిగలిగి వర్తించుచుండుటను జూచి తల్లిదండ్రు లామెయందు తమకుఁ గల యనురాగాతిశయమున నేకార్యము నొనరించినను సడ్డ సేయకుండిరి. కావున నామె గావించు సత్క్రియలు నిరంతరాయముగా జరుగుచుండెను. శ్రీదేవి చేయు పనులలో నొక్కటైనను వక్రమైనదిగాను, ఆక్షేపింపఁదగినదిగాను లేని కతంబున తల్లిదండ్రు లాకన్నియ పనులన్నియు యథావిధిగా సాగనిచ్చుచుండిరి.

క్రమముగా నయ్యబల యౌవనవతియై దినమున కొక క్రొత్త కళ యతిశయ మగుచుండు శుక్లపక్ష చంద్రుని తెఱంగున వర్ధిల్లుచు, లక్ష్మీవరప్రసాదమునఁ గలిగిన దగుటచే రూపలావణ్య గుణగణంబులు జూచు వారికి రాజనందనగా నిటులను నిందిరయే జన్మించెనేమోయనియు తోచుచుండెను. ఇట్లు యెల్లవారికినిఁ గనులపండువఁ జేయుచు నవయౌవనాభిరామయై యొప్పుచున్న యాశ్రీదేవి యొకనాఁడు చెలికత్తియలంగూడి యుద్యానవనంబున విహారము జేయు కోరిక గలదై యరిగెను. అటఁ గల లతలును, చెట్లును పూఁబొదలును, తామరలతో నొప్పు తేటనీటి కొలంకులు, చిలుకలు, కోకిలలు, నెమళ్ళు గోరువంకలు మొదలైన పక్షులను గాంచి యానందించుచు సవరించుచున్న సమయమున, నామె చెలికత్తెలా వనంబులలో ఫలపుష్పాదులం గోయుచు తమ తమకుఁ దోచినలాగున నలుముఖంబులం బోవుటయు, రాజపుత్రియు నొకవంక పూవులం జిదుముచు తిరుగుచుండ యలుపుఁజెంది వనమధ్యంబునఁ గల్పింపబడియున్న

రమణీయమైన చలువరాతి తిన్నెపైఁ గూర్చుండి వెలులరాకకై నిరీక్షించుచుండెను.

అట్టియెడ నెచ్చట నుండియో యెట్లో పరివ్రాజిక సన్యాసి స్త్రీ యొకర్తు, పిలువగా వచ్చిన దానివలె హఠాత్తుగ వచ్చి రాజపుత్రి ముందు నిలిచెను. శ్రీదేవి యామెను జూడగనే తటాలున లేచి భక్తితో నమస్కరించి కూర్చుండ నియోగించి "పావనీ! ఎవ్వతెవు? ఎటనుండి వచ్చితివి? నావలన నీకుఁ గావలసిన కార్యంబు గలదేని వచింపు" మని యడిగిన, జోగురాలు మొగమున నవ్వు వికసింప మాటలాడఁ దొడంగిన వారి క్రింది రీతిని సంభాషణము జరిగెను.

జోగు:—కన్యకామణీ! నీవలన నాకుంగావలసిన నియోదియును లేదుగాని ఇపుడొక మంచిమాట నీకుఁ జెప్పి పోఁదలంచి వచ్చితిని

అది యేదియో వినుపింపుము.

[illegible] పుణ్యవతియున్న

దానవు. నీతండ్రి నీకిక వివాహము గావింపఁగలడు ఆ కార్యము స్వయంవర మూలమున జరుగునని తెలిసికొంటిని. స్వేచ్ఛా విహారినైన నే నీదారిని బోవుచు నిటనున్న నిన్నుజూచి నీ సౌందర్య గుణవిశేషాదుల నూహించి తెలిసికొన్న దానినై యిటువంటి నీకు దగిన భర్తయగు వానిఁ జెప్పి బోవఁదలంచితి. నేను జెప్పెడి పురుషోత్తముని వరించితివేని లోకంబున నీకు కీర్తియు, నానందంబును, సకల సౌఖ్యములునుం గలిగి వర్ధిల్లుదు రోహిణీ చంద్రులవలెను, శచీ పురందరులవలెను మీ దాంపత్యము లోకంబున నెంతయుఁ గొనియాడఁదగియుండును.

శ్రీ:—తల్లీ! ఆ యుత్తమపురుషుం డెవ్వఁడు? ఎచ్చటనుండును? అతని వరించుటకు నాకెటుల సమయము చేకూరగలదు? అవ్యాజకరుణతో వచ్చి నామేలుఁగోరి, శుభ వర్తమానముఁ జెప్పవచ్చిన నీవు నాయందు పుత్రికా వాత్సల్యమునుంచి వివరింపుము అని సిగ్గుతో నడిగెను.

జో:—కుమారీ! నేను త్రికాలవేదిని. యిట నిన్ను చూడఁగానే నీయందు ప్రేమజనించినది. కావున నీకు మేలుచేయ నెంచివచ్చితిని. వినుము. గంధవతీపురమును పాలించు భద్రేశ్వరుఁడను రాజునకు సుందరేశ్వరుండను పుత్రుండుగలఁడు. అతఁడు యువరాజు పట్టంబువహించి

నిండారిన యౌవనముచే శోభిల్లుచున్నవాఁడు. పేరునకుఁ దగిన యా రాజనందనుండు సర్వవిధంబుల నీకుఁ దగినవాఁడు. బంగారమునకు పరిమళము కలిగించిన చందమున మీ దాంపత్యము శోభిల్లఁగలదు. నేను జరుగఁబోవు విషయంబును దెలిసికొంటిని. మీతండ్రి నీవివాహమునకు స్వయంవరము చాటింపఁ దలంచియున్నాఁడు. అప్పుడు అందఱు రాజుల వలె; నేను చెప్పిన సుందరేశ్వరుఁడును రాఁగలఁడు. అపుడు నీవతని వరించి సర్వ సౌఖ్యములు ననుభవింపుము. ఇదియే నేను వచ్చి చెప్ప దలంచిన వృత్తాంతము.

శ్రీ:—అమ్మా! కారణము లేక నేవచ్చి నాయందు దయగల దానవై నా మేలునుగోరి యీ శుభవృత్తాంతమును జెప్పి నన్ను ధన్యురాలను జేసిన నిన్ను నెన్నినోళ్ళఁ బొగడినను జాలదు. పరులవలన నెట్టి మేలును నంగీకరింపని నీకు నేనేమిబదులు చేయఁగలను? ఇదిగో! మ్రొక్కుచున్నాను. నీవు చెప్పినట్లే చేసెదను. ఈదినంబు మొదలుగా నమ్మహీపతి నందనుఁడే నాదు భర్తయని దృఢసంకల్పము గలదాననైతిని. నీపాదము లాన, యిది సత్యము” అని పల్కెను. పరివ్రాజిక సంతసించి రాజపుత్రిని దీవించి, “కోమలాంగీ! నడుమ నీకు కొన్ని సంకటములు తటస్థింపగలవు కాని, పతివ్రతా మహిమగలదాననై యా కష్టములను గడచి పూర్ణసుఖములను బొందెదు” వని నుడివిన విని శ్రీదేవి “అమ్మా! ఆ కష్టము లెట్టివో దయచేసి తెలుపు” మని యడిగెను.

జో:—రాజపుత్రీ! చెప్పకూడదు. అది దేవరహస్యము, ఏమైన నేమి? దీర్ఘ సుమంగలీత్వమును భోగములును నీకు కలుగును. ఇంక నేను పోయెదను. నీకు మేలుకలుగును గాక.

అని దీవించి తాను చెప్పిన నృపాలపుత్రుని రూపగుణ లక్షణాదులను వివరముగాఁ దెలిపి, మఱియేమియుం బలుకకుండ లేచి, వెడలి పోయెను. ఆమె మాటలచే నారాజపుత్రునిపై బద్ధానురాగముగలదై శ్రీదేవి తన కా పురుషోత్తముని భర్తను జేయుమని భగవంతుని ప్రార్థించుచు చెలులంగూడుకొని నిజ సదనంబునకుంజని నృపాత్మజునిపైఁ బొడమిన మోహాతిశయంబునఁ బరితపించుచుండెను.

పిమ్మట కొలఁది దినములకు చంద్రసేనమహారాజు తన కూతురు యౌవనవతియై యుండుటంగాంచి వివాహముఁ చేయదలంచి యా

ముద్దియకుఁ దగిన వరుండెవ్వఁడని వచా కనుగొనఁజాలక యోగిని చెప్పిన చొప్పున 'స్వయంవరమునఁ దగిన'దని నామె యే వరించును గాక యని తలంచి, లగ్నసిశ్చయముఁ జేయించి నానాదేశములందును దద్వృత్తాంతమును చాటింపించెను. శ్రీదేవియొక్క రూప, యౌవనశీల గుణ లక్షణాదులను విని మోహితులైనను నాసుందరాంగిని పెండ్లాడవలయునని యువ్విళ్ళూరుచుండిన వారగుటచే దేశాధిపతులందఱు నాస్వయంవర లగ్నమునాఁటికి మహావిభవయుక్తులై చనుదెంచిరి. చంద్రసేనుఁడు వారినెల్లరను తగు మర్యాదలుచేసి విడుదులుచూపి విడియించెను. ఆ స్వయంవరమునకు లోకసుందరుండగు సుందరేశ్వరుండును వచ్చెను. అతని చక్కదనమును చూచినంతట, నటఁజేరియున్న రాజులు తమలో 'ఆహా! ఈ నృపపుత్రుఁడు, వసంత కంతు జయంతులను సయితము తన సౌందర్యలక్షణాదులచే జయింపఁగలవాఁడై యున్నాడు. ఇతనిం గాంచినంతట రాజనందన పరవశచిత్తయై వీనినిఁగాక యొరులను వరింపఁ దలంచునా?' యని నిరాశ నొందియుండిరి.

సుముహూర్తము నిర్ణయింపఁబడియున్న నాఁడు సకల రాజన్యులును చూచుచుండఁగా నందఱియొక్క సమక్షంబున శ్రీదేవి సౌందర్యనిధియగు సుందరేశ్వరుని వరియించి యతని మెడయందు పువ్వులదండ వైచెను. అప్పుడు జయధ్వనులు, వాద్యఘోషములును, విప్రులాశీర్వదించు వాక్య నినాదములును మిన్నుముట్టెను. పిమ్మట విధియుక్తముగా శ్రీదేవి సుందరేశ్వరులకు వివాహము జరిగింపఁబడియెను. తగియున్న యాదంపతులంగాంచి ప్రజలధికానందంబునఁ బొంగి యనేక విధంబులఁ గొనియాడఁ దొడంగిరి. వచ్చిన రాజులు, వారువారును తాము తలంచినట్టుల మనోరథంబు సిద్ధింపమిచే దీనవదనులై సుందరేశ్వరుని పుణ్యవిశేషమును మెచ్చుచు తమతమ నగరంబుల కరిగిరి.

అంతట చంద్రసేన మహారాజు నెలదినముల వరకును దనపురంబున నల్లుని నిలుపుకొని వేడుకలు వినోదములును జరిగించుచుండి, తరువాత బహువిధంబుల వస్తువులును, ఏనుగులును, గుఱ్ఱములు, తేరులు, దాసదాసీజనులను, ధనమును, కూతున కరణంబొసంగి యల్లునకు పెక్కు బహుమతులును చేసి 'పతివ్రతవై కీర్తినిఁ బొందుమని' దీవించి శ్రీదేవిని ప్రయాణముం జేసి యల్లుని వెంట నత్తవారింటికిఁ బంపెను.

శ్రీదేవి యివ్విధమున శ్వశురులయొద్ద కరిగి వారికి మ్రొక్కి యది మొదలు మిక్కిలి భక్తితో వారిని సేవించుచు, పతియే దైవంబని భావించి యతని యిష్టానుసారముగా మెలఁగుచు, ప్రజలయందును సేవకులందును దయగల్గి, వారిమియు సంతోషమును నతిశయింపఁగా, సదా బ్రాహ్మణపూజయును, దానధర్మాది సత్క్రియలును, నిందిరారాధనమును గావించుచు, నెల్లవారలచేతను పొగడ్తనొంది మాధవునకు రమాదేవి యుంబోలె సర్వవిధములు నొప్పుగాంచి వర్తించుచుండెను.

కొన్నిదినములు జరిగినంతట చంద్రసేనుఁడు రాజపరిపాలనార్హుఁడైన కుమారునకు పట్టాభిషేకముఁ గావించి తాను పెద్దవాఁడగుటచే భోగాసక్తిని విడిచి భార్యంగూడి తపంబు జేసికొనుటకై యరణ్యముల కరిగెను. సుందరేశుండు, సకలసద్గుణ పూర్ణుఁడును, వివేకవంతుఁడు నగుటచే ప్రజలయందు దయకలిగి తన బిడ్డలవలె జూచుచు, ధర్మపథంబు దప్పక సాధ్వీశిరోమణియైన తన ధర్మపత్ని సంతతమును నిజాభీష్టము నెఱింగి సేవింపుచుండఁగ, సౌజంతయు సమానుఁగనివాఁడై రాజ్యపాలనముఁ జేయుచుండెను.

ఇట్లుండగా కుంతల దేశాధిపతియగు వీరవర్మ యందరివలెనే తానును శ్రీదేవి స్వయంవరమునకు వచ్చి యామెవలన వరింపఁబడక నిరాశుఁడై మరల పురంబునకుపోయి యా రాజనందన తన గొప్పనైనం దలంపక తనకంటె ప్రభుత్వముఁ దక్కువవాఁడైన సుందరేశ్వరునిఁ గోరి పెండ్లాడుటం దలంచి యసూయాగ్రస్తుండై యా సుందరేశ్వరునిపై దాడివెడలి జయించి యతనిని రాజ్యభ్రష్టునింజేసి యతని వరించిన యబలకు ప్రబలకష్టంబులు గలిగించి వెతలొందింపవలయునని తలంపుగొన్నవాఁడై తనయత్నంబును నెరవేర్చుకొనం దగిన యుపాయంబు జింతించి తనవలెనే స్వయంవరమునకు వచ్చి యవమానితులైన రాజులలో కొంతవఱకు దుర్బోధం గావించి పురి యెక్కించి వారలం గలిసికొని ప్రబలసైన్య సమేతుఁడై హఠాత్తుగాఁబోయి పద్మాకరంబును ముట్టడించెను. అప్రయత్నుఁడై యున్నందునను, నందఱు రాజులొక్కటిగా వచ్చినందునను జయించుటకు శక్తి చాలకపోవుటచేతను సుందరేశ్వరుండు తనవలన నైనంతవరకును నల్పబలంబును బెట్టుకొని పోరాడి యోడిపోయెను. కుంతలేశ్వరుండతని రాజ్యము నపహరించి, భార్యాసహితముగ నతనిని రాజ్యమును విడిచి పోవ నాజ్ఞాపించెను.

శ్రీదేవి సుందరేశ్వరులు అడవుల మేకంబులంగూడి చరించుచు, కాయగసురుల దిని ప్రాణములు బెట్టుకొని, యట్టి దీనదశలో మాను యింటి కరుగనిచ్చలేక, తానపహరించిన యీరాజ్యసమీపమున నెచ్చటనుండినను జంపించెదనని కుంతలేశ్వరుఁడు గట్టిగాఁ జెప్పియున్నండున నటదాపున నుండుటకు వెఱచి యడవుల మార్గముననే నెలదినములు నడచి చాలదూరము పోయెను. పాపము! పతితోడ నీడయుంబోలె విడువక యతి సుకుమార దేహము నబలయునైన శ్రీదేవి యెన్నఁడును నడిచినదియు, వెత లనుభవించినదియు గాకపోయినను; విధికృతముగా తమకుఁ గలిగిన సంకటము తొలఁగరాకయుండుటకు వగవక, ప్రాణేశ్వరునకు వాటిల్లిన కష్టములం జూచి మనంబునఁ దల్లడిల్లుచు, యెట్లో బాధకు నోర్చి ముండ్లయందును రాళ్ళయందును, నడువలేక నడుచుచుండెను. ఆమె పాదములు పగిలి నెత్తురు గారుచుండగా నట్లు తన వెంటనంటి వచ్చుచున్న కోమలాంగిని జూచి సుందరేశ్వరనృపతి మిక్కిలి దుఃఖమునొంది యమ్ముద్దియ చేయిఁబట్టుకొని మెల్ల మెల్లగా కొంతదూరము పోయినంతట నొకచోట నొక యడవి పల్లియవారికిఁ గండ్లఁబడెను.

అపుడు మహీపాలుండు కొంత యూరటను బొంది, భార్యను జూచి; "కోమలీ! అదిగో ముందట నొకపల్లె గన్పట్టుచున్నది. మన మచ్చోటికేగి, ఏమైనను నాహారమును సంపాదించుకొని భుజించి మార్గాయాసము దీఱుట కీదినమిచ్చట విశ్రమించియుండి రేఁపటియుదయమున మన ప్రయాణము సాగింపుదము. నీయభిప్రాయ మేమి?" అని యడిగిన పతిమాటకు బదులుమాటాడి యెఱుంగని యామె "మంచిది ఆలాగే చేయుఁడు" అని చెప్పెను. వార లాయూరిపకుఁ బోయి యందు భిక్షాన్నమునకై యొకయింటి వాకిటికిఁ బోయిన, రోహిణీ చంద్రులవలెనున్న యాదంపతులం గాంచి యా యింటివాఁ డాశ్చర్యమును బొంది మిక్కిలి యలసి యున్న వారికి తనయింటఁ గలిగిన పదార్థములు బెట్టించెను. ఆ పుణ్యాత్ముని కరుణచే నివ్వఁబడిన పదార్థములం గొని వారు ఊరివెలుపలనుండిన చిన్న గుడియొద్దకుఁబోయి తెచ్చుకొనిన వస్తువులను భుజించి, యచ్చటి కొలనిలోని నీరుద్రావి, విజనముగా నుండెడి యాగుడిలో విశ్రమించిరి.

నడిచి నడిచి యలసియుండిన వారగుటచే వార లిరువురును మాటలాడుకొనుచుండునట్లే కూర్కుఁజెంది, గాఢముగా నిద్రించిరి. ఆ సమయమున నొక పెనుబాము మెల్లగా గుడిలోనికిఁ బ్రవేశించి యటునిటుం దిరుగుచుండి, నిదురలోనుండి పొరలుటచే, రాజశేఖరుని కాలు తనకుఁ దగులుటచే కోపముఁ జెంది, బుస్సుమని గాఢముగా నతని కాలుం గఱచి వెడలిపోయెను. నిద్రాపరవశుండై యున్న రాజు తద్విధంబు నెఱుంగఁజాలఁ డయ్యెను. సర్పవిష మానిద్రలోనే యతని దేహమున వ్యాపించినందున శయనించినవాఁడు శయనించినట్లే యుండి ప్రాణంబులు విడిచెను.

తెల్లవారి నంతట రాజపుత్రి మేల్కాంచి కదలక మెదలకున్న భర్తను తట్టిలేపెనుగాని, యతఁడు కదలలేదు. పలుమారు పిలిచి కదలించియు నంగంబులు బిగిసికొని శవాకృతితో నుండు తన వల్లభుం గని యతండు మృతినొంది యుండుటం దెలిసికొని మిన్ను విఱిగిపడిన చందమునఁ దోఁచుటయు, నత్యంత దుఃఖాక్రాంతయై గోడు గోడున నేడ్చుచు ప్రాణతుల్యుఁడగు నాథుండు మృతినొందుటకుఁ గారణంబు దెలియక సామ్రాజ్య భోగభాగ్య ధురంధరుండైన భూపాలున కటుల హఠాత్తుగా మరణము గలుగుటయు, దిక్కులేక యాగుణరత్నాకరుం డవ్విధంబునఁ బడియుండుటయు, దిక్కులేక తాను జీవంబులం దొఱంగిన శవదహనాదుల కరణీయంబు నగుటయుం దలంచి, శోకసాగరమగ్నయై యల్లాడుచున్న, నామె రోదనము నయ్యూరిలోని వారు విని యచటికి కరుదెంచి వృత్తాంతము నమ్మానినీమణివలన నెఱింగి, మిక్కిలిఁ జాలిఁ జెంది, యతని మరణంబున కేదియో పాము గఱచుట కారణమై యుండునని యూహించి తమకుఁ దెలిసిన పెక్కు చికిత్సలం జేసిరి. కాని లాభము లేకపోయెను.

అంతట వారా శవమును దహించుట యుక్తంబని తలఁచి రాజపుత్రి నచటనే విడచి తగిన సన్నాహంబులు జేయుటకై యూరిలోని కరిగిరి. అపుడు (శ్రీ) దేవి, యటువంటి పురుషోత్తముని బోఁగొట్టుకొని లోకంబున జీవించియుండనొల్లక తానును బ్రాణంబులు తొఱంగి తన విభునిం జేర నిశ్చయించి తెగువకుఁ బూని మేర లేని దుఃఖముతో తత్సమీపంబు నందలి చెట్టుపైనుండి వ్రేలుచున్న దృఢములైన తీఁగలనుచ్చు వేసి మెడకుఁ దగిలించికొనఁబోవు సమయంబున, దిగ్గన నొక మునీశ్వరుం డామె

యెదుట సాక్షాత్కరించి యక్షగిరిచి యుద్దేకంబు నూన్చి యిట్లనియె.

"అమ్మా సాహసము చేయకుము నేను నారదుండను. ఎప్పుడును త్రిలోకములను సంచరించుచుండువాఁడను. నే నిపుడా కాశ మార్గమున బోవుచుండి నీవు చేయఁబూనిన కార్యమును నిట్టి సాహస కార్యమును చేయఁదలంచుటకు కారణమును దెలిసికొని, లక్ష్మీవర ప్రసాదమునఁ గలి గినదానవును పరమపతివ్రతా రత్నంబునునైన నీకు మేలుచేయఁదలంచి కనికరించి ఇచ్చటికి వచ్చితిని. నా యుపదేశ ప్రకారము జరిగించితి వేని నీవు పునర్జీవితుండైన నీ పతినిఁ బడయఁగలవు" అని పలికెను. ఆ మాటలు వినఁగానే శ్రీదేవికి కొంతయూరట గలిగెను. కాని యతఁడు చేయుమనెడి కార్యమెట్టిదియో, సాధ్యమో; అసాధ్యమో యని మరల సందేహము జనియించెను. ఆమె యమ్మునివర్యుని పాదంబులకు మ్రొక్కి చేతులు మోడ్చి నిలిచి "మహాత్మా! మీదర్శనమునకే నేను ధన్యురాల నైతిని. నావల్లభుండు జీవించుటకుం జేయఁదగిన కార్యము నుపదేశించెద నని చెప్పితిరి. ఆ కార్యమెయ్యది? దిక్కులేనిదానవగు నాయందు కరు ణించి వినఁబల్కుఁ"డని వేడుకొనెను.

నారదు:—గుణవతీ! నీవు లక్ష్మీవరంబున పుట్టినదానవు. పతి వ్రతా రత్నంబవు. కాఁబట్టి స్థిరచిత్తంబున, పరమపావన రూపిణియు, వాంఛితార్థ ప్రదాయినియు, దయాంతరంగయునైన లోకమాతను నీ పతిని పునర్జీవితునిఁ జేయుమని భక్తితో ప్రార్థింపుము. ఆదేవి కరుణించి నీ విభుని బ్రతికించును.

శ్రీ:—చిత్తము! నాశక్తికొలది ప్రార్థించెదను. స్వామీ! ఈమ ద్విభుండు మరణించుటకు నిమిత్తంబెయ్యది? తెలియకున్నది!

నారదు:— నిదురలో సర్పదష్టుండై యితండు మృతినొందెను. ఇతఁడు బ్రతుకుటకు నేను చెప్పినపద్ధతి దక్క వేరుసదుపాయము లేదు. అదే! మీరు శయనించియుండిన యా చిన్నగుడి లక్ష్మీదేవి గుడియే! అందలి విగ్రహము లక్ష్మీవిగ్రహమే! కావున నన్యథాతలంపు వీడి ధ్యానించి ప్రార్థింపుము. నీకు ఫలంబు గలుగును.

శ్రీ:—మునీంద్రా! మీ యానతిప్రకారము భార్గవీ చరణసరో జము లాశ్రయించి వేడెదను.

ఇట్లు రాజపుత్రి పలుకుటయు 'నీవు దీర్ఘసుమంగిలి వగుదువుగాక' యనిదీవించి నారదమునివరుండు దిచ్చుమొగమయ్యెను. అంత నాకాంతా

మణి త్రికరణశుద్ధిగా నచ్చటి గుడిలోని ఇందిరావిగ్రహమున కెదుట పద్మాసనాసీనయై కూర్చుండి నిశ్చలభక్తితోఁ గన్నులరమోడ్చి పరిపరి విధంబుల ధ్యానముఁ గావింపదొడంగెను. ఆశ్రితులయం దత్యంత వాత్సల్యముగలదై వారి సంకటములను బోకార్చి పాలించునట్టి కరుణాస్వరూపిణియగు జగన్మాత కమలవాసిని స్థిరచిత్తముతోఁ దనయందు భక్తిగలిగి ధ్యానించుచున్న పరమసాధ్వియైన రాజహంసన స్తోత్రమువలన మిక్కిలి సంతసముఁబొంది, ఎన్నడును పూజా పునస్కారము లెఱుంగని యా గుడిలోఁ దేదీప్యమాన ప్రతిభలతిశయింపగా జగన్మోహనాకృతిశోభిల్లఁగా శ్రీదేవికి ప్రత్యక్షంబై, కృపావిలోకనము లలరఁ, దన దక్షిణకరంబున నయ్యంగనామణి శిరంబున స్పృశించెను.

లక్ష్మీకరస్పర్శమువలన నతిశయించిన జ్ఞానముగలదై శ్రీదేవి కన్నులుదెరచి తనయెదుట సాక్షాత్కరించిన రమాదేవింగని పరమానందమగ్నయై యధికభక్తితోఁ బ్రదక్షిణ నమస్కారములు గావించి మేన పులకలు మొలసూపఁగా నిలిచి పొగడుచున్న యా బింబాధరం జూచి “సాధ్వీమతల్లీ! నీవు మహాపతివ్రతవు, నావరంబుచేఁ గలిగిన మదీయ భక్తురాలవు. కావున నింత సులభముగా నీకుఁ బొడసూపితి ఇటుల దేని కొఱకు నన్ను ధ్యానించితివో యా కారణంబు నే నెఱుంగుదును. ఇదిగో ఈ ఫలంబునుగొని దీని రసంబు నా పాదమస్తకముగా మృతుండై యున్న నీ పతి దేహంబునకుఁ బూయుము. అతఁడు నిదుర మేల్కొన్న వానివలె సజీవుండై లేవగలఁడు. అంతట మీర లిటనుండి మీతండ్రిగారి నగరంబున కేగి యటనుండి కొంత సైన్యముంగొని మీనగరంబు నాక్రమించిన కుంతలేశ్వరుని ఎదిరించితిరేని నామహిమచే యతడు సులభముగా నోడి మీ రాజ్యమును మీ కప్పగించిపోగలడు. అంతట మీరు రాజ్యాధిపత్యమును వహించి సుఖమున భోగంబు లనుభవింపుఁ”డని యొక్క యపూర్వ ఫలంబు నామెచే నొసంగి యంతర్ధానమును బొందెను.

శ్రీదేవి యా శ్రీదేవికి తనయందుగలిగిన యనుగ్రహంబు నెంతయు గొనియాడి యనేకరీతుల సంస్తుతించి జగన్మాత చెప్పిన తెఱంగున పండ్లరసమును భర్తదేహమునకు బూసెను. ఆక్షణంబె యతనికి ప్రాణములు గలిగి లేచి కూర్చుండి జరిగిన వృత్తాంతమంతయును దన ప్రియపత్ని వలనఁ దెలిసికొని, యామె మహిమకును తనయందుగల భక్తియనురాగములకును నెంతయు నాశ్చర్యముజెంది మెచ్చి క్షీరాబ్ధిపుత్రి యే విధంబున

నాదేశించెనో యాప్రకారము సర్వకార్యములును దప్పక జరిగించి కుంతలేశ్వరుండు దపహరించిన రాజ్యము నతఁ డర్పింపఁగా మరలఁగైకొని, పుణ్యావతియై భార్య గూడి నిరంతరాయముగా సౌఖ్యము లనుభవించుచుండెను.

పవిత్రవర్తనయైన యా రాజాత్మజ తన యాత్మేశ్వరుని సేవయే తనకు నిత్యవ్రతంబుగా వర్తించుచు సదాలక్ష్మీదేవి నారాధింపుచు నతిథి యభ్యాగతుల నాదరింపుచు, పుట్టినింటికిని మెట్టినింటికిని కీర్తి గలుగు లాగున సకల జనంబులును గొనియాడుచుండఁ బ్రసిద్ధికెక్కెను. శ్రీదేవి భర్తను బ్రతికించుకొనిన వార్తఁగల యూరివారలామె మహిమ నెఱింగి యాశ్చర్యనిమగ్నులై పెక్కువిధంబుల గీర్తించిరి.

దీనివలన పతివ్రతల మహిమ చాల గొప్పదనియు నెంతటియసాధ్యకార్యమైనను, పాతివ్రత్యముగల మగువలకు సులభసాధ్యమై యుండు ననియు మనము నిశ్చయింపవలసియున్నది.

శ్రీదేవికథ సంపూర్ణము

## 2. సుగుణవతి కథ

భద్రక దేశమున నిత్యానందం బను పట్టణంబు రాజధాని నగరంబై యొప్పుచుండెను. దానినిఁ బాలించు రాజు నామము విభీషణుండు. అతని మంత్రి ధీమంతుఁడు. ఆభూజాని ధర్మము దప్పక రాజ్యపాలనముఁ జేయుచున్న కాలమున, తత్పురంబున విశ్వావసుండను బ్రాహ్మణుండు వసించుచుండెను. అతని యిల్లాలికి భద్రదంతి యని పేరు. అతనికి బ్రదీపుఁడనెడి యొక కుమారుండు గలడు విశ్వావసుఁడు యుక్తవయస్కుండైనంతట తన కుమారునకు రూపలక్షణాభిరామమైన సద్వంశజాత యగు సుగుణవతి యను కన్యకం దెచ్చి పెండ్లిగావించెను. పిమ్మట కొలదికాలములోననే సుగుణవతి కాపురంబున కత్తవారియింటికి వచ్చెను. పేరునకు దగినట్లే సద్గుణముల కునికియై యొప్పుచున్న యాతరుణి, భర్తయందును నత్తమామల యందును నధికమగు భక్తిగలిగి సదా వారికి శుశ్రూషలు చేయుచు, పతిని మించిన దైవంబు సతికి వేఱొకటి కలుగదని భావించి యెల్లప్పుడు నతని సేవయందే నిమగ్నయై వర్తించుచుండెను. ఆమెయత్త

మామ లటువంటి యుత్తమురాలు తమకు కోడలగుట కెంతయు సంతుష్టిని బొంది యామెయందు మిక్కిలి ప్రియము గలవారై యుండిరి. సుగుణవతి ప్రవర్తనముం జూచిన వారి కెల్లరకు నామెయం దధికమైన పూజ్యభావ ముదయించి కొనియాడుచుండిరి.

ప్రదీపుఁడు మంచి నడవడి గలిగి భార్యయందు మిగుల ననురాగముతో వర్తించుచుండెను. కాని కొన్ని దినములకు జీవలుండను వానితో నతనికి స్నేహము కుదిరి నాఁటగోలె బుద్ధి పెడదారిం బట్టి సతిమీఁదితలఁపు సన్నగిల్లసాగెను. ఏలనఁగా జీవలుండు కడుదుర్మార్గుఁడు, జారుఁడు, అతఁడు ప్రదీపు నెట్లో తన మాయ పువలలోఁ జిక్కించుకొని, తన యిష్టానుసారముగా వర్తించునట్లు జేసికొని యొక వేశ్య కాంతతో తగులఁగలిగించెను. నేర్పుగత్తెయైన యా వెలయాలు తన మోసపునటనలచే ప్రదీపుని చిత్తము వశముఁగావించుకొని తనచేతి కీలుబొమ్మయుంబోలె నాటలాడింపఁ దొడంగెను. జీవలుని మైత్రిచే జారత్వమున కలవాటుపడిన బ్రాహ్మణ కుమారుఁడు, క్రమముగా కులాచార వర్తనమును సయితము గోల్పోయి ఎప్పుడో యొక వేళఁదప్ప గృహంబునకు వచ్చుట సయితము మాని యెల్లపుడును తనకు ప్రియురాలుగా నేర్పడిన భోగపు చానతోడిదియే లోకముగా నెంచి దాని వెంటనే వసింప నారంభించెను. వాని దుర్వర్తన మెఱింగి తలిదండ్రులును బంధువులును నట్టి ప్రవర్తనము తగినది కాదని యెన్నియోవిధముల ప్రబోధించిరి. కాని, యాసంబంధమును వదలుటకు మారుగా బోధవలన నతనికి మఱియు వేశ్యానురాగముదృఢమయ్యెను.

సునంద యను పేరుగల యాగణికాంగన తన చాతుర్యంబు నుపయోగించి ప్రదీపునింటగల సర్వమును క్రమక్రమముగా నపహరించి తమ వలన నైనంత వరకును కుమారుని మంచి దారికిఁద్రిప్ప బ్రయత్నించియు లాభము గలుగనందున నిరాశులై వానివిధి యెట్లుండెనో యటుల జరుగగలదని మిన్నకుండిరి. సుగుణనిధియైన సుగుణవతి, తన విభుండు వేశ్యాసక్తుఁడై, తోఁచినపు డెపుడో భోజనార్థ మింటికివచ్చుచు, భుజించిమరుక్షణముననే వెడలిపోవు చుండుటయు తనపై ననురాగములేక వర్తించుచుండుటయుం గనుఁగొనుచుండినదయ్యును, నోరెత్తి యిదియిట్లనియొక మాటయైనం బలుకక, దైవసముఁడనియు, నతని నాక్షేపించుట సాధ్వీలక్షణము గాదనియు, ఏది విభునకు ప్రియమగునో యాకార్యమునునిరం

తరాయముగా జరుగునట్లు తోడ్పడుటయే తనకు ధర్మమనియు నిశ్చయించి ఇంటికి వచ్చినపుడు వల్లభుని నెంతయు నాదరించి ప్రియంబు రెట్టింప నన్నపానములఁ బరితృప్తి నొందించుచు, నెట్టి కళంకమును లేని చిత్తంబుతో సంతోషమున నతని సంతుష్టియే తన మేలుగా నెంచుచు, కొడుకు ప్రవర్తనమునకై చింతిల్లుచుండెడి యత్తమామల నూరార్చుచు, కాలము బుచ్చుచుండెను. నిజనాథుండు దీర్ఘాయుష్మంతుండై సంతసమున నుండులాగున కృపఁ జేయవలయునని యెల్లప్పుడు సమ్మానినీమణి భగవంతునిఁ ప్రార్థించుచుండెనే, కాని, కలలోనైనను నతని కెట్టి కీడునుం దలంచి యెఱుంగదు. అపరాధముల నెంచి నిందించునదియు గాదు.

ఈప్రకారము కొంతకాలము గడచెను. వేశ్యాంగన కొసంగుటకు ప్రదీపున కేమియు లేకపోయెను. దినదినమే యా మాయలాడి ధనమును దెమ్మనియు, సొమ్ములనిమ్మనియు నతని నెంతయుం బొందఱ పెట్టసాగెను. కాని యతండేమి చేయఁగలడు? తనయింట గల వరకును క్రమముగా నర్పించి సర్వశూన్యముఁ గావించెను. ఏవిధమున నైనయుం దన వలపుల సానియభిమతముఁ దీర్చుటయే యతని కావశ్యమగు కార్యముగా నుండెను. ఎన్నిరీతుల కర్తవ్యమును గూర్చి యాలోచించినను తగిన మార్గము దోఁచ దయ్యెను. తుదకు, తనకు మహోపకారముఁ జేసిన వానినిగాఁ దలచి యున్న ప్రియమిత్రుండగు జీవలునితో నాలోచించి యొక యుపాయంబును నిర్ధారణ గావించి తన మందిరమునకరిగి, వాడుక ప్రకారము భోజనముఁ గావించి యైనంతట భార్యనుబిలిచి "గుణవతీ! నేడొక కార్యార్థము నాకు కొంతధనము కావలసివచ్చినది. ఎట్లు చూచినను తదర్థం బేయుపాయమును దోఁచకున్నది. అన్యథాదలంపక నీవు ధరించియుండెడి యాభరణములలో నొక దానిం దీసి యొసంగితివేని వానిని విక్రయించి నాయక్కఱఁ దీర్చుకొనెదను, ఒల్లననకు" మని మెల్లగా నడిగెను. ఇంటిలో నే వస్తువును లేకుండుటచే వెలయాలి కొసఁగుట కాదరువు లేనందున నతండాలాగున నక్కఱ గలదనెడి నెపమిడి యడుగుచున్నాఁడనియు భర్తకు వ్యతిరేకముగాఁ బలుకుట యుత్తమసతికిఁ దగ దనియు, బుద్ధిమంతురాలైన యామె గ్రహించి మారాడకయు, తడవుఁ జేయకయు, తాను ధరించియున్నట్టి యాభరణములలో నొక్కదానిం దీసి భర్తకొసంగెను. పాపశీలుండైన యావిప్రసుతుఁడు తన భార్యసుగుణ సంపదనైనం దలంపక తనలో 'అడుగఁగనే యింత శీఘ్రముగా నిచ్చునని తలంచిన

వాడను గాను కష్టము లేకనే నాయభిమతము చేకూరినది' అని సంతసించి, యా సొమ్ములు వేశ్యకొసంగి సంతుష్టుడయ్యెను.

ఈలాగుననే క్రమక్రమముగా నడపుచును నేవిధమైనా కులంజెప్పి భార్యకుం గలిగియుండిన యాభరణములన్నియుం గైకొనిపోయి గణకకు దత్తముజేసి ధన్యుడైనట్లు దలంచెను. కాని యంతటితోనైనను దాని యాశ దీఱినదిగాదు. మఱియుం డెబ్బని బాధించజొచ్చెను. ప్రదీపున కేమిచేయుదునా యనెడి దిగులును దుఃఖమును నతిశయింపఁదొడంగినది. అప్పటికైనను బుద్ధి తెచ్చుకొని దాని తగులమును వదలించుకొనుటకు మందమతియైన వానికి సమ్మతము లేదయ్యెను. జరుగవలసిన దెట్లు? ఇట్లు చింతించెను.

అయ్యో! ఇల్లు గుల్ల జేసితి. పుణ్యశీలయగు భార్య ధరించియున్న వానిలో మంగళసూత్ర మొక్కటిదక్క మఱిగల యాభరణములనన్నిటి నపహరించి తెచ్చియిచ్చియుంగినాడను. వేశ్యకాంత తృప్తినొందక మఱియుం డెబ్బనుచున్నది. ఎచ్చటగొనిరాగలను? దీని సంబంధమును విడుచుటకు నా మనంబొల్లకున్నది. ఏమిచేయుదును? దీనికిం దగిన యుపాయంబును దెలుపుటకు నామిత్రుండగు జీవలుండే వలంతి. అతనితో నాలోచింపకున్న కర్తవ్యము దెలియ' దనిదలంచి, తత్క్షణంబ యతనియొద్దకరిగి తనకు తటస్థించిన యిక్కట్టును వివరించి "మిత్రమా! నిర్ధనుండనై యున్నాను. వెలయాలి కిచ్చుటకుపాయ మెయ్యది యేనియు నాలోచించి చెప్పుము" అని యడిగెను.

జీవలుండు తత్పూర్వమే ప్రదీపుని హీనస్థితి నెఱింగియున్న వాఁడు. కావున నప్పుడతనిచే చెప్పినమాటలువిని కర్తవ్యము నాలోచించి, తలను పంకించి, యేదో యుపాయము నిశ్చయించిన వానివలె గనుపట్టుచు "ప్రదీపా! చింతింపకుము. ధనార్జనమునకు మంచి మార్గమును కనిపెట్టితిని" అనెను.

ప్రదీ:-(ఆతురపముతో) కనుగొంటివా! ఏదీ? ఎట్లు?

జీవ:-ధనము సంపాదింపవలయు ననిన మొదల దీనికిమించిన సదుపాయము గలుగదు. నేను చెప్పెడి పద్ధతి నవలంబించితివేని, నీకు ధనాభావమువలన నెప్పుడును కష్టము గలుగనేకలుగదు. సదా నీచేత డబ్బు మొదలు మండును సుమీ!

ప్రది:—త్వరితముగా నీవు చెప్ప నెంచినరీతి నెఱింగింపుము. ఏపని జేయుమనినను జేయుటకు సంసిద్ధుఁడనై యున్నాను.

జీవ:—వెఱపును సంశయమును విడువవలయును.

ప్రది:—ఆ రెండును న్యాయముగ కలుగనేకలుగవు. ఏలాగునఁగాని యర్థము దొఱకుట ముఖ్యము.

జీవ:—ఐన వినుము. మొదట్ల కొంచెము కష్టముగాఁ దోఁచినను, పిమ్మట నదిమేలైన మార్గమని నీబుద్ధికేఁ దోఁచగలదు. ఎట్లనగా, నీవు ధైర్యమునుబూని చోరవృత్తికి గడంగవలయు. దయయు ధర్మచింతయు విడిచి దొంగతనము నొనరించిన, కావలసిన డబ్బును సొమ్ములును నీకు దొరకఁగలవు. అన్యుల సహాయము నీకు కావలసినదియే లేదు నీప్రియురాలైన వేశ్య దేనినడిగినను సంశయింపక యివ్వగలశక్తి నీకుఁ గలుగును.

ప్రదీపుఁడు కొంచెము సంశయించెను. అతని లక్షణమునుచూచి జీవలుఁడు "ఓహో! ప్రదీపా! సందేహింపరాదని మొదటనే చెప్పితినిగదా! ధైర్యసాహసములు గలవానికే యీవృత్తితగినది. అట్టిగుణంబులు గలిగి యుండిననే ప్రయత్నింపుము" అని పలికెను. ప్రదీపునకు వేఱుమార్గము దోఁచలేదు. మఱి జరుగవలసినది యెట్లు, ఆపనికి బూనుటయే యుక్తమని నిశ్చయించి "జీవలా! నీవు బోధించినలాగున చేయుటకు నేనుపూర్ణముగా సమ్మతించినాఁడ" అనెను.

చౌర్యక్రియయందు మిగుల నారితేరిన జీవలుండు తద్విధానము నంతయుం జక్కగా నుపదేశించి "ఇంకఁ బొమ్ము. నీకు లేమిడి యనునది యుండదని" చెప్పి ధైర్యమునుగఱపి తనదారింబోయెను. అది మొదలుగా ప్రదీపుఁడచ్చటచ్చట దొంగిలించి ధనాభరణములం దెచ్చి వారకాంత కొసంగుచు దానిం గూడి సుఖంబులను బొందుచుండెను. క్రమముగా పట్టణములో దొంగతనము లెక్కువగుటయు తద్వార్తను రాజువిని, "జాగ్రత్తగా దొంగలను గని పట్టి తనయొద్దకు దేవలసిన"దనియు "లేనియెడల కఠినముగా శిక్షింపుదు" ననియును పురరక్షకుల కాజ్ఞాపించెను. రాజాజ్ఞకు వెఱచి వారలు జాగ్రతవహించి రేయింబవళ్లును దొంగలం గనిబట్టు కార్యమందు నిమగ్నులై యుండిరి.

ఇట్లుండగా నొకనాఁటి నిశీథకాలంబున ప్రదీపుఁడొక గొప్పధనికు నింటికి కన్నము బెట్టి లోపలఁజొచ్చి వెలపొడుగు సొమ్ములను, బంగారమును, డబ్బును నపహరించి వెలువడి వచ్చుచుండగా హఠాత్తుగా తలారు

లతని సంధించి యతఁడు గొనిపోవుచున్న ధనకనకాదులతోఁగూడ పట్టుకొని బంధించి కొనిచని తెల్లవారుదనుక తమ కావలిలోఁ బెట్టుకొని యుండి, మఱునాడు కొలువైయున్న సమయమున రాజసమ్ముఖంబునకుఁ గొనిపోయి యతనిని నిలిపి యతఁడు దొంగిలించినవాని నటనుంచి "మహాప్రభో! వీఁడు మిక్కిలి పెద్దదొంగ ఈపురంబున జరుగుచున్న దొంగతనములలో నూటికి తొంబది భాగములు వీనివల్లనే జరుగుచున్నవి వీనివలన కొందఱకు ప్రాణాపాయకరములగు దూతలు సయితము కలిగినవి. మహాప్రయాసతో యీ చోరునింబట్టి తెచ్చితి"మని విన్నపముఁ గావించిరి.

"ఏమి చెప్పెదవు?" అని రాజు దొంగయైన ప్రదీపునడిగెను. కాని సొత్తులతోఁ బట్టుబడియున్న యతండేమి చెప్పగలఁడు? మౌనముదాల్చి యుండెను. అపుడా సభలో నుండిన వారిలో నతని నెఱింగినవారయి కొందఱు, 'అతండు బ్రాహ్మణుం'డనియు, 'నప్పురంబుననే వసించువాఁ డనియు' 'వృద్ధులగు తలిదండ్రులను పరమసాధ్వియైన భార్యను వదలి, స్త్రీలోలుఁడై యిల్లుగుల్లఁజేసి తుదకీ దుర్వృత్తిఁ గడంగినవాఁ' డనియు మహీపతి కెఱింగించిరి. వారి మాటలువిని భూపాలుం డాగ్రహముఁజెంది "ఉత్తమజాతిలోఁబుట్టియు ననర్థంబులైన దుష్కార్యంబులు జేయఁ గడంగిన యీఖలుఁడు విప్రుండని పలుకుటకుఁ దగినవాఁడు గాఁడు. పరమ నీచునిం గొనిపోయి తెగటార్పుం"డని సూనరుల కాజ్ఞాపించెను.

అపుడే యీవృత్తాంతము పురంబున నంతటను వ్యాపించెను. వృద్ధులైన ప్రదీపుని తల్లిదండ్రులును భార్యయు ప్రపంచము మునింగిపోయిన చందమున తమ మనంబునకుఁ దోఁచుటయు, పిడుగువంటి యీ వార్తను విని గుండియలు ప్రీలి బోరున వాపోవఁ దొడంగిరి. అట్టియెడ పుణ్యశీల యాగుణవతి శోకంబు స్వరూపంబుఁ దాల్చెనో యన వాపోవుచు కడురయంబున రాజసభకుం జనియెను. అట దౌవారికు లాపరమసాధ్విని వారించుటకు నోరురాక శిలావిగ్రహంబులవలె నిలిచియుండిరి. ఆమె కొలువుఁజొచ్చి పేరోలగంబుననుండు మహీవల్లభుని ముందు నిలుచుటయు, నామె మరణదండనకు పాత్రుఁడైన యావిప్రకుమారుని భార్యయనియు, మహాపుణ్యవర్తన యనియు సభ్యులు రాజున కెఱింగించిరి. రాజా సుశీలంగాంచి "అమ్మా! ఇచటి కేలవచ్చితివి? రాజసభలో నీకేమి పని గలిగెను?" అని ప్రశ్నించెను.

సుగు:-మహాప్రభుశేఖరా! నీదర్శనార్థమే వచ్చినదానను ఖండింపఁబడుటకై కొనిపోఁబడుటకు బంధింపఁబడియున్న యీ యౌవన పురుషుండు మదీయ వల్లభుండు, ఇతనికి మరణదండన విధించుట నెఱింగి మన్నింపవలయునని వేఁడుకొనుట కొఱకు వచ్చితిని.

రాజు:-అతఁడెన్నో మహాపరాధములు చేసిన దుష్టుండు, బ్రాహ్మణజాతిలోఁ బుట్టియు కులాచార ధర్మములు విడిచి వర్తించుచుండిన పాపశీలుఁడు. ఎందరెందరో యితనివలన నెన్నెన్నికష్టములకో పాలై యల్లాడుచున్నారు. నాపట్టణమున నిటువంటి క్రూరుండుండుట యిక్కలికీడు. ఇతనియొక్కని చావువలన పలువురు సుఖమును బొందఁగలరని యెంచి యిట్టి శిక్ష నితనికి విధించినాఁడను అది ధర్మవిరుద్ధముగా నాబుద్ధికిఁ దోచలేదు.

సుగు:—రాజేంద్రా! నీవు యీకార్యము న్యాయముగా తోఁచినను దిక్కులేని దానను గా నన్ను పెతలాంపఁజేయుట నీవంటి ధర్మజ్ఞునకు పాడిగాదు. ఒక ధర్మసూక్ష్మమును విన్నవించెదను వినుము. శిక్షించుటయే దృఢమైన నీయుద్దేశమగునేని, నీవు గావించు దండన ననుభవించుటకు బాధ్యురాలను నేనేగాని నాభర్త గానేరఁడు.

రాజు:—అదియెట్లు? ఇతఁడొనర్చిన యపరాధమునకుఁ దగిన దండన ననుభవింప వలసినవాఁడితఁడు గాక నీవెట్లు నగుదువు? ఇందు నీకేమి బాధ్యత యున్నది.

సుగు:—నరవరా! నేనుతత్కారణంబును విన్నవించెదనువినుము. పూర్వకర్మ బుద్ధుడగు మదీయ వల్లభుండు వారకాంత వలలోఁజిక్కికొని యింటగలసర్వంబును దానికర్పించి లేమిడి తనంబునకులోనై, వారవనిత యడిగిన యర్థంబునొసంగలేక పరితపించుచుండుటను తెలిసికొని నాయెడఁ గడయుం బతియేయని తలంచి వర్తించుచుండు దానినైన నేను ప్రాణనాథుని వ్యాకులమును దీర్పకుండుట పాపంబని యెంచి క్రమముగానడిగిన పుడెల్ల నాయాభరణములలో నొక్కొకటి యొసంగుచుంటిని. వానిని వేశ్యాంగన కర్పించి మత్పతివిచారంబు దక్కియుండెను. సొమ్ములన్నియు నిచ్చివైచినంతట పతిని సంతోషపరచుటకై నేనేవియు నొసంగలేనైతిని. తత్కారణమున, వేశ్యకు ధనంబొసగుటకు నితండీచోరవృత్తి నవలంభించెనుగాని, స్వార్థపరుండై చేసినవాఁడు కాఁడని నేను దృఢముగా చెప్పఁగలను. ఇపుడును నేఁడేనియు నాభరణమో ధనమో నేనొసంగినదానినైనచో నాపతి యిట్టి యకార్యము నొనరించి యుండఁడు. వల్లభునికోరికఁ

దీర్పలేక పోయిన నేరము నాయందు పూర్ణముగాఁ గలదు. ఈ విషయమున, వారకాంత యందుగాని, నావిభునియందుఁగాని లేశమైనను తప్పు గలుగదు, వెలయాలు తనవృత్తి ననుసరించి ధనముగోరినది. నా భర్త దానిని తృప్తిపరచుటకై, ధనాభావమున దొంగతనముఁ జేయఁ దొడంగెను, ఇంకను నాయొద్దసొమ్ములుండి యిచ్చుచుంటినేని యితండు దుష్క్రియలం జేయనొల్లండు. ఇవ్వలేక యిట్టి కార్యముల జేయుటకు ప్రయత్నింపఁ జేసినదానను నేనేయగుటచే యీ మరణదండనకు నేనర్హురాలను ధర్మసూత్రంబును దెలిసికొని నా ప్రాణేశ్వరుని విడిపించి నన్నుఁ దండింపుఁడు. భర్తకొరకై ప్రాణములను విడుచుట నామనంబున కెంతయు బ్రియంబై యుండును. భూమీశ్వరా! నా మొరాలించి మత్పతిని విడువుము. ఇదె మద్వల్లభునకు బదులు నాప్రాణములర్పింప సిద్ధముగానున్నాను."

ఈప్రకారము విన్నవించుచున్న సుగుణవతి పలుకులు విని, సభ్యులామె సుగుణంబుల కెంతయు మెచ్చి యామెయందు కనికరమును జూపుమని రాజును బ్రార్థించిరి. ఆసాధ్వీమణి మాటలకు రాజుమనంబు గరఁగి, 'ఆహా! ఇట్టియువతిగదా పతివ్రత? లోకంబున నింతటి సాధ్వీమణులు గలిగి యుండుట వలననే సూర్య చంద్రులు ధర్మపథంబున నిలిచి వర్తించుచున్నారు' అని తలంచి మిక్కిలి జాలిగలవాఁడై "తల్లీ గుణవతీ! నీ ప్రభావమద్వితీయమైనది. నిన్నుఁ దర్శించినను తలంచినను సర్వపాపములు పటాపంచలై పోవును. నీకిశోకవ్యాకులములు గలిగించినవాని వంశము నశించుట తథ్యము ఇదె; మరణశిక్షకు పాత్రుండై చావునకు సంసిద్ధుడై యుండెడి నీవల్లభుని నేరమును మన్నించి విడిచితిని. ఇంక శోకంబు విడిచి సంతోషముతోనతనిం దోడ్కొనిపొమ్ము" అని చెప్పించి తొల్లింటిచందమున నామె కాపురంబు సిరిసంపదలతోఁగూడి యొప్పుచుండు లాగున వలయుధనకనకాంబరాభరణాదుల నవ్వారిగా నొసంగి, యామె భర్తను బిలిచి "సత్ప్రవర్తనుండవై ప్రవర్తింపు" మని బుద్ధిగరపి వారిగృహంబునకనిచెను. ఎల్లవారును సుగుణవతి సుశీలమును మెచ్చి మిక్కిలి ప్రశంసించిరి. మందిరమున కరిగినంతట నమ్ముద్దియ పుత్రశోకంబునఁ దల్లడిల్లుచున్న యత్తమామలకు, మ్రొక్కి వారికొడుకుం జూపి జరిగినదంతయు దెలియఁబలికిన పరమానందమును బొంది వారు తమకు నమస్కరించిన కుమారునిం గౌఁగలించుకొని, పరమపతివ్రతాశిరోమణియగు సుగుణవతి

మహిమను మెచ్చి "తల్లీ! నీవు మాపాలి భాగ్యదేవతవని" యనేక విధంబులఁ గొనియాడిరి.

అప్పటినుండియు ప్రదీపుఁడు తా నొనరించిన యకార్యములం దలంచి పశ్చాత్తాపమును బొంది దుర్బుద్ధులు వీడి ప్రశంసార్హురాలైన తన స్వపత్నియం దెంతయు ననురాగము గలవాఁడై వర్తించుచు నామె వలన సంతతినిఁబడసి సౌఖ్యమున కాలమును గడపుచుండెను.

సుగుణావతి కథ సంపూర్ణము

## సుశీలకథ

సరస్వతీ నదీతీరమున కౌండిన్యుఁడను మునివరుం డొక్కండాశ్రమమును గల్పించుకొని వసించి తపంబు గావించుకొనుచుండెను. మహాపతివ్రతయై యొప్పుసుశీలయను నారీరత్న మతనిభార్య. అప్పుణ్యవతి సర్వకాల సర్వావస్థలయందును భర్తశుశ్రూషయందు యేమరక సేవింపుచు పతి యాజ్ఞను తలదాల్చి వినయవిధేయతలుగలిగి వర్తించుచుండును. ప్రతిదినమును భర్తకంటెను మున్నుగ నిదురలేచి దంత ధావనాది క్రియలు నిర్వర్తించుకొని, యిల్లలికి ముగ్గులుబెట్టి, పాత్రములను దోమి యింటఁగల వస్తుచయములను సరిగా సమర్చిపెట్టి స్నానముఁజేసి శుభ్రవస్త్రమును కట్టుకొని మొగంబునఁ గుంకుమ రేఖఁదీర్చి, దేవపూజకు వలయు పుష్ప గంధాక్షతంబులును, నగ్నిహోత్రంబులకు సమిత్కుశాత్యాది వస్తుచయంబును నమర్చి పతి నిద్రలేవగనే లక్ష్మీదేవియుఁబోలె నొప్పుచు నతని పాదంబులకు మ్రొక్కి యతండు స్నానము జేసివచ్చుటలోన మడివస్త్రములం దెచ్చి కృష్ణాజినమును దర్భాసనముం బరచి సంధ్యావందనాదులకు పాత్రములలో శుద్ధజలంబులు దెచ్చి యునిచి నాథుండు వచ్చి యాహ్నిక క్రియల నారంభించిన పిమ్మట నతని యనుజ్ఞను బొంది యితరములయిన గృహకృత్యంబులకుఁ గడంగును.

వల్లభుఁడు దేవపూజాగ్ని హోత్రాది కార్యములను నెరవేర్చుటకు లోపల వంటగావించి నివేదించుటకు పదార్థములు గొనివచ్చి పెట్టి, నివేదించి నంతట నతిథులకును నభ్యాగతులకును తనభర్తకును, నన్నపానా

దులు కడుపు౯బెట్టి పైనంతట తాను భుజించును. కార్యార్థియై పతి యె చ్చటికైనను బోయెనేని యతండు మరలి గృహంబునకు వచ్చు పర్యంత మును, తలదువ్వుకొనుట, పూవులు దాల్చుట యలంకరించుకొనుట శయ్యపైఁ బరుండుట యిట్టి కార్యములను యెన్నఁడును నాయమ జేసి యెఱుంగదు. ఒకపూటమాత్రము భుజింపుచు, పరపురుషులతోఁ బలుకక, పరుల కుటీరంబుల కరుగక నాథుని రాకఁ గోరుచుండును. భగవంతుని ధ్యానించుటయు, పతిపాద చింతనములు దక్క యాసాధ్వీమణికి గలలోనైనను వేఱుతలంపు కలుగదయ్యెను.

ఇవ్విధంబున సుశీల పతి సేవాసక్తయై వర్తించుచుండఁగా కొండిన్యుఁడామె ప్రవర్తనముంజూచి సంతుష్టాంతరంగుడై ప్రియంబతిశయింపఁగా మిక్కిలి యాదరముతోఁ జూచుచుండెను. అమ్మునివరుం డేదో కార్యార్థము భార్యాసహితుఁడై మామగారింటికిఁ బోవలసినట్లు తటస్థించెను. కావున తన యర్థాంగినిఁ దోడ్కొనిపోయి పది దినంబు లచటనుండి మరలి స్వాశ్రమమునకు వచ్చుచుండి, మధ్యాహ్నసమయ మగుటయు మార్గంబున సెలయేరొకటి పారుచుండుటం గని భార్యను తీరంబుననిలిపి మాధ్యాహ్నిక క్రియలు దీర్చుకొనుటకై నీటిలోనికిఁ బోయెను.

అపుడా సెలయేటియొడ్డున నించుకదూరములో శుభ్రవస్త్రాభరణములు ధరించి పుష్పచందనాదులచే నలంకృతాంగులైన కొందఱుయువతీమణులు చేరి తా మేదియో చేయుచున్నట్లు సుశీలకు గోచరించుటయు వారిదగ్గఱకరిగి "కాంతామణులారా! మీర లెచట నుండెడివారలు? ఈ యేటిగట్టున చేయుచున్న కార్యమెయ్యది" యని యడిగిన వారలిట్లు చెప్పిరి.

స్త్రీలు:—అమ్మా! పద్మనాభవ్రతము, శ్రద్ధాభక్తులు గలిగి యీ వ్రతము నొనరించువారికి సకలైశ్వర్యములును కలుగును. ప్రతి సంవత్సరమును నదీతీరంబున మే మెల్లరమును యీ వ్రతమును చేయుచుండుదుము. మాతు యది ప్రతిదిన మగుటచే పద్మనాభస్వామినిఁ బ్రతిష్టించి పూజింప బోవుచున్నారము.

సుశీల:—ఈ వ్రతమును నెల్లరునుం జేయవచ్చునా?

స్త్రీలు:— ఏ యభ్యంతరమును లేదు. భగవంతు నారాధించుట కెల్లరకును హక్కుగలదు.

సుశీల: -అటులనగునేని యీ వ్రతకల్పము నెఱింగింపుఁడు.

ఆ స్త్రీలు సుశీలకు వ్రతవిధానమును జెప్పిరి. ఆమె నాడే వ్రతారంభ మొనరించి యుచ్చటి యతివల సహాయమువలన భగవంతునిం బూజించి తన భర్త మధ్యాహ్న క్రియలుగడిపి వచ్చువంతలోపల వ్రతమును సమాప్తముంగావించి, తచ్చిహ్నముగా నొకతోరమును గట్టుకొని వచ్చెను. కౌండిన్యుండటనుండి యామెను దోడ్కొని నిజాశ్రమంబున కరిగెను. కొలదిదినములు జరిగినంతట నొకనాడు మునివరుండు భార్యచేతి యందు గట్టుకొనియున్న దారముంజూచి యదియేమని యడిగెను. ఆమె యది కట్టుకొనుటకు నిమిత్తమైన వృత్తాంతమును జెప్పెను. కాని యా మాటల నతండు నమ్మక, యామె శీలము నెఱింగియున్న వాండయ్యు కళంకచిత్తుండై సంశయించి యదియేదియో వశీకరణ రక్షాసూత్రముగా నుండునని శంకించి మంచిచెడుగుల నాలోచింపక యత్యాగ్రహముతో "ఓసి! మాయలాడీ! నాకుం దెలియకనే నీవీ సూత్రమును గట్టుకొనుట దలంపంగా, నీప్రవర్తనము వంశయాస్పదమై తోంచుచున్నది. నిజముగా కారణముం జెప్పక నాతో బొంకుచున్నావు. కానిమ్ము, వాస్తవార్థముం దెలిసికొని తగిన శాంతిం గావించెదగాక" యని యుగ్రముగం బలికి యామె చేతనుండు వ్రతసూత్రమును ద్రెంచి పాఱవైచెను. చెడుకాలము తటస్థించినపుడు దుర్బుద్ధులు పొడంగుట సహజమే కదా? పుణ్యచరిత్ర యగు భార్య నడతయందు శంకగలవాండై దైవసూత్రమును ద్రెంచిన దోషంబువలన. కౌండిన్యున కున్మాదము గలిగెను.

అతండు జపతప ప్రముఖసత్కార్యములను వర్జించి నిలిచినచోట నిలువక యడవులలో నిచ్చవచ్చినట్లు తిరుగసాగెను. అతని వెఱ్ఱిచూపులును, వికటపు నగవును, నవ్యక్తప్రలాపములునుజూచి యతని నెఱింగిన వారలు "ఇంతటి మంచివాని కిటువంటి దుర్గుణంబు వాటిల్లెంగదా" యని మిక్కిలి చింతాక్రాంతులగుచుండిరి. అతని భార్యయగు సుశీలయున్నో దైవతాపరాధంబు కతనందనపతి యున్మాదమును బొందుటకు తెలిసికొని యేమి చేయుటకుందోంచక, యేదేవునికిం బ్రియంబుగాగట్టిన సూత్రమును ద్రెంచివైచి తన భర్తమహాపరాధ మొనర్చెనో యా పద్మనాభస్వామినే యారాధించి తత్కృపాసిద్ధి వడయుటదప్ప యెండుపరిహారమగు చికిత్సచే తనపతి యున్మాదము తొలంగదని నిశ్చయించి, భగవదారాధనంబునకుం గడంగి, పరిశుద్ధ ప్రదేశమున హృషీకేశునిం బ్రతిష్ఠించి, శుచిర్భూతియై పద్మాసనమునం గూర్చుండి యధికమైన నిశ్చలభక్తితో షోడ

పచార యుక్తముగా పూజించి తదీయ పావనపాద కమలములు చిత్తంబున స్థిరంబుగ నిలిపి, యంతర్దృష్టిలో దివ్యమంగళ విగ్రహుండగు దేవదేవునిస్వరూపమును గల్పించుకొని విలోకింపుచు, వర్ణింపుచుండొంత తడవుతన్మయత్వంబుననుండి కరంబులుముకుళించి "పరమేశ్వరా! ఇందిరా సుందరీమనోనాయకా! సకలకల్యాణ గుణాభిరామస్వరూపా! సర్వాత్మకా! భక్తజనమందారా! కరుణాసాగరా! దీనపరిపాలకా! కలుషాబ్ధితరణా! కమలనయనా! నీకు నమస్కారము. కరిరాజవరదా! ఖగరాజగమనా! నీకు నమస్కారము. సకలసంకట విదారకా! పుణ్యచరితా! నీకు నమస్కారము. పాహి! నా యపరాధములు క్షమింపుము.

మ. కరుణాపూర్ణ జగత్స్వరూపరవిసం ♦ కాశప్రభాభాసురా!
యరవిందాంఘ్రి సుధాబ్ధిజారమణవి ♦ తానందనారాయణా!
దురితారణ్య కుఠారభక్తజన సం ♦ తోషప్రదా పావనా!
నిరతంబున్మదినెంతునిన్ను గృప ♦ మన్నింపగదే యీశ్వరా!

గీ. దీనమందార గుణనిధి ♦ దేవదేవ!
పుణ్యచారిత్ర సంకటాం ♦ భోధితరణ!
చక్రహస్త పరాత్పర ♦ సాధులోల
మద్విభుని యజ్ఞతను వేగ ♦ మాన్పుమభవ!

క. తోయజనాథ సురాశ్రయ
మాయెడగల దోషములను ♦ మన్నింపుము ల
క్ష్మీయుత పన్నగతల్ప
మాయావర్తన హరీ న ♦ మామి ముకుందా!"

అని యనేకవిధంబుల స్తోత్రముఁ గావించుచున్న యాపరమ పతివ్రతపై పరమ పురుషుండగు జనార్దనునకు కనికరంబు జనించి యన్యులకు నేత్రగోచరుండు గాక యామెకు మాత్రము దేదీప్యమానంబగు రమ్యాకారంబుతోఁ గనుపట్టెను. సుశీల యమ్మహాతేజుండు శ్రీయఃపతియైన వైకుంఠుడని తెలిసికొని కన్నుల నానందబాష్పములు దొరుఁగ, మేన బులకాంకురంబు లంకురింపఁ గరంబును మోడ్చి నమస్కృతిఁగావించి పలుకుటకు నోరురాక యట్టె నిలిచియున్న యామానినీ తిలకముపై కృపాదృష్టులొలయ మందహాస సుందరవదనుండై రమానాథుండు మృదుమధురంబులైన వచనంబులతో "ఓ పుణ్యశీలా! నీభక్తికిని నిర్మలశీలంబునకును, నీతపంబునకును సంతసించితి. నీకువాంఛ యెద్దియో యడుగుము

సంగెవే" అనవుండు సుశీల పరమానందంబున నుప్పొంగి "భక్తవత్సలా! యీ గ్యాండ యున్మంగ గర్మవశంబున నావిభుండు మహాపరాధంబని తలంపక, భవదీయ చిహ్నాంబైన వ్రత సూత్రమును ద్రెంచి పాఱవైచి, తత్ఫలంబుగా నున్మాదావస్థకు పాలై తిరుగుచున్నవాఁడు. ఆ మునివర్యుని యందు కనికరించి యతని యవస్థ దీఱునటుల ననుగ్రహించి సదా మాకు నీయందు భక్తియు నీధ్యానాసక్తియుం గలిగియుండులాగు ప్రసాదింపుము ఇంతకు మిక్కిలి యేదియును నేను గోరనొల్లను" అని విన్నవించెను.

కరుణామయుండైన హృషీకేశుండు సుశీల సద్భావమునకును భక్తికిని సంతుష్టుండై "గుణవతీ, ఆలాగే! నీవు కోరినట్లే ప్రసాదించితిని. భ్రాంతిచిత్తుఁడై పతియాగమనంబును గోరుచుండుము తనకు సంభవించిన యున్మాదంబు తొలంగి నీవిభుండు నీయొద్దకు రాగలండు. ఇది మొదలుగా నీవును, నీభర్తయు సదా నన్ను నారాధించుచు సర్వ సంపదలుగలిగి సౌఖ్య మనుభవించుచుండి యంత్యమున నిరువురును మదీయ సన్నిధానంబును జేరఁగలరు. నీకు శుభంబగు గాక" యని యాదేశించి యంతర్ధానంబు నొందెను. అంతట సుశీల యా దేవదేవునకుఁ దనపైఁ గలిగిన కృపావిశేషమున కెంతయు నలరి పెక్కు తెఱంగుల స్తోత్రముఁ గావించి వల్లభుని రాకను నిరీక్షించుచుండెను.

భగవత్కృపా విశేషమున కౌండిన్యుని యున్మాదావస్థ తొలంగిపోయెను. అతండు తొల్లింటికరణివివేకమును బొంది గృహంబున కరుగుదెంచిన, భార్యయమ్మహానుభావునకు నమస్కరించి యతనికి మనోవైకల్యంబు కలిగినంతట జరిగిన సర్వము నెఱింగించి శ్రియఃపతి యాదేశించిన రీతిం దెలుపుటయు నతండు తానొనరించిన మహాపచారమున కెంతయుం బశ్చాత్తాపముఁ జెంది, చేసిన కార్యమునకుఁ దన కనుభవింపనైన ఫలంబును దలంచినవాఁడై, లోకంబున నెవ్వఁడైనను, భగవంతునినిందించినను, భగవద్భక్తులను తిరస్కరించినను నట్టివాఁడు సకల కష్టములకు లోనగునని నిశ్చయించినాఁడు మొదలుగా భగవంతుని చింతవమునవిమగ్నుఁడై పతివ్రతారత్నంబైన భార్యంగూడి, దైవకృపావిశేష సంభవంబగు మహాదైశ్వర్యముతో సౌఖ్యము ననుభవించుచుండెను.

కాఁబట్టి పతివ్రతా మహిమకు సాటియైన గొప్పతనము మఱియొకటి గలుగదు. దేవతలు సయితము పతివ్రతల కార్యంబులకు సహాయులై వర్తించుచు, వారికి వాంఛితార్థము లొసంగుచుందురు.

# అసామాన్య

అసామాన్య గొప్ప ధనికుఁడైన వర్తమానుఁడను సాహుకారునకు శాంతాదేవియందు గలిగిన యేకపుత్రిక. మహాభాగ్యవంతులైన యా దంపతులు తమకు లేక లేక కలిగిన కూఁతురగుటచేతను, మఱి బిడ్డలు లేనందునను, కొడుకైనను కూఁతురైనను దమ కామెయే యాధారమని యెల్లవిధముల నత్యంత ప్రీతితో పెంచుచుండిరి. అసామాన్య యసామాన్యరూపవతి. ఆ కాలమున నత్యంగనామణిని యందు రూపలావణ్యములుగల తరుణి లేనే లేదనిన నతిశయోక్తి గాదు. జగన్నుతంబైన సుందరము, సుందరమునకుఁ దగిన శుభలక్షణములు, లక్షణములకుం దగిన సద్గుణములు, గుణములకుఁ దగిన శీలము, శీలమునకుఁ దగిన విద్య, విద్యకుఁ దగిన వివేకము, విధేయత, యోరిమి, శాంతము, సంతోషము, దైవభక్తి, పరోపకారచింత. వేయేల యుత్తమకాంతలకుఁ గలిగియుండవలసిన సర్వలక్షణములును, నామెయందు స్వరూపముఁ దాల్చినట్లు కనుపట్టుచుండును. ఎఱిఁగినవారును, నచ్చెలువ రీతి వినినవారును, స్వతంత్రసంతుష్టాంతరంగులై యామెను నోరారఁ గా పొగడి ధన్యులగుచుండిరి. సుగుణవంతులను లోకమున నెవరు సంస్తుతింపకుందురు? అల్లారుముద్దుగాఁ బెరుగుచు, సర్వజనులకును నేత్రానందమును కలుగఁజేయుచున్న యీ యసామాన్య నిండారు జవ్వనంబు గలిగి యలరారుచుండుటం గాంచి వర్ధమానుండామె కన్ని విధములను తగినవరుని వివాహముఁ గావింపవలయునని నిశ్చయించెను.

రాజశేఖరుఁడు మిక్కిలి బుద్ధిమంతుఁడు. చక్కదనమున మన్మథుని వంటివాఁడని చెప్పఁదగినవాఁడు. నవయౌవన కోమలగాత్రుఁడు. శుభగుణంబుల కాటపట్టు. శాంతచిత్తుఁడు, మృదుభాషి. వినయవిధేయత లతనికిఁ బుట్టిన సొమ్ములు. అతని కుటుంబము చాల గొప్పది. భాగ్యవంతమైన వంశము. అతని తండ్రికిగల నలుగురు పుత్రులలో రాజశేఖరుండు కడపటివాఁడు, విద్యావివేకములం దధికుఁడై యొప్పుచున్న యతని తండ్రి తన కడగొట్టు తనయునకు పెండ్లి చేయుటకై కన్యను విచారించుచుండెను. ఆ వర్తమానమును వర్ధమానుఁ డెఱింగి తన కుమార్తె నా యువకున కొసంగి "వివాహముఁ గావింపఁదలఁచితి" ననియు, "నంగీకరింపవలసిన" దనియు జయదేవుఁడను పేరుగల రాజశేఖరుని తండ్రికి చెప్పిపంపెను. జయదేవుఁ

డుండునది యగుసామంత పురమనెడిదియొక చిన్న పట్టణము. వర్ధమానుని వాసస్థానము కందర్పపట్టణము. వర్ధమానుఁడుండు చోటునకును, జయదేవుని నివాసమగు పురమునకును సుమారు పదియామడల దూరము రమారమిగనుండును వర్ధమానుఁడు తెలియఁజేసిన శుభోదంతము నెఱింగినంతట నతని గొప్పతనమును భోగభాగ్యములను బాగుగా వినియున్న జయదేవుఁడు 'సర్వవిధముల నతని సంబంధము తనకుఁదగినదే' యని నిశ్చయముఁజేసి తనకుమారునకు అసామాన్యనొసంగి పెండ్లి చేయు విషయమున తాను పూర్ణముగా సమ్మతించినట్లు నిజాభిప్రాయము నెఱింగించెను.

పెద్దలవలన వివాహ ముహూర్తము నిర్ణయింపబడెను. ఇరుదెసల వారును తమ యంతరములకుఁ దగిన తెఱంగున పెండ్లిపనులు చేసి తమ తమ బంధుమిత్రాదులకు శుభపత్రికల మూలమున తద్వృత్తాంతమును దెలిపి యాహ్వానించిరి. పెండ్లి వర్ధమానుని గృహమునందే జరుగునట్లు నిశ్చయింపఁ బడినందున, యెల్లరును కందర్పపురమునకు తరిదప్పక చేరిరి. రతీమన్మథులవలె చూపరుల కాహ్లాదమును గలిగించుచున్న యసామాన్య రాజశేఖరులకు మహావిభవమున కులాచార ప్రకారముగా వివాహము జరిగింపఁబడియెను. వియ్యంకు లిరువురును పెండ్లియైనంతట వారివారి బంధుమిత్రులను వారు వారు సన్మానించి బహుమతు లొసంగి వీడ్కొలిపిరి.

అంతట వర్ధమానుఁడు వియ్యంకునితో "అయ్యా! నీవు నలువురు సుపుత్రులఁగల పుణ్యాత్ముఁడవు. నేనైతేనో, ఈకుమార్తెతక్క మఱి బిడ్డలు లేనివాఁడను. కాబట్టి యిప్పుడీమెను మీయింటికిఁ బంపినయెడల నేను ప్రాణంబులేని శరీరమువలె నిస్తేజమును బొందవలసినవాఁడనగుదును. నాకుమితిమించిన భాగ్యముగలదు, ఇదియంతయుం బెట్టుకొని సర్వసౌఖ్యంబులు ననుభవించుచుండఁగా చూచి సంతసించు పుణ్యము నాకు గలుగఁబోయెడిది లేదు. కాబట్టి నాయందు మంచి తలంపుతో కనికరించి నేనడుగఁదలఁచిన కోరికను దీర్చుటకు సమ్మతింపవలయును. నా ప్రార్థన నంగీకరింపుము" అనెను.

జయ:-నావలన నీ కేమి కావలయును? నీ కుమార్తెనిందే విడిచి పొమ్మనెదవా?

వర్ధ:-అటుల జెప్పుట లోకవిరుద్ధమును, నధర్మమును నగునని నే నెఱుంగనా? అది కాదు నాకోరిక.

జ:-మఱి యేదియో వివరింపుము.

వర్ధ:-చెప్పవలెంచిన సంకోచముగానున్నది.

జయ:-సంశయ మేటికి? చెప్పకున్న నెట్లు తెలుసుకొనఁగలను?

వర్ధ:-అల్లుఁడగు రాజశేఖరుని యిచ్చటనే నిలుపవలయునని నా కోరిక. అతఁ డిటనుండెనేని నా కాధారముగా నుండును. భార్యాభర్తలగు నాకూఁతురును నల్లుఁడును సంతోషముతో సమస్తభోగములును తమయిచ్చచొప్పున ననుభవించుచుండఁగా, వారిసౌఖ్యమును గనుఁగొని యానందించుచు నేను నాభార్యయు నానందించుచుండెదము. నావిజ్ఞాపనమున కంగీకరించి ధన్యుని జేయుము, కాదనకుము. ఇది మొదలు నా భాగ్యమునకు రాజశేఖరుండే కర్తగదా? అతం డిచటనుండినను, నచట నుండినను, రెండుచోటులును సమానమైనవియగును. ఇదియే నా ప్రార్థన.

సాధారణముగా సుస్వభావముగలవాఁడైన జయదేవుడు తన వియ్యంకుఁ డెంతయుదీనముగా నడిగిన యావిషయమును గూర్చి బదులు మాటను చెప్పక మౌనముతోఁ గూర్చుండి రెండుమూఁడునిమిషములాలోచించెను. వర్ధమానుం డడిగినరీతి, న్యాయముగానే యతని బుద్ధికిఁదోఁచినది. తనలో 'అయ్యో! ఏకపుత్రికఁగలవాఁడు. ఆకుమార్తెను నేను తోడ్కొని పోయినంతట యితని మనోదుఃఖమునకు మేరయుండునా? పాపము! ఇతని కంతటి వ్యాకులము గలిగించుట యన్యాయము. రాజశేఖరుం డిచ్చటనుండిన నేమి నష్టము? అచటనుండి మాత్రము త్రవ్వి తెచ్చునది యేదియున్నది ఇతఁడుగాక యింక ముగ్గురు కొడుకులు వీని కంటె పెద్దవారు నాకుటుంబమున కాధారమైన వారున్నారు. ఈ కడ గొట్టును అత్తమామల కాదరువుగానిందు నిలిచినయెడల నీయనంతమైన భాగ్యమునకు కర్తయై భార్యతోఁగూడి సౌఖ్యమున కాలమును గడుపు చుండగలఁడు. ఇది తప్పుగాదు' అని యాలోచనఁజేసి కర్తవ్యమును నిర్ధారించుకొనెను. తన మాటలకు జవాబు నీసంగకున్న వియ్యంకునిఁ జూచి వర్ధమానుఁడు సంశయమును బొందెను.

వర్ధ:-ఏమియో? నేనడిగినటుల చేయుటకు సమ్మతముగా నుండలేదా

జయ:-ఎందువలన నిష్టము లేకపోవును! నామాటలలో నేమి తప్పు గలదు? నీవడిగిన విషయమును గూర్చియే యాలోచించుచుంటిని.

వర్ధ:-ఎట్లు నిర్ధారణ గావించితివి? కుదిరినదా యోచన?

జయ:— కురకపోవుట యేల? ఇందువలన నష్టకష్టము లెవ్వి.

వర్ధ:- కర్తవ్య మెట్టిది? అభిప్రాయముఁ దెలుపుము.

జయ:-నీది సిద్ధ సంకల్పముగదా? కర్తవ్యము నీకోరికలాగుననే.

జయదేవుఁడు మందహాస వదనుఁడై యిటుల పలుకగానే వర్ధమానుని ముఖము వికసించెను. అతఁడు "నేను కృతార్థుఁడనైతిని" అనెను. అంతట జయదేవుఁడు రాజశేఖరుని బిలిచిన తనకును తనవియ్యంకునకును జరిగిన సంభాషణయు వియ్యంకుని యిష్టానుసారముగాఁ దాను సమ్మతించుటయును దెలిపి, తగినబుద్ధిమాటలంజెప్పి కొడుకు నత్తవారి యింటనే యిల్లడఁజేసి నిలువరించి వర్ధమానుని వలన మర్యాదలు బొంది యనుజ్ఞ గొని ప్రయాణంబై స్వస్థలంబున కరిగెను. తన యిష్టమును నెరవేర్చిన జయదేవుని సద్భావమును గొనియాడి వర్ధమానుఁడు సంతుష్టాంతరంగుఁడై, తానువసించు గృహంబునకు వెంబడిగా నత్యంత రమణీయంబుగా నుండునట్లు గొప్పగానొప్పు నూతన సౌధంబొకటి కట్టించి తన యల్లుఁడును, ననుఁగు కుమార్తెయు నందుండి సకలభోగములను ననుభవించుటకు వలయు నేర్పాటులన్నియుఁ గొఱంత లేకుండు లాగున నొనరించి వారినందుండ నియమించెను, అసామాన్య రాజశేఖరు లధిక మనోజ్ఞంబై నదియుఁ దమకుఁగా ప్రయత్నంబున నిర్మింపఁ జేయబడినదియు నైన యా మేడయందుఁ జేరి, నిర్విచారులై యిష్టభోగము లనుభవించుచుండిరి.

సుగుణాన్వితయైన యసామాన్య యనేకసద్గ్రంథములఁ బఠించియు పెద్దలవలన వినియు దెలిసికొనియున్న దగుటచే సతులకు పతిభక్తియే భూషణమనియు, దానిని మించిన యుత్తమమార్గము మానవంతులైన యతివలకుఁ గలుగదనియు నేపుణ్యవతి దైవసమునిగా వల్లభునిఁ దలంచి యతని సేవసేయుచు సద్భావంబుతో వర్తించునో, యామె యిహలోకమున శాశ్వతమగు ప్రఖ్యాతినిం జెంది యాముష్మిక సౌఖ్యములను స్థిరముగా ననుభవించుననియు, పతివ్రతలమహిమ యద్భుతంబైనదనియు వేలుపులు సయితము పతిభక్తిగల స్త్రీల నెంతయుం గొనియాడుచు వారికి వెఱచి వారి కనుకూలముగ ప్రవర్తింపుచుండుదురనియుఁ గావున నట్టి సద్బుద్ధియు సత్ప్రవర్తనమునుం దనకుఁ గలుగఁజేయుమని భగవంతుని ప్రార్థింపుచు, ఎల్లప్పుడును తన ప్రాణేశ్వరుని మాటకు బదులాడక

యతని కేది యిష్టంబో యాపద్ధతుల నెఱింగి మెలంగుచు దేవతారాధనము, పెద్దలను సేవించుట, యతిథులను నభ్యాగతులను నాదరించి పరితుష్టులం జేయుట, పేదలను మన్నించి వారి కిష్టవస్తుచయంబులొసంగుట, దానధర్మాది సత్కార్యము లాచరించుట మొదలగు పనులయందు నిమగ్నచిత్తయై రేయింబవళ్ళు భర్తను సుశ్రూష సేమరక చేయుచు నతనిసంతోషమే తనమేలుగా దలంచి వర్తింపుచు, కొఱంతలేని సకల సౌఖ్యములు ననుభవించుచుండెను. బుద్ధిమంతుండును, గుణవంతుండును నగు రాజశేఖరుండు తనకిట్టి సర్వలక్షణశోభితయు సుస్వభావయు ననుకూలవతియు పరమసాధ్వీమతల్లియు, నగు భార్య చేకూరుటందలంచి తన పూర్వ సుకృతవిశేషంబని భావించినిరంతరమునామెయందుబద్ధానురాగుడై యామె మనంబునకు తనమూలమున నెపుడును నెట్టికష్టమును దోంచనీయక యనుకూలప్రవర్తకుడై సంతోష పెట్టుచుండెను.

వారలిరువురునుం బూవును పరిమళమునుంబోలె కలసి యేకమనస్కులై ప్రవర్తించుటం జూచినవారు 'బంగారమునకు తావినొసంగిన లాగున వీరి దాంపత్యమెంతయు నొప్పుచున్న'దని వేనోళ్ళం గొనియాడుచుండిరి. ఆ దంపతులకుంజూచి, 'రతీమన్మథులవలెను, శచీపురందరుల విధమునను లక్ష్మీనారాయణుల లాగునను, రూపలావణ్యములందును, భోగభాగ్యము నందును, శుభలక్షణగుణాదులందును, నిరువురు నొండొరులకుం దగినవారై సర్వవిధములనుం దగియున్నవారలు. వీరిని సతీపతులను జేసిన బ్రహ్మ నెంతయును మెచ్చదగు' నని పలు తెఱంగులు ప్రజలు వర్ణించి పొగడుచుండిరి.

ఈప్రకార మసామాన్యయు రాజశేఖరుండును నిర్విచారులై కలసి మెలసి మెలంగుచు కాలము గడుపుచుండంగా నప్పురంబు పాలించు సుషేణుం డను రాజు, బహువిధములం బ్రజలసామాన్య రూపలావణ్యాది లక్షణంబులను మిగుల సంస్తుతించు చుండుటయు తనయొద్ద వర్తించుచుండెడి దుష్టజను లామె చక్కదనముగూర్చి మాటిమాటికిం బ్రస్తాపవశమున నెక్కుడుగా నగ్గించుచుండుటయును విని, 'త్రిలోకసుందరియని యెల్లవారును మెచ్చుచున్న యామెయలనాగ సౌందర్యమెట్టిదగునో చూడవలయుననియు నేవిధంబునైనను నమ్ముద్దియంగూడి యొక్కనాడైనను సుఖము నొందవలయు' ననియు, దృఢముగ పేరాసగొన్నవాడై, తనకామెపొందు లభించుటకై యనేకములైన యుపాయంబుల నాలోచించి

పెక్కు తంత్రములను బన్నుచుండెను, కాని యతని యభిమతము చేకూరదయ్యెను.

సుషేణుఁడు కడుజారుఁడు. స్త్రీలను లోఁబరచుకొనుటలో నసాధారణ మాయోపాయము లెఱింగి సమయానుగుణ్యములగు తంత్రము లాచరించి, కృతార్థుఁడగుచుండు మహాసమర్థుఁడు. అతఁ డెంతటి వాఁడైనను నందఱిమీఁదను నుపయోగించుచున్న యతని టక్కులన్నియు నసామాన్యపట్ల నుపయోగము లేకపోయినవి. అతని సామర్థ్యమనెడి బాణమామెపై బాఱినది కాదు, నమ్మయ్యెను మిక్కిలి నేర్పరులైన పలువురు యువతులం బనిచి చెప్పియు, ధనాభరణాదులను బహుమానముగా పనిచియు నింకను నెన్నో విధములఁ బ్రయత్నించి తుదకు విఫల మనోరథుఁడయ్యెను. తాను గావించిన యుక్తులన్నియు బ్రయోజనము లేకపోవుటయు తన కోరిక దీఱకుండుటయుం దలంచి యక్రమంబైన దుష్టభావము నంతటితోనైనను విడిచి యూరకుండక, మఱియుం బ్రయత్నమును జేయుచునే యుండెను. ఆ విషయమున నతనికి మానుకొనుటకు బదులుగా పట్టుదల యధికము కాఁజొచ్చినది.

ధర్మమునుదప్పక ప్రజలను బాలింపవలసిన వాఁడయ్యును రాజైన వాఁడే యక్రమ ప్రవర్తనమునకుఁ గడంగినచో దానిం గాదనువారెవ్వరు? తనపై రాజు మోహముగొనుటయు, బహుమతులతో దూతికలం బనుచుచుండుటయు మొదలుగాగల సర్వ విషయములను పతివ్రతా శిరోమణియైన యసామాన్య యొప్పటికప్పుడు తన ప్రాణేశ్వరున కెఱింగించి "ఇది మహోపద్రవంబుగా నేర్పడినది. అతఁడు రాజగుటచే, నెప్పటి కేయడను గలుగునో తెలియదు. కాఁబట్టి కొంతకాలమువరకును మనము మీ తండ్రిగారియొద్ద కరిగి యనుకూలముగా నుండు సమయమున మరలి యిచ్చటికి వత్తము. దీనికి మీ యభిప్రాయమును దెలుపవేడుచున్నా" నని పలికెను. భార్యయొక్క గుణప్రవర్తనములను తనపైఁగల భక్త్యానురాగములను బాగుగా నెఱింగినవాఁడగు రాజశేఖరుండా కోమలాంగి చెప్పిన మాటలువిని, చేను కంచె మేసిన దన్నట్లు, పరిపాలకుఁడే యట్టి యకార్యమునకు బూనుటం దలంచి యత్యంతమైన యాగ్రహమును బొంది యతఁడు రాజు గావున నేమి చేయుటకు వలనుగామి జింతించి యిట్లనియె.

"మనోహరీ! నీవు భయపడకుము. సూదిని వేళ్ళతోఁ ద్రిప్పుచున్నప్పుడు దానికి దారము నెక్కించుట కెవనికి తరమగును? అటులనే యువ

తికి యది గలుగదేని! రాజైననేమి? రావణుండైన నేమి? ఏమి చేయఁ గలఁడు? నీవు నిర్మలహృదయివిగానుండఁగా నిన్నా బుద్ధిహీనుండు కీడుపఱుప శక్తుఁడగునా? ఇసీ! వాఁడు చెడునుగాక, నీవు చెప్పినలాగున మా తండ్రి యొద్ద కిప్పటికి పోయి కొలదినాళ్ళుండినను, యెన్నటికైనను మనము మరల నిచ్చోటికి రావలసిన వారమే కాదా? అపుడును నీకీ దుష్టుని బాధ తప్పునా? ఏమినమ్మకము. ఇదియునుగాక నాతండ్రి, నీ జనకుని యిచ్ఛానుసారముగ నిచ్చట నుండుమని యాజ్ఞాపించి నన్ను నిలువరించి పోయెను. ఇప్పుడు మన మచటికి కరిగినయెడల మదీయ జనకుఁ డేమనుకొనును? తన యాజ్ఞను పాటింపనివాఁడ వని నిందింపకుండునా? తండ్రియాజ్ఞను మీరి వర్తించుట యక్రమముగాదా? కావున నెటులదలంచినను మనకుయిచ్చట నుండిపోవుట లగ్గుగాఁ దోఁచలేదు. ప్రాణేశ్వరీ! నీవు మహా పతివ్రతవని నే నెఱుంగుదును, లేశమైనను నీయందు కళంకము గలుగదు. ఇట్టువంటి సాధ్వివైన నీకు మోహావశుండై భంగపాటుఁ గలిగింపఁ బూనినయెడల నతండు కుటుంబముతో నాశమొందునుగాని క్షేమమున వర్ధిల్లఁజాలఁడు. సర్వరక్షకుండైన భగవంతుఁడు నిన్ను రక్షింపఁగలఁడు. పరమేశ్వరుండు సజ్జన రక్షకుఁడుగదా? ధైర్యంబును విడువక దేవునిపయి భారంబిడి శాంత చిత్తవై యుండుము" అని యామె భయంబు మానునటుల నూఱటగాఁ బలికి, యారాజునకు కలిగిన దుర్బుద్ధిం దలంచి దైవసంకల్ప ప్రకారము జరుగఁ గలదని మిన్నకుండెను.

కొలఁదిదినములు జరిగినవి. తనయభిమతంబు నెరవేరమిచే రాజైన సుషేణుని కసామాన్యపయిఁ దొడరిన మోహమధికరించి యావగలాడిం గలసి సుఖింపకున్నయెడల తన జీవితము నిరర్థకమని నిశ్చయించి యామె పొందునకై పడరానిపాట్లు పడుచుండెను. తన యధికారము నుపయోగించి యామెను లోబరచుకొనుటకై తలంచెను. కాని యాలోచించి మీపద్ధతి యుచితముగా దోఁచకున్నందున విరమించెను. ఏలననఁగా, రాజైన తానే యట్టి యకార్యమును జేయుటంగాంచి ప్రజలు దుశ్శీలమునకు కోపముగొని నిందించి తిరుగబడిరేని గొప్ప ముప్పును బొందుట తటస్థింపఁ గలదని యతఁడు తత్ప్రకారమున చేయుటకు బూనుకొనక మాయోపాయంబులచేతనే సాధింప నెంచెను.

కాలముజరుగుచుండుటయే కాని, యతని తలంపు నెఱవేరకుండెను. మోహార్ణవనిమగ్నుఁడైనవాఁడు మనంబున నోర్చి యెంతకాలము ధైర్య

ముతో నుండఁగలఁడు? రాజ్యకార్యములందు సయితము సుషేణునకు శ్రద్ధ లేకపోయినది. తాను చూచినవాఁడు గాకున్నను, ప్రజలు చెప్పిన లక్షణములనుబట్టి యాసుందరాంగి రమణీ యాకృతి మనంబున సృజించి స్థాపించుకొని పరితపింపఁదొడంగెను. భుజించునపుడును, శయనించునపుడును, పరులతో సంభాషించునపుడును సయితము మతిని మనంబున జగన్మోహనాకారిణియైన యసామాన్య స్మరణము తొలంగకుండెను. అసామాన్య కామ బాధా పీడితుఁడైన యతనికి గడియ యొక యుగము వలె జరుగఁజొచ్చెను.

ఇటుల నానృపాలుండు పరితాపమును బొంది యలంతఁబొందుచు, తానొనరించిన యేయుక్తియును ఫలింపకుండుటఁ దలంచి మిక్కిలి చింతాక్రాంతుఁడై తుదకు, సాహసక్రియకుం దొడఁగి నిజాపేక్షం దీర్చుకొన నిశ్చయించెను. సాహసించుట యనఁగా నెట్లు? తద్విధంబుం గూర్చి ఎన్నియో పద్ధతులను దలంచి యన్నిటిలో నొక యుపాయము మేలైనదిగాఁ దోచినందున, యాలాగు చేయుటచే తనయిచ్ఛ నెఱవేఱునని నిర్ధారణఁ జేసికొని యటుల గావించుటకుం దగిన సమయము నరయుచుండెను.

ఆ పురమునకు దాపున నళోషిణి యనెడి యొక గొప్ప నది ప్రవహించుచుండును. నదీతీరములు నిర్మలసైకత మయంబులై పలురకముల చెట్లును, తీవెపొదలును నచటనచట నింపుగాఁ గనుపట్టు లేబచ్చికలునుం గలిగి రమణీయంబై కన్నులకు విందుసేయుచు సర్వజనాకర్షణీయంబుగా నొప్పుచు ప్రొద్దు మాపటివేళ పురంబులోని వారు విలాసార్థముగా నచటికరిగి కొంతతడ వా నదీతీరమున విహరించి యచ్చోట తమపై వీచు చల్లగాలికి హాయినింబొంది తమ గృహంబులకు వచ్చుచుందురు. అటులనే సాయాహ్నంబున ప్రతిదినమును మన రాజశేఖరుండును నదీతీరమునకు బోయి కొంతసేపు విహరించుచుండి వచ్చుట వాడుక. ఆ యలవాటు చొప్పున నతం డొకనాఁడు కొందఱు చెలికాండ్రతోఁగూడి యేటిదరిలో వేడుకగాఁ దిరిగి వచ్చుటకై పోయెను.

ఆ నాఁడు శుక్రవార మగుటచే యసామాన్య యభ్యంగస్నానము జేసి రమణీయాంబరాభరణంబులు ధరించి పుష్పసుగంధాద్యలంకారములు గావించుకొని జగన్మోహిని దేవతయుంబోలె నొప్పుచు, లక్ష్మీపూజా మనసాది కార్యములు భక్తితోఁ దీర్చుకొని తన ప్రాణవల్లభుండు గృహంబు జేరుటకు మున్నుగానే సర్వకార్యములుందీర్చి, యతని రాకకై నిరీక్షించు

చుండెను. రాజశేఖరుం డింటికిం గను రాలేదు. 'ఏల నీ దినం బింత తడవు మసలెను? ఎన్నఁడును నన్ను విడిచి యాలస్యము చేయుటకు సమ్మతింప జాలఁడే!' యని యువతీమణియైన యసామాన్య పరితపించుచుండెను. ఆ సమయమున సర్వాభరణాకృతియైన చానయొకర్తు వాడుకగాఁ వచ్చుచుం బోవుచుండు దానివలె నిస్సంశయముగా, బిరబిర లోపలికి బోవుచుండెను. ఆమెనుజూచి వాకిట కావలియున్నవారు, అనివచ్చిన యతివ వేషములు, చొరవ గలిగి భవనంబులోనికి నిరాటంకముగాఁ బోవుటనుంజూచి, తత్పూర్వమామెను తాముగని యెఱుంగని వారయ్యును "ఒకవేళ మనమాక్షేపించినయెడల యసామాన్య కేమి కోపము గలుగునో, ఆమె నెఱుంగనిదైనచో నింత నిశ్చయముగా లోపలఁ బ్రవేశించుటకు సాహసించునా? మిన్నకుండుటయే యుక్త" మని యెంచి యాక్షేపింపక యూరకుండిరి. అంతట నటుల గృహాభ్యంతరముం బ్రవేశించిన భామిని మనోజ్ఞాలంకారయుక్తంబును శోభావిరాజితమును, సకలభోగభాగ్యాదులకు నాలవాలంబును, నగు నయ్యసామాన్య యుండెడి సౌధంబు సొంపును గాంచి యాశ్చర్యంబుఁ జెందుచు, నమ్మగువ యుండెడి ప్రదేశంబున కరిగెను

ఆ సమయమున దైవికముగా అసామాన్య పరిచారిక లెవ్వరును వచ్చటలేక పనుల వెంబడి మెలంగుచుండిరి. ఆమె యొక్కతెయే యొక గద్దియపైఁ గూర్చుండి పతివ్రతా మాహాత్మ్యమును గూర్చి వ్రాయఁబడిన దేదో యొక గ్రంథమును చదువుచుండెను. దివ్యకాంతా సుందరవిగ్రహంబైన కోమలాంగినిం జూడఁగనే వచ్చిన భామిని "ఆహా! ఈమె మానవకాంతయేనా? లేక మనుజాకృతి దాల్చిన రతీదేవియా!" యని తదీయ రూపలావణ్యాది లక్షణముల నెంతయు మెచ్చి యాశ్చర్యమును బొంది, పలుకుటకు నోరురాక పరవశచిత్తయై నిలిచెను.

ఎన్నఁడును తాను చూచి యెఱింగియుండని స్త్రీయొకర్తుక హటాత్తుగా వచ్చి తన ముందు నిలిచి మౌనముతో నుండుటం గాంచి యసామాన్య చింతపడి తనలో 'ఏమి ఈమె యెవ్వతెగా నుండును? నేను చూచియున్నది లేదే! ఏల వచ్చినది? మాటాడకున్న దేల?' యని తలంచుచు తానుగానే ప్రశ్నింప నెంచి "ఓయమ్మా! నీ వెవ్వతెవు? ఎచ్చటనుండు దానవు? ఇచ్చోటి కేలవచ్చితివి? నావలన నీ కేదేని యుండగావలసిన కార్యముగలదా? వచింపు" మని యడిగెను. క్రొత్తమగువ యామె మధురములైన మృదువాక్యములకలరి, మనంబు పదిలపరచుకొని "కుసుమకోమలీ!

నీవు సరిగా గ్రహించితివి. ఔను! నీవలనఁ గావలసిన యొక్క గొప్ప కార్యము గలుగుట వలననే తదర్థమై వచ్చితి” ననియెను.

అసా:—ఏమీ! నావలనఁ గావలసిన కార్యముగలదా?

క్రొత్తస్త్రీ:—చెప్పెదను. కాని, వినినంతట నొల్లనని పలుకరాదు సుమీ!

అసా:—అది నావలన సాధ్యముగానుండు కార్యమైనచో చేసెదను.

క్రొత్తస్త్రీ:—సాధ్యముగాని దాని నడుగుదునా? నీవు చేయఁ గలదియే!

అసా:—అటులనైన దానిం జెప్పుము. సంశయింపకుము.

ఇటుల ననుకూలమగు భావముతోఁ జెప్పిన యాలావణ్యవతి పలుకులు విని యుబ్బి యాక్రొత్త స్త్రీ “పద్మనయనా! ఒక రహస్యము వెల్లడించుచున్నాను. ఇదిగో! నీముందిట నిలచి యీవేషముతో మాటలాడుచుండెడి నేను నీవు దలంచినట్లు స్త్రీనిగాను” అనెను. అసామాన్య మహాదాశ్చర్యమును బొంది, దిగ్గన గద్దియపై నుండి లేచి యించుక తొలంగి నిలిచి “ఎట్లూ? నీవు స్త్రీవిగావా? మఱి యెవ్వరు?” అని యడిగెను.

క్రొత్త స్త్రీ:—స్త్రీనిగాను పురుషుడనే! ఈపురమును బాలించు రాజను. నీకరుణకు పాత్రుండనైన సుషేణుండను!

అసా:—ఆ “ఆ రాజవా! ఏలవచ్చితివి?” అని దవ్వుగాఁబోయెను. పరిచారికలం బిలుచుటకు సయితమామెకు మాట వెడలినదికాదు. ఆ సమయమున నచట నెవ్వరును లేకుండుటవలన, నేమి సంభవింపఁగలదో యని భయమొంది యామె యొడలు వడక నారంభించెను తత్తరపడఁ జొచ్చెను. అంతలో సుషేణుఁడు స్త్రీవేషమును దీసివైచి వికసిత వదనుండై సాధ్వీమణియైన యసామాన్యంజూచి “కోమలీ! నాసాహసంబునకు మన్నింపుము” అనెను.

అసా:—అయ్యో! నాపతి యింట లేనపుడు నేనొంటరిదాననై యున్న సమయమున మాయపు స్త్రీవేషమును దాల్చి, యిచటి కేలవచ్చితివి? ఇటుల సాహసించుట కేమి కారణము?

రాజు:—అంగనాశిరోమణీ! దైన్యకరమైన నాయుదంతమును విన్నవించెదను వినుము. మదీయ వృత్తాంతమును వింటివేని యింతటిసాహస కార్యమున కేలగడంగితినో తెలిసికొనగలవు. ఏమనఁగా లోకులు నిరుపమా

నమగు నీసౌందర్యాతిశయము బాగడుచుండుటనుపలుమాఱును విన్నవాఁడనై నాతలంపు నీవంకకు మరలి, నీపై నత్యధికమగు మోహముఁగొని యేలాగునైనను నీతో పొందవలయుననెడి కోరిక యతిశయించిన కతంబున మదీయాభిప్రాయంబును దెలిపి నీకరుణకు పాత్రుఁడనుగానెంచి యొండతెనో నీయొద్దకు బనిచితిని. నావలన నైనన్నియుక్తులుబన్ని చూచితిని. ఎందును కృతార్థుండను గానైతిని. ఏమి చేయవలయును? అధికమగు వలపు నన్ను వేగిరపెట్టుచుండ, నైరింపలేక కడపట నిట్టి నుపాయంబు చేత ప్రత్యక్షముగానిన్నుచూచి మాటలాడ వచ్చుననియు, కన్నులార నాదైన్యస్థితినిం గాంచినయెడలనైనను నీమానసంబు గరుగక పోదనియు దృఢముగనెంచి, స్త్రీవేషముతో నీసాన్నిధ్యమును జేరఁగలిగితి మఱియొక తెఱంగున నీభవనంబుఁ జొరరాదనుటం దలంచియే యిటులగావించితిని.

అసా:—ఓయిరాజా! ప్రజలు సత్ప్రవర్తనులై యుండునట్లు చక్కగా విచారింపుచు, ధర్మముదప్పక భూమిని పాలింపవలసిన వాఁడవైన నీవే యిటువంటి దుష్క్రియకుఁ దొడరినచో సామాన్య జనులమాట నింక జెప్పవలసినదేమి! "యథారాజా! తథాప్రజా" యని శాస్త్రము గలుగుట నెఱుగవా? ఇట్టిపనులు జేయుచుండిన యెడల నీకు కీర్తిగలుగునా? నీవంటి గొప్పవాఁడు పరకాంతలను తల్లులుగను, తోబుట్టువులుగను, కూతుఁండ్రు గను భావింపవలయునుగాని కామవాంఛాపాశబద్ధుడై యన్యుల యిల్లాండ్రపై మోహముగొని వారికి భంగపాటు నొందించుటకుతలంపదగునా? ఛీ! ఇదియేమినీతి! ఎట్టి సత్ప్రవర్తనము? అపుడపుడును నాయొద్దకు నీవు పంపుచుండిన దూతికల మూలముగా నేను నీకు పలువిధంబుల సద్బుద్ధి మాటలనుజెప్పి యనుచుచుంటిని నాపలుకులన్నియువ్యర్థముఁజేసి కడపట పతివ్రతనగు నన్నుఁగవయనెంచి యింతటి సాహసకృత్యమునకుఁ దెగించి వచ్చితివి. ఛీ! ఛీ! ఈకోరిక నీకుఁ దగినదికాదు. ఇప్పటికైనను నామాటల నాదరించి క్షణమైన నిచట నిలువక వెడలిపోయి మరియాదను నిలుపు కొనుము. నేను నీకుసోదరివంటి దాననని తలంచుకొనుము. మఱెనోరెత్తి యేమియుం బలుకవలదు. పతివ్రతనైన నాపైఁ తలంపుఁగొనిన పాపమునకు పరిహారముగా పశ్చాత్తప్తుఁడవై యింక నెన్నఁడు నిట్టి యవజ్ఞతం జేయ నెంచక సుఖంపుము.

రాజు:—బలా! అబలా. నీతులను నేర్చుకొనుటకా నీయొద్దకువచ్చితిని? ధర్మములనెల్లను నేనెఱుంగని వాఁడనుగాను. వృథామాటలచే కాల

యాపన మొనరింపక మోహతాపతప్తుండనై వందరుచున్న నాయందు
నా యాస దీర్పుము. నీ దాసునిగా నేలుకొనుము. మదీయ
రాజ్య                      నీకు సమర్పించుటకు సంసిద్ధుఁడనై యున్నాను.
మనోహరివైన నీవు యెన్నిదినంబులు నిందించినను నాకు కోపము గలు
గదు. లతాంగీ! 'కామాతురాణాం నభయంనలజ్జా' యని పెద్దలు బలు
కుదురు. అట్లే లజ్జాభయంబులు విడిచి సాహసించి నీదరిఁ జేరి దీనుండనై
వేడుచున్న నన్ను నిరాకరింపకుము. ఇంతటి తెగువకుం జొచ్చినవాఁడ
నింక నన్ను గవయక మిన్నక పోవువాడనుగాను. శీఘ్రముగా చెంతకు
రమ్ము, కౌఁగిలి నొసంగి నన్ను      నిం జేయుము.

ఇట్లు పలుకుచు, కామాతిశయంబున, హానివృద్ధుల నెంచకయు,
ధర్మాధర్మముల నెంచకయు, స్థలాస్థలంబుల గూర్చి యాలోచింపకయు
దుర్వాంఛా పీడితుండై బలాత్కారంబున, నమ్మానవతి బట్టుకొన గమ
కించి దాపునకు వచ్చుచున్న సుషేణుని తలంపుఁ దెలిసికొని యసామాన్య
భయభ్రాంతచిత్తయై వాని చేతికిం జిక్కక యటునిటుం దొలంగి తప్పించు
కొనుచు యేమియుం దోచక పరిజనులం బిలుచుచుండెను.

రాజు:- సుందరాంగీ! ఏల నిర్వ్యథంబున నలయించెదవు? కామించి
వచ్చి ప్రార్థించుచున్న వానినిం జిక్కులు పెట్టుట న్యాయమా?

అసా:- ఓరి, దురాత్మా! ఇదియా నీ గొప్పతనము? నీవు రాజవగు
దువా? ఇపుడు నావల్లభుండుండినచో నీగతి దుర్గతియై యుండును. పాప
శీలా! దూరముగాఁ బొమ్ము! నీ దుశ్చేష్టలకుఁ దగిన ఫల మనుభవింపఁ
గలవు. తొలంగిపోయి ప్రాణ బును గాచికొనుము.

రాజు:- ఎవరికిని నేను భయపడు వాఁడగాను. వెఱపింపక నా
కోరిక దీర్పుము. నిన్ను సకల సౌఖ్యముల నొందించెద, అని డగ్గరించెను.

అసామాన్య కత్యంతమైన యాగ్రహము గలిగెను. ముఖము జేగు
రించెను. భయంకర దృష్టులతో వానిం జూచి "ఓరి! నీకు చెడుకాలము
దాపైనది. కావుననే దుర్బుద్ధులు బుట్టినవి. నన్ను దాకితి వేని నీవు నిలు
వున నీరై పోగలవు' అని దూరముగాబోయెను. తత్పూర్వము కొంత తడ
వులకుముందు గృహంబునకరుదెంచి, హర్మ్యాంతరమున ప్రసంగమును
మరుగున నుండి వినుచు నిలిచి యేమి జరుగునో తెలిసికొనవలయునని
పొంచియుండి, రాజశేఖరుండు, తమ యింటిలో నుండువాఁడు సుషేణుం
డగుట యెఱింగి, యతండు నిజాంగనను బలాత్కరించుటకు బూనుటయు

సాధ్వియైన యామె వానిని నిరాకరించి దూషించి పలుకుచుండుటయు గనుగొని తాను శాంతచిత్తుండయయ్యు నధికమైన యాగ్రహమును బొంది తటాలున వచ్చి రాజుముందట నిలిచెను. పుణ్యశీలయగు తన భార్యను పరుండొకండు భంగింపఁబూని పట్టవచ్చుచున్నప్పుడు, ఏపురుషునకు కోపముగలుగకుండును? ఎట్లు సహించి యుండగలడు? మృత్యువు దోఁచిన చందమున రాజశేఖరుండు వచ్చి ముందు నిలువఁగానే రాజునకు తలపై పిడుగు పడినట్లు తోఁచి నిలువున నీరై తానెంతటి రాజుగా నుండినను, నిస్సహాయుండై, యస్యగృహంబున జిక్కికొనుటం దలంచి, గుండియ లదర, తత్పూర్వము బలికిన డంబోక్తులు మఱచి భయాతిశయంబున నోట తడియాఱి యేదియుం బలుక నోరురాక కొయ్యబారి యట్టె నిలిచెను.

అపుడు రాజశేఖరుండు కన్నుల నిప్పులొలుకఁగా నుగ్రదృష్టులం గాంచి "ఓరి రాజాధమా! ఇది యేమి ప్రవర్తనము? పరాంగన యనియు పతివ్రత యనియుం దలంపక మదోన్మత్తుండవై, రాజును గదా యనెడి యహంభావముతో మాయవేషమున పరునియింట ప్రవేశించి యిచ్ఛలేని పొలంతి నివ్విధంబున బలాత్కరించుట తగునా? దురాత్మా! దుర్మార్గుడు రాజైనను గురుండైనను మఱి యెంతటివాడైనను పెద్దతనంబు నెంచక దండింపఁదగినవాఁ డగునని తెలిసినవారు పలుకుదురు. బుద్ధిహీనుఁడా! ఇపుడు నిన్ను నెట్లు చేసినను జేయవచ్చును. మదీయకరవాలంబుగొని రెండు ఖండము లగునట్లు నీ కంఠముఁ దెగనేయుదును, కాని నరహత్య మహాపాపమైనదగుటచే నిన్ను జంపక ప్రాణములతో విడుచుచున్నాను. నీచమతీ! నీవు ఖలుండవు. నీ ముఖంబుఁ జూడఁదగదు. అసువులఁ దక్కించుకొని యీక్షణంబున నీవిచ్చటనుండి వెడలిపొమ్ము బాగు చేసినఁ బ్రతుకఁజాలవు" అని పలికి మహాక్రోధమున నతనిం దన వామ పాదముతో నొక తన్నుఁ దన్నెను.

అయ్యో! సుషేణుండా దాపునకుం గ్రిందఁబడి తెప్పరిల్లి లేచి మొగంబుపై ముసుఁగువైచుకొని యాస్థలంబుననేమియుం బలుకక లేచి యవమానంబును బొంది, బిరబిరంగదలి దొంగదారులం బడి తప్పించుకొని 'చావు దప్పినదే చాలును దేవుడా!' యని పోయి నగరు జొచ్చి, తనకు సంభవించిన పరాభవమునకు, నన్ని పాట్లుబడియు నభిమత సిద్ధి గాకపోయినందుకు నధికమైన పరితాపముఁ బొంది తన గొప్పతనముం దలంపక పథంబునఁ దాకి యవమానించిన రాజశేఖరునిపైఁ బగదీర్చు

కొని, తన మాటకు సమ్మతింపక నిరాకరించిన యసామాన్యను ఘోర దుఃఖమున నొందింపవలయునని నిశ్చయించి దృఢసంకల్పుఁడై యందుకు దగిన యుపాయము నరయుచుండెను.

ఒకనాఁడు వాఁడుక చొప్పున రాజశేఖరుండు నదీతీరంబున విహరింపఁ బోయెను. సకలాలంకృత శోభితాంగియై యసామాన్య పతి మనంబున కింపుగాఁ గనుపించవలయును ననెడి తలంపుతో, నతని రాకను నిరీక్షించుచుండెను. అట్టియెడ నొక క్రొత్త యువతి కావలి వారల కంటబడక యెట్లో తప్పించుకొని, పట్టువస్త్రముతో నొక పసిడి తట్టనుం గొని యసామాన్యయొద్దకువచ్చి "అమ్మా! ఇదిగో! రాజుగారు, నీపై నధికమయిన ప్రియము గలవారై నీకీ బహుమానము నొసంగి రమ్మని యిచ్చి పంపినారు" అని చెప్పి యాతట్ట నచట ముందఱ బెట్టి మఱి నిలువక బిరబిర వెడలిపోయెను.

తమచే నవమానింపబడియును బుద్ధిలేక సుషేణుఁడు బహుమతినిఁ బంపుటను దలంచి యా యిందువదన యసహ్యము జెంది, యొకపరిచారి కనుబిలిచి "ఓసీ! ఇది యేదియో చూడుము. ఇందు మూటగఁ బెట్టఁబడి యున్న వస్తువెయ్యదిగా నుండును? సిగ్గుమాలిన సుషేణాధముఁడు బంపె నఁట" యని చెప్పిన యాపరిచారిక వచ్చి వస్త్రాంబరముపై మూయఁబడి యున్న వస్త్రమునుదీసెను. ఆహా! ఆశ్చర్యమాశ్చర్యము. అందున్న దానిం జూడఁగానే యాకోమలీమణి యసామాన్య "హా దైవమా" యని మూర్ఛిల్లి దిగ్గన నేలఁబడియెను, ఆ వస్తువెయ్యది? అకటా! అది ఖండింపబడిన రాజశేఖరుని శిరంబని యచటనుండిన వారు తెలిసికొని, తన యజమానురాలికిఁ బ్రాప్తించిన దౌర్భాగ్యమునకెంతయును సంతాపింపఁదొడంగిరి. ఒకతే యసామాన్యను తేర్చుటకుపచారములు గావించుచుండఁగా గొంతవడి కెటులనో తెలివినొంది యామె లేచి కన్నులనీరు కాలువలై పాఱ శోకసాగర మగ్నయై, క్రూరాత్ముఁడైన సుషేణుఁడు గావించిన మహా పాపకరంబైన ఘోరకృత్యంబున కమితంబైన యాగ్రహమునుబొంది "ఓరి దుష్టశీలా! కలుషాత్మా! కఠినహృదయా! చేతఁజిక్కినపుడు ధర్మముం దలంచి నిన్ను చంపక కరుణించివిడిచిన నావల్లభుని, సకలసద్గుణనిధిని, నీకు ప్రాణదాతయైన పుణ్యశీలుని జంపించుటకు నీహృదయం బెట్లు సమ్మతించినది? అటువంటిక్రూరబుద్ధి యెటులనీకు జనించినది? ఇంతటి యకార్య మొనరించిన కలుషచిత్తుఁడవు నీవులోకంబున నెంతకాలముజీవింతువు? నీవుపొందెడిశిక్ష తె

య్యది ? దుష్టుఁడా! నీవు కుటుంబసహితముగా నాశమై పోఁగలవు” అని నిందింపుచు ప్రాణేశ్వరుని శుభలక్షణములందలంచి వర్ణించివాపోవుచుండ నొకఁడెఱింగిన మనుజుండువచ్చి యామెనుగవి “తల్లీ! ఈ నగరాధిపతి, నీ భర్తను నదీతీరమున సంచరించుచున్నతరి సూనభటులంబనిచి కంఠ ఖండనముఁజేయించెను. మెడగోసి వారు మొండెమచటనేవిడిచి శిరంబును గొనిపోయినారు. ఈ వృత్తాంతమును దెలుపుటకై నేను పరుగెత్తివచ్చుచుంటినిగాని దారిలో రాజభటులడ్డగించినందున తప్పించుకొని వచ్చుటచే తడవైనది” అనిచెప్పి తాను వచ్చుటకు లోపలనే ఖండిత శిరంబచటికిఁ జేరియుంటఁగాంచి యుచ్చారువడి యావిధము నచటి వారివలనఁ దెలిసికొని చింతాక్రాంతుఁడై వెడలిపోయెను.

ఆ మనుజుఁడుచెప్పినమాటలనుబట్టి తనపతికళేబరంబు నదియొడ్డున బడియుండుట నెఱింగినదై ఖండితశిరంబునుంగొని కొందరతివలు వెంట రాగా, నసామాన్య బోరున నేడ్చుచు యేటిదరికిపయనంబై వచ్చుచుండి రాజసౌధంబు దరియంజని నంతట మనంబెఱియ, నగరువంక నట్టె యుగ్రంబుగా జూచి యెల్లరును వినుచుండఁగా “పతివ్రతనైన నన్ను దెలుపఁ బూనినవాఁడును, సుగుణాకరుండైన నా ప్రాణేశ్వరు నేమరు పాటున జంపించిన వాఁడునగు పాపాత్ముండు నివసించుచున్న ఈ రాచ నగరు దగ్ధంబై పోవుగాక! నేనుసత్ప్రవర్తనురాలగుదునేని, సాధ్వినగుదు నేని ఈక్షణంబ నేను తలంచినలాగునం జరుగును గాక” యని బిగ్గఱగాఁ బలికి పిడికెడు మన్నుంగొని రాజసౌధము వంకకుఁ బాఱఁజల్లెను.

ఔరా! పతివ్రతల మహిమ యెంతటి గొప్పదియోకదా! పావన వర్తనయైన యాసాధ్వీమతల్లి యసామాన్య యటుల బలికి శపించగానే యదియెట్లో దైవమునకేయెరుక గాని తటాలున భయంకరంబైన యగ్ని జనించి, గారుచిచ్చునుంబోలె నలువంకలను రాచనగరునావరించి లోపలి వారు వెలువడుటకు వలనుగాని చందము నాశము నంటునట్లు మంట లతిశయించి, క్షణకాలములో రాజసౌధము లన్నియుం గాలి భస్మమయ్యెను. దుశ్శీలుండైన సుషేణుండు తనకుటుంబయుతముగా నమ్మహా జ్వాలలో జిక్కి కాలి బూడిదయ్యెను. పురవాసులా విచిత్ర ప్రకారంబును గనుంగొని, రాజై యుండియు నక్రమం బనక పతివ్రతను భంగపఱచ నెంచిన దురితాత్ముఁడగు సుషేణునకు దేవుండు తగిన శిక్షఁ గావించె నని యెంచి ప్రభావసంపన్నురాలైన యసామాన్యనుఁ గొనియాడిరి.

ఆమె నిజపాతివ్రత్యమహిమచే రాజును, సౌధమును బూడిదఁ గావించి పతిశిరంబుఁ గొని యేటిగట్టునకుఁ బోయి నలుగెలంకులను వెదకి యొక చెట్టుకెలనఁ దల లేక పడియున్న నాథునిశరీరంబునుఁ గాంచి దుఃఖాతిరేకంబున వాపోవుచు, దగ్గటి తాను గొనివచ్చిన తల నా మొండెముతోఁ జేర్చి, యతని సుగుణములను, పవిత్ర వర్తనము, శుభలక్షణంబులును దనపైఁ గలిగియుండిన యనురాగమును నుగ్గడింపుచు, 'ఇంక నాకుఁ బతితోడిదియె లోకంబు' అని నిశ్చయించి, కరుణామయుండై భక్తులను రక్షించువాఁడును, సర్వదా తాను పూజించుచుండువాఁడునునైన శ్రియఃపతికి కృపగలిగి యొక వేళ తన భర్తను బ్రతికించునేమోయనెడి యాశ జనించుటయు, మృతుఁడును ఖండితశిరుండును నగువాఁడు జీవించుటెట్లని తలంపక దృఢ సంకల్పముగలదై 'నిమిషకాలమున లోకంబులు తల్లక్రిందులు చేయఁగల సర్వేశ్వరుని కసాధ్యకార్యంబు గలుగ'దనెడి దృఢ నిశ్చయముతో, రమానాథుని మనఃకమలమధ్యంబునఁ బ్రతిష్టించి, యతిశయించిన భక్తితాత్పర్యం బెసంగ కన్నుల మోడ్చి కరకమలంబులు ముకుళించి "ఓ దయాసాగరా! ఆర్తజనరక్షకా! అతివను, దీనురాలను నగు నాయందు గనికరించి పుణ్యవర్తనుండైన యీ నాభర్తను బ్రదికించి నా సుమంగలీత్వము చెడకుండునట్లు గావింపు"మని యిట్లని ప్రార్థించెను.

## ద్విపద

"శ్రీమానినీమణీ ♦ చిత్తాబ్జభృంగ
కామసన్నిభ రూప ♦ కరుణాంతరంగ
ఖగరాజవాహన ♦ కలుషవిదార
నగధీర నీలవ ♦ ర్ణా గుణాధార
వేదాంతవేద్యంగ ♦ ర్వితదైత్యహరణ
యాదితేయ మునీశ్వ ♦ రార్చిత నురణ
పరమపూరుష పరా ♦ త్పర పద్మనయన
గరిపాలదుగ్ధసా ♦ గరమధ్యశయన
మందరధరను కు ♦ మార శరీర
వందిత సుచరిత్ర ♦ వార్ధిగఁభీర
కాంచనచేల భాస్కర ♦ కోటితేజ
పంచాయుధ యనంత ♦ భక్తసమాజ

మాంపాహి మాంపాహి ♦ మధుకైటభారి
మాంపాహి మాంపాహి ♦ మద్విభూషశౌరి

ఉత్సాహ

దీనురాలఁ గరుణనార్తిఁ ♦ దీర్చి నన్నుఁ బ్రోవవే
దానవాంతకా ముకుంద ♦ తాపపాపహారీ!
జ్ఞానరూప నీ పదాంబు ♦ జంబులాశ్రయించితిన్
గానలోల కంజనాభ ♦ కాంతనుద్ధరింపవే॥

దయానిధీ! పాపాత్మునిచేఁ జంపఁబడిన నావల్లభుని న్యాయైకవర్తనునిం గనికరించి సజీవునింగాంచి నన్ను సంతోషసాగరంబున దేల్చుము తండ్రీ! జగన్నాయకా! నీవు సంకల్పించిన యెడల జరుగని కార్యమెద్దియుంగలుగదు నా మొరాలింపు" మని యనేక విధంబుల దేవుని స్తోత్రము గావించి నిర్మలచిత్తయై "నేను సంతతమును భగవత్పాదారవిందములను నిశ్చలభక్తితో భజించుచుండుదాన నగుట సత్యంబగునేని పురుషులమనోవాక్కాయంబుల మత్పతిందక్కయన్యుం డెఱుంగక పరిశుద్ధంబగు మానసంబుతో వర్తించు పతివ్రతనగుదునేని, మృత్యుండై యున్న నావిభుండు సజీవుండగునుగాక" యని పలికెను. ఆమెనోటనుండి యిట్టుల మాట వెడలుపడఁగానే, దీనసంరక్షకుఁడగు పరమేశ్వరుం డాపుణ్యచరిత్రపైఁ గరుణించి మరణించిన యామె విభుండు జీవించునటుల సంకల్పించె.

ఉత్తరక్షణంబున రాజశేఖరుని కంఠమునకు శిరంబుచేరి ఖండించుటకు పూర్వమున్న తెఱంగునన్నై, ప్రాణవాయువులు చేకురుటయు సచేతనుండై లేచి చెంతఁగూర్చుండి యుండెడి నిజసతిని పరిజనులను గాంచి, వృత్తాంతంబంతయును వారివలన నెఱింగి, దుర్మార్గుండైన సుషేణుండు పాలియుటయు, మృతుండగు తాను పునర్జీవితుఁడగుటయుం దనధర్మపత్ని పతివ్రతామహిమవలననని యెఱింగి బ్రతికిలేచిన తన్నుంగాంచి పరమానందంబునొందినదై యిట్టుల శుభంబు గలిగించిన దేవుని ధ్యానించి, తనకు నమస్కరించి నిలిచిన సాధ్వీమణియైన యసామాన్య నెంతయుం బ్రియంబున గౌఁగిలించికొనియాడి యటనుండి కదలి స్వగృహంబునకుం జేరెను.

అసామాన్య నిజమహిమచే రాజును భస్మీకరించి మృత్యుండైన భర్తను జీవింపజేయుటంగాంచి యాయుత్తమాంగనను పౌరజనంబులు భయభక్తులతో స్తోత్రము గావించి తమలో "ప్రపంచమున పతివ్రతామహిమను మించినది మఱియొకటి గలుగదు. పతివ్రతలు దలం

చిన మొదల నెంతటి గొప్పకార్యమునైనను వారు తృణప్రాయముగాఁ జేయఁగలరు. వారి కేదియు నసాధ్యమగు పని లేదు' అని పలువిధంబులఁ బ్రసంగించుచుండిరి.

అంతట పురవాసు లెల్లరును తమకు రాజు లేకుండుటను గూర్చి తత్పూర్వ మంత్రులుగా నుండిన వారినిఁ జేర్చుకొని యాలోచించి సర్వవిధములను రాజ్యపాలనమునకు రాజశేఖరుండే తగినవాఁడని నిశ్చయము జేసి, శుభముహూర్తమున మహావిభవముతో నతని పట్టాభిషిక్తుని గావించిరి. సద్గుణనిధియైన రాజశేఖరుండు రాజ్యాధిపత్యమును బొంది, సకలజన ప్రియకరుండై పరమసాధ్వీరత్నంబైన యసామాన్యతోఁ గూడి ప్రజాపాలనంబుఁ జేయుచుండెను. అసామాన్య ప్రభావంబు లోకంబున జనశ్లాఘాపాత్రంబైన యొప్పున దయ్యెను.

అసామాన్య కథ సంపూర్ణము,

# 5. చారుమ దేవిక

అవంతీపురంబున నొకప్పుడు వేదవేదాంగ పారంగతుండు, ధర్మాధర్మ విధిజ్ఞుడును, సకల సద్గుణ విశారదుండునునగు వసుదేవుండను బ్రాహ్మణోత్తముఁడు భాగ్యవతియను భార్యతోఁ గూడివసించుచుండెను. అతనికి చారుదత్తుండను కుమారుం డొకడును, చారుమతి యనెడి యొక కూతురునుం గలరు. ఆ సోదరీ సోదరులలో చారుమతి చిన్నది. చక్కని చుక్క. మిక్కిలి గుణవతి. తల్లిదండ్రు లాబిడ్డల నెంతయుగారాబంబుతోఁ బెంచిరి. యుక్తసమయమున చారుదత్తునకు తండ్రి యుపనయనము గావించి విద్యాభ్యాసముఁ జేయించుచు, నప్పటికి పదేండ్ల ప్రాయము గలదై యున్న కుమార్తెకు వివాహము జేయవలయునని యోచించి తగిన వరుని విచారించుచుండెను. కాని యుక్తసంబంధము కుదిరినది కాదు.

ఇట్లుండఁగా నొకనాఁడు సన్యాసి యొకడు భిక్షార్థియై వారి యింటికి వచ్చెను. భాగ్యవతీ వసుదేవులు భక్తితో నతనికర్ఘ్యపాద్యాదులొసంగి పూజించి నాఁడు తమయింట భిక్ష నొసంగిరి. సన్యాసివారి భక్తికిని, సుగుణములకును నెంతయు సంతసించి కొంత తడవచట విశ్రమించి యుండెను. అప్పుడు మందిరములో నటునిటుం దిరుగుచున్న చారుమతి

నతఁడు చూచుట తటస్థించెను. ముద్దుల మూటదైన బంగారు బొమ్మ వలె నొప్పుచున్న యాబాలిక నట్టె యెగాదిగఁ జూచి యాసన్యాసి దీన ముఖుండై తలయూఁచి నిట్టూర్చెను.

ఆదియంతయుం జూచుచుండిన గృహాధిపతి సన్యాసియొద్దకు వచ్చి వినయముతో "స్వామీ! ఈ బాలికను చూచి వివర్ణముఖముతో తల యూఁచి నిట్టూర్పుఁ జెందితిరి ఏల? నాయందు కరుణించి తత్కారణ మును వివరింపుడని వేడుచున్నాను. మీఁబోటి పెద్దలు నిమిత్తము లేక యిటుల నటింపరని నానమ్మకము" అని యడిగెను.

సన్యా:—బ్రాహ్మణోత్తమా! ఔను! కారణము గలుగుటచేతనే దైన్యము జెంది నొచ్చినాఁడను.

వసు:—అయ్యా! ఆ కారణమెట్టిది?

సన్యా:—మాకామాటను నీతో చెప్పుటకు నోరాడకున్నది సుమీ!" ఇటుల నతఁడు పలుకగానే యది యేమై యుండునో యని వసు దేవునకు గొప్ప సంశయమును భయమునుం బొడమెను. విషయము ఫలాని దని చెప్పకనే యాసన్యాసి, మరల రెండు మూడుసారులు నిట్టూర్చి ముఖమున జాలినొందిన లక్షణములు గనుపట్టగా "దైవసంకల్పమున కెవ్వారేమి చేయగలరు!" అని యూరకుండెను.

వసు:—స్వామీ! మీ వాక్యములలోని యర్థము యించుకైనను నాబుద్ధికిఁ దోఁచలేదు. మనస్సంకటము గలిగినది దేనివలన మీతలంపు నకు అటుల దైన్యము బొసంగునటులఁ గనుపట్టినదో వివరించి నావిచార మును మాన్పుండు. సన్యాసి మౌనముగా యొకటిరెండు నిమిషములాలో చించుచుండి, వసుదేవునింజూచి విప్రోత్తమా! చెప్పరాని విషయము దానిం జెప్పినచో, నీ యింటగుడిచి నీకు వ్యాకులమును గలిగించినవాడ నగుదును.

ఆ లాగునఁ జేయుటకు నామనం బొల్లకున్నది. కావుననే సంకట పడుచున్నాను. సజ్జనుండవగు నీకు విషయమును దెలుపకుండుటయును మంచిదికాదు. ఏమైనను మన మేమి చేయఁగలము!" అనెను.

వసు:—ఏదేనియు నుపద్రవము గలుగునని తోఁచినదా?

సన్యా:—ఉపద్రవమనగా నెట్టిదని నీయభిప్రాయము తీఱనిదుఃఖము ననుభవించవలసిన విషయము.

వసు:—అయ్యో! అలాగా! కరుణించి దానిం దెలుపుడు.

సన్యా:-అయిన చెప్పవలసియెదరా? నాయందు తప్పు మోపరాదు.

వసు:-తప్పు మోపుట యేఁ? మీకు తెలిసినది చెప్పినప్పుడు.

సన్యా:—అయిన వినుండు; ఈ బాలికకు వరుండు యోగ్యుఁడైన వాఁడే లభి[illegible]పఁగలవాఁడు [illegible]ని—

వసు:-మరల కాని యని సంశయి. చెదరేల? చెప్పండి.

సన్యా:-భర్త మంచివాఁడుగా దొరికినను ప్రయోజనము లేదు. అతఁడు జీవింపఁడు.

ఈ మాటను వినగానే వసుదేవుని ముఖము వివర్ణమయ్యెను, పైన పిడుగు పడినట్లుగా నుండెను. దాపుననుండి భర్తకును, సన్యాసికి జరుగుచున్న సంభాషణ వినుచున్న భాగ్యవతి నిట్టనిలువున నిర్విణ్ణయైనిలి చెను. [illegible] అశ్రుబిందువులు రాలుచుండెను. బుద్ధి మంతుఁడైన వసుదేవుఁడెట్లో సమాళించుకొని ధైర్యమువహించి సన్యాసిం జూచి "స్వామీ! ఆ విషయమును వివరముగా సెలవివ్వండి, అలాగున సంభవించుట కేమినిమిత్తము?" అని యడిగెను.

సన్యా:-నిమిత్తము నీ పుత్రిక చేసిన పూర్వపుణ్యఫలమే. వేఱే దియుగాదు. వివాహము జరిగినంతట నైదవ దినము యీమెను పెండ్లాడిన వాఁడు మృతినొందును. ఈ బాలికకు వైధవ్యము సంప్రాప్తమగును. ఇది తప్పదు.

వసు:-కటకటా! హా దైవమా! స్వామీ! ఏకపుత్రిక, ఈమె విధవయై దుఃఖము ననుభవించుచుండఁగా కన్నతండ్రినగు నేను దీన్ని చూచుచుండఁగలను? వివాహమే చేయకుండినయెడల జాతి[illegible]ము నిందితుఁడ నగుదునే! ఎట్లు ఏమిచేయుదును? స్వామీ! దీనికి పరిహార మేదియును గలుగదా!

సన్యాసి:-తలమీఁదికెత్తి యించుక యాలోచించి "ఉన్నది, కాని యది యసాధ్యమైనపని, యా కార్యమును సాధింపఁగలిగినయెడల నీమెకు దీర్ఘసుమంగలిత్వము సిద్ధించును" అనెను.

వసు:-ఆ కార్య మెయ్యది? ఏమి చేయవలయును?

సన్యా:-అయ్యా! అది సులభసాధ్యముగాదు. అయినను చెప్పెదను వినుఁడు. ఏమందురా?— అని చెప్పనారంభించెను. "తూర్పుసముద్రములో సువర్ణద్వీపమనెడి దీవి యొకటిగలదు. అది యిచ్చోటికి సుమారు యేఁనూరు ఆమడలదూరమున నుండునని తలంచెదను. ఆదీవికి ముఖ్యపట్ట

ణము సువర్ణపురము. ఎక్కుడు విశాలమై జనబాహుళ్యము గలిగి వృక్ష లతాగుల్మ సరిన్నదీ తటాక వాహినులును దివ్యవనంబులును గలిగి సకల జంతు సంతానసంకులంబునునై కనులపండువుగా నొప్పు సువర్ణద్వీపము సువర్ణేశ్వరుండను రాజుచే పాలితంబై విలసిల్లును. ఆనగరమునుగాంచిన వారు దానిని భూలోకస్వర్గమని వర్ణించుచుందురు సరిగదా? అచ్చటి జనులు మిక్కిలి కొనియాడఁదగిన సత్ప్రవర్తనగల యుత్తములు. ఆసువర్ణ పురములో నొక చిన్నవీధికి కడపట నొక శూద్రకులజాతియగు పుణ్యకాంత గలదు. ఆమె పేరు ధీమతి. అచ్చోటికరిగి నీ వెవరి నడిగినను నమ్మాగువ యుండుస్థలమును జెప్పఁగలరు. ధీమతి యనిన నెల్లవారికిని బూజ్వారాలు మిగుల ప్రసిద్ధికెక్కిన యుత్తమకాంత, పెక్కండ్రుకొడుకులును గూతుండ్రును, మనుమలును, మనుమరాండ్రును గలిగియుండెడి గొప్పకుటుంబి సామర్థ్యము గలదేని యచ్చోటికిఁబోయి, పరమపతివ్రతాశిరోమణియైన యామె కరుణ వడయవలయును. ఆమెకు సాటియనఁదగిన సాధ్వీమతల్లి మఱియొకతె లోకంబున గలుగదు.

ఈ చిన్నదానిపైఁ గలిగిన కనికరముచేత పరమరహస్యమును నీకుఁదెలుపుచున్నాను సువర్ణపురమునకుఁబోయి నేను చెప్పిన భాగ్యవతిం దెలిసికొని యామె నాశ్రయించి యామెదయను సంపాదించి యేలాగున గాని ప్రార్థించి మనసుఁ గరగించి యా మహాపతివ్రతను యిచ్చటికిం దోడ్కొనివచ్చి, నీకుమార్తె కామె సమక్షమునసే పెండ్లిగావించి, ముహూర్తకాలమున తోడ్కొనివచ్చిన సాధ్వీమణివలన నామె యొనరించిన పుణ్యములో నొకనాఁటి ఫలమును నీకుమార్తెకు ధారవోయించవలయును. ఆలాగున నాపుణ్యవతి చేసెనేని, తత్ఫలమునందలి మహిమచే నీజామాతకుఁ గలుగబోవు గండము తప్పిపోవును. అంతేకాదు, నీకూతురును నల్లుండును దీర్ఘాయురారోగ్యవంతులై సంపద లతిశయించికీర్తిమంతులై మనఁగలరు. అయ్యో! ఇంతపనిఁ జేసిననే, నీకు నల్లుఁడగువాఁడు బ్రతికియుండగలఁడు. లేనియెడల చావక తప్పదు. ఇది యసాధ్యమైన కార్యము చాలదూరమున నుండెడి యా దీనికిఁ బోపుటయు వచ్చుటయు సుకరముగాదు. ఎట్లు కార్యము సాధింపఁగలవో నీయిష్టము. ఇంక నేను పోయెదను"—అని పయిప్రకారము వివరముగాఁ జెప్పి పరివ్రాజకుఁడు నిజేచ్ఛం జనియెను. అంతటధీమంతుఁడైన వసుదేవుఁడును భాగ్యవతియు తన ముద్దుకూతునకుం గలుగ నుండెడి దుఃఖమును గూర్చియు సన్యాసి

చెప్పిన తత్పరిహార క్రియలను గూర్చియు నాలోచించి "ఆయశక్య కార్యమును చేయు టెట్లని చింతింపఁ దొడంగిరి.

ఎట్లు చేయవలయునో వారికిఁ దోచినది కాదు. ఇటుల కర్తవ్యమును గూర్చి పలుదెఱంగుల నుపాయంబులను యోచించి తుదకొక నిర్ధారణ జేసికొని భార్యనుజూచి "ఈ కార్యము నశ్య్ర లెవ్వరును పూని చేయఁబోవునది లేదు. నేనెబిడ్డను దోడ్కొని సముద్రపుదరికిఁబోయి కాచియుండెదను దైవకృపవలన నోడ యేదేని యు లభించినచో యెన్ని సంకటములు గలిగినను, నోర్చి నావనెక్కి యాదీవుంజేరఁ దలఁచినాను. అది నాయత్నము. పిమ్మట దైవము చూపినగతి యెట్లో యటుల కాఁగలదు. ఓడ దొరకనియెడల జరుగఁదగిన మార్గము తెలిసియే యున్నది. ఎట్లు పోయిన దారినేవచ్చి యిల్లుజేరుట! ఈ భారమంతయును భగవంతునిపై బెట్టి పోవఁదలంచినాను. ఈకుమారి యదృష్టము మంచిదిగా పరిణమింపనుండెనేని యన్ని పనులు ననుకూలములుగానే యగును. కానిచో మన మేమి చేయఁగలము?" అని యిష్టార్థంబున భార్యతో నుడివి, యొక నాఁడు ప్రాతఃకాలమున దారిబత్తెమును గట్టుకొని కుమార్తెను వెంటఁ బెట్టుకొని, దిక్కు దెసయులేని దీవికిఁ బోవుటకై పరివ్రాజకుని మాటలను నమ్మి తూర్పుసముద్రపు టొడ్డునకు ప్రయాణమైపోయెను.

ఈ వృత్తాంతము నెఱింగినవారు "వసుదేవుఁడు కేవలము మూఢుఁడని యు, నసాధ్యమైన మహాకార్యమును సాధించుట కితనివశమా?" యనియు పరిహసించిరి. కాని యతఁ డా వాక్యములను చెవులఁబెట్టక ధైర్యము సహాయముగాఁ జనిచని సాయంకాలమునకు పూర్వసముద్రపు టొడ్డునకు జేరెను. అచ్చట నొక గొప్ప మఱ్ఱిచెట్టుగలదు. దాని మూలమునకు కొంత యెడముగాఁ గూర్చుండి దారినడచి యలసియున్న కుమార్తెను పరుండుమని చెప్పి, యాకులుం బుడకలు నిటు నటును ద్రోసి నేల కొంచెము బాగుచేసెను. ఆ బాలిక మెఱుఁగుపఱచుకొని యచటఁబరుండి నిద్రించెను. కాని, కార్యార్థియు నిస్సహాయుఁడును నగు వసుదేవుని కా విజనస్థలమున పరుండుటకును నిద్రించుటకును మానసము సమ్మతింపలేదు. నిండువెన్నెల గాయుచుండెను. హాయిగా చల్లగాలి వీచుచున్న యచ్చోటఁ నట్లెకూర్చుండి యతండు జరుగవలసిన రీతిని దలంచి తనలో తానె యాలోచనఁ జేయుచుండెను.

ఆ చోటు నిర్జన ప్రదేశమయినందునను, అచ్చటి వృక్షము మిగుల
గొప్పదై కోటరములతోఁ గూడియుండునదియు, నాఁకలును కొమ్మలును
దట్టముగా కలిసికొని యుండునదియు నగుటచేత భేరుండ పక్షి మిథున
మొకటి పెక్కునాళ్ళనుండి నిర్భయముగా గూడుకట్టుకొని యా చెట్టుపై
వాసముఁ జేయుచుండెను. ఆకారమందు పెద్దవై మిగుల బలము గలవైన
యా పక్షులు తెల్లవారగానే గూడువిడిచి యాహారార్థము సముద్రద్వీప
ముల కరిగి తృప్తిగా నెరమెసవి, తమ గూడునకు సాయంకాలమునకుఁ
జేరుచుండుట వాడుక, కాని అవి గ్రుడ్లుపెట్టి పిల్లలు చేసినపుడు మాత్ర
మా వృక్షమూలమందలి కలుగులోనుండి గొప్ప పామొకటి చెట్టుమీఁది
కెక్కి పెద్దపక్షులు లేని సమయమున పిల్లలంగని పోవుచుండెను. ఇట్లు చాల
దినములనుండి జరుగుచుండినను, పెద్దపులుగు లేమియు చేయలేక, మాటి
మాటికిఁ దమ పిల్లలను పాము వాతబెట్టుకొనుచుండుటకై చింతింపుచు
కర్తవ్యము దెలియక మిక్కిలి దుఃఖించుచుండెడివి. వసుదేవుఁడా వృక్షము
క్రిందకుఁ జేరినపుడు భేరుండపక్షులు గ్రుడ్లుబెట్టి పొదిగి పిల్లలను జేసి, ఎరఁ
దెచ్చి పెట్టి పెంచుచుండెను. కాని సర్పబాధను దప్పించుకొని యా పిల్లలు
బ్రతుకుకొనయన్మై తమలో చింతిల్లుట తప్పినది కాదు. ఎట్లును దామా
హారార్థము బోకతీరదుగదా? ఆనాఁడును నవి రెండును పిల్లలను గూటిలో
విడిచి యెచ్చోటికో పోయియుండినవి. చీకటిపడగానే పెనుబాము పుట్ట
లోనుండి పక్షిపిల్లలం దినుటకై యది వుండియనని వెలువడి చెట్టు
మీఁదికి ప్రాకి పోవుచుండెను. దానిబుసవినగానే గూటిలోని పిల్లలు తమ
పాలిటి మృత్యువైన పాము వచ్చుచుండుటం గాంచి యధికమైన భయ
మును బొంది, కిచకిచఁ గొట్టుకొని యఱచుచుండెను. పాము చెట్టుపైకి
ప్రాకుచుండుటయు, పులుగుపిల్లలల్లాడుటయు వసుదేవుఁడు చూచి 'ఓహో!
ఈ పాము గూటిలోని పిల్లలందినుటకై కాఁబోలు మీఁదికిపోవుచున్నది.
ఈ చెడుపామును జంపి, పిట్టపిల్లలను కాపాడుట పుణ్యకార్యము. ప్రాణ
రక్షణసూత్ర మన్ని కార్యములలో శ్రేష్ఠముగాదా!'' అని యెంచి, రాయి
నొకదానిఁ గొని సూటిగా బలముకొలఁదిని సర్పముపై విసరి కొట్టెను.
హఠాత్తుగాఁ దగిలిన యా గొప్ప దెబ్బచే పూసలువిఱిగి పాము క్రిందఁ
బడియెను. జరుగునని తెలిసి, సిద్ధముగానుండిన యా బ్రాహ్మణుండు
మఱియొక రాతితో దాని తలఁ జదుకగొట్టి చంపెను. పెక్కునాళ్ళనుం

డియు, కీడుచేయుచుండిన పాము చచ్చుటచే నాపిల్లలు తమ ప్రాణములు దక్కించుకొనఁ గలిగెను.

తమ పిల్లలను పొట్టలోఁ బెట్టుకొని పోక యా దుష్టసర్పము విడిచి యుండదని తలంచి మిక్కిలి దుఃఖించుచు పక్షి మిథునము వాడుక ప్రకారము, వేళదప్పక తమ యిరువుఁ జేరెను. అపుడు చూడఁగా తాముతలంచినట్లుగాక పిల్లలు సజీవములై సంతోషముతో తమ రాకఁగని కిచకిచఁ బలుకుచు పైకెత్తిన తలలుగలవై కన్నుల పండువుఁ గావించెను. అట్లుండునని యెంచని యా పక్షు లాశ్చర్యమును, నానందమును నతిశయింపఁగా తాము కొనివచ్చిన యెరను వానికిఁబెట్టి బుజ్జగించి "ఏమీ! పిల్లలారా! కన్నులార మిమ్ము చూడఁగలమని తలంచిన వారము గామే! దేవునకు మాయందు కృపగలిగి, దీనదయాపరుండగుటచే మిమ్ము రక్షించెను గాఁబోలు? ఎట్లు బ్రతికితిరి? మాకు మున్ను గలిగిన పిల్లలన్నిటిం దినుచు మమ్ము దుఃఖసాగరమున ముంచుచుండిన పెనుబాము రాలేదా? ఏకారణమున మీకు గండము తప్పినది?" అని యడిగినవి. క్రింద జరిగిన రీతినంతయు గూటిలోనుండి చూచుచుండిన పక్షిపిల్లలు నడిచినవిధమంతయుం జెప్పి తమవృక్షమూలమునఁ గూర్చుండియున్న విప్రునింజూపి "తల్లిదండ్రులారా! అదిగో! మాప్రాణములు గాఁచిన పుణ్యాత్మునిం జూడు" డని చెప్పినవి.

వసుదేవుఁడు పక్షిభాషను తెలిసికొను విద్యను నేర్చియుండెను. కావున, చెట్టుపై, పక్షులకును వాని పిల్లలకును జరుగుచున్న సంభాషణ యంతయును వినుచు, పామును జంపి యీ పిల్లలం గాచునట్లు మంచిబుద్ధి తనకుఁ గలిగినందుల కెంతయు సంతుష్టుఁడై కూర్చుండియుండెను. తమ పిల్లలు చెప్పిన పలుకులు విని భేరుండము లా క్రింద కూర్చున్న బ్రాహ్మణునిగాంచి యధికమైన పూజ్యభావముతో నతనియొద్దకుం దిగివచ్చి నమస్కార సూచకముగా తలనువంచి, "ఓ పుణ్యపురుషా! మా పరమశత్రువగు ఘోర సర్పమును జంపి మా పిల్లలను రక్షించిన వాఁడవును, నిరంతర సంతాన నాశన దుఃఖితులమగు మాయెడరు మాన్పిన వాఁడవగు నీ వెవ్వఁడవు? మా వంశము నుద్ధరించుటకై కనికరించి యీ రూపముతో వచ్చిన భగవంతుఁడవేమోనని తలంచుచున్నాము. నీ వృత్తాంతము నెఱింగించి మమ్ము ధన్యులచేయుము" అని ప్రార్థించెను.

వానిభాష నెఱింగిన యా భూసురవర్యుండు, తాను కుమార్తెను దోడ్కొని యచ్చోటికివచ్చి చేరుటకు కారణమైన తన వృత్తాంతము సర్వమును వానికిం జెప్పి, "స్వర్ణద్వీపమునకుం బోవుటకు మాకు సాధ్యముగానందున హఠాత్తుగా నేదేనియు నావ యీ వంకకు రాఁగలదేమో యను నడియడియాసతో నిచ్చటనుండెదను. ఇదె; ఈ పరుండి నిద్రించుచున్న బాలిక యే నాకుమరిత. ఈమెకొఱకే యింతటి సంకటములను బొందుటకు నేను సంసిద్ధుఁడనైతిని" అనెను. తమకు మహోపకారియైన బ్రాహ్మణుడు చెప్పిన వృత్తాంతమును వినిన పక్షులు జాలినొంది తమ కలనైన ప్రత్యుపకార మొనరించి కృతజ్ఞతను జూపదలచినవై పక్షులు రెండును గలియబలుకుకొని, యొకవిధంబునఁ గర్తవ్యాంశమును నిశ్చయించి యతనితో నిట్లని చెప్పినవి. "అయ్యా! మేము పక్షులము. మీరు చేసిన మహోపకారమునకు బదులుగా మా శరీరమును నర్పించినను జాలదు. కృతజ్ఞులమై యథాశక్తి నీకొక మేలుసేయఁ దలంచితిమి. వినుము. ఎంతకాలము ఇచ్చటనుండినను మీతలంపు నెరవేఱదు. ఇది యోడల రాకపోకల మార్గము కానందున నీవంక నావలు రానేరావు. కాఁబట్టి యట్టియాశ నిష్ప్రయోజనము. ఇంక మేము చేయనెంచిన విధమెట్లనఁగా, మేము ఇరువురమును, చెరి యొకరినిగా వీఁపులపైఁ గూర్చుండబెట్టుకొని యంబర మార్గమునఁ గొనిపోయి గమ్యస్థానమును జేర్చెదము. అపుడపుడు నుం బోవుచువచ్చుచుండు వారమగుటచే మీరు పోవనెంచిన సువర్ణద్వీపమును, నందలి రాజధాని పురముగు సువర్ణ పట్టణమును మేము బాగుగ నెఱింగియుండెదము. మీరు వగవవలదు. కడు శీఘ్రముగా మిమ్ము నచట జేర్చుశక్తి మాకుఁగలదు. పక్షులుగదా యని సంశయింపకుము. ఈరాత్రికి మీరిచ్చటనేయుండి సుఖముగా నిద్రింపుఁడు. తెల్లవారగానే మాదుకప్రకార మాహారసంపాదనార్థము పోవుటకు వెడలినపుడు మీ యొద్దకువచ్చి మీకు చెరియొక పండునిచ్చెదము. దానిని మీరు భుజించినచో తృణమువలె మీశరీరములు మాకుమిక్కిలి తేలికయగును. సులభముగాఁ గొనిపోయెదము. ఇట్లుగాక మఱియొకలాగున మీ కార్యమును సాధించుటకు శక్యముగాదు" అని చెప్పి భుజించుటకు కొన్ని మధుర ఫలముల నెచ్చటనుండియో తెచ్చి విప్రున కొసంగి యతని యనుమతిం గొని చెట్టుమీఁది తమ గూటి కరిగినవి.

దైవమనుకూలించినపుడు మేరువు తృణముగను, మహాసముద్రంబు

పిల్లకాలువ నను దోచునని పెద్దలు చెప్పుదురు. ఎంత యశక్యమగు పనియైనను ననుకూలముగా పరిణమించును వసుదేవుని స్థితి యిపుడటు లనేయైనది. అతని తలంపునకు దైవ మనుకూలించినది. ఇంక నతనికి కార్యసిద్ధి యేలగ పోవును తలచని తలంపుగా తనయత్నమున కను కూలపద్ధతి యేర్పడినది. తలంచి భగవంతుని ధ్యానించి వసుదేవుండు పక్షులు దెచ్చిన మధురఫలము లారగించి యెపుడు తెల్లవారునా యని గడియలు లెక్కించుచు నాటిరాత్రి గడపెను.

అరుణోదయమైనది. చెప్పిన చొప్పున పక్షు రెండు చిన్నవైన పండ్లను దెచ్చి వసుదేవునకును, నతని పుత్రికకును నిచ్చినవి. వారువానిని దినగనే యొక్కొక పక్షి యొక్కొక్కరిని తృణప్రాయముగా తనపై నెక్కించుకొని గగనపథంబున బహుదూర మరిగి, రమణీయంబైన సువర్ణద్వీపమును జేరి యందలి ముఖ్యపట్టణమగు సువర్ణపుర ద్వార సమీపమున వారలదించి మ్రొక్కి యతని యనుమతిని గైకొని యా పులుగులు నిజేచ్ఛంబోయెను.

అంతట దుర్ఘటంబైన పని సులభముగా నెఱవేరుట కెంతయు సంతోషమొంది, యాద్విజోత్తముడు కూతుదోడ్కొని నగరమును ప్రవేశించి తత్పురసౌభాగ్యంబున కెంతయు నాశ్చర్యమును బొంది చూచుచు, పరివ్రాజకుడు చెప్పియుండిన గుఱుతుల క్రమప్రకారం బర యుచు తనలో 'ఆహా! ఆ సన్యాసి సామాన్యుడు గానేరడు ఇంతదూర మున సముద్ర మధ్యమందలి యీ పట్టణమున కెటులరాగలిగెనో, యిం దలి విశేషములనెల్ల నెపుడుగాంచెనో, యతనిప్రజ్ఞయు మహిమయు, ననాధారణములైనవి ఇందలి విశేషములన్నింటిని జెప్పెనుగదా' యని యచ్చెరు వందుచు, నందుధీమతి యుండుచోటును విచారించుచుంబోయి పురంబులో నొక వీధికి గడపటనుండెడి యామె మందిరముం దెలిసికొని జరుపవలసిన రీతినంతయు మున్నుగానే కుమార్తెకు బోధించి గృహ ద్వారమున కరిగి నిలిచి "ధీమతియను పేరుగల పుణ్యకాంతామణి పావన గృహం బిదియేయగునా?" యని బిగ్గఱగా నింటిలోని వారి నడిగెను.

లోపలనుండిన ధీమతి, తన పేరుంజెప్పి వాకిటనుండి యడుగుచున్నారు అనిధ్వని వినగానే వాకిటికివచ్చి, బాలికాసహితుడై నిలిచియున్న యా క్రొత్తవిప్రునింగాంచి వినయముతో "అయ్యా! మీ రెవ్వరు? ఎచటనుండి వచ్చితిరి? నెట్లు తెలిసికొంటిరి. నావలన

మీకుఁ గాఁదగిన కార్యమెయ్యది? ఆ బాలిక యెవ్వతె? మీకు నామందిరంబెట్లు తెలిసినది? నేనె! ధీమతి యనుదానను. మీ వృత్తాంతము నెఱింగింపుఁ" డని యడిగెను.

ఆమె తనపేరును జెప్పగానే తండ్రిచే బోధింపఁబడియున్న చారుమతి తటాలున నామె పాదములపై వ్రాలి నమస్కరించి చరణంబులను గట్టిగా పట్టుకొని యట్లెపడియుండెను. ధీమతి యాశ్చర్యమును బొంది తనలో 'ఇది యేమివింత? వీరు నే నెఱింగినవారు కారు. లక్షణములను బట్టి చూడఁగా బ్రాహ్మణులని తోఁచుచున్నది. ఈబాలిక నా పాదములు బట్టుకొని విడువకున్నది. ఇటుల చేయుటకు కారణ మేమైయుండును?" అని చింతించుచు, బ్రాహ్మణ కన్యక శూద్రస్త్రీయైన తనకు మ్రొక్కినందు కెంతయు వగచి, తటాలున పాదాక్రాంతయైయున్న చారుమతిని గ్రుచ్చి పట్టి లేవనెత్తి కౌఁగిటం జేర్చి "తల్లీ! నీవు భూసురకుల జాతవుగాఁ గనుబట్టుచున్నావు నాల్గవకులము దాననైన నాకు నమస్కరింపఁదగునా? తప్పుగాదా? ఇటుల నేల చేసితివి?" అని బుజ్జగించి యడిగెను.

ఆమెమాటలువినఁగానే చారుమతికన్నులనుండి శోకబాష్పములు రాలఁదొడంగినవి. ఆ కన్నియ పలుకజాలకుండెను. దయాగుణములు గల ధీమతి యాదరవాక్యములకలరి, వసుదేవుఁడు బదులు చెప్పఁదలఁచి ప్రారంభించి యాకన్నియ తన యేకపుత్రిక యగుటం దెలిపి, తమయింటికి పరివ్రాజకుండు వచ్చినదిమొదలుగా కూతుం దోడ్కొని తానాస్థలంబునకుఁ జేరినంత వరకును జరిగిన వృత్తాంతము సర్వము నెఱింగించి "తల్లీ! సాధ్వీశిరోమణి! ఈచిన్నదానిని నీకడుపుఁన బుట్టిన కుమార్తెగా భావించి కనికరించి యీయామెను దీర్ఘసుమంగలినిగా నుండునాగున ననుగ్రహింపుము. మాయందు కరుణగలదానవై మాగృహంబునకువచ్చి ముందల నుండి వివాహ కార్యమును నెరవేర్చి వధూవరులను దీవించి రావలయునని ప్రార్థించుచున్నాను" అని పలికి భోరున నేడ్చెను.

సాధారణముగానే దయాగుణముగల ధీమతివారి రీతినిగాంచి వారి చరిత్రమును విన్నంతట మానసము కరగి యధికమైనజాలి జెంది వసుదేవునిఁజూచి "విప్రోత్తమా! చింతిల్లకుము. మీకు భగవంతుఁడు సహాయముఁ జేయునుగాక! నానాకష్టములుబొంది యింతదూరము నాకొఱకై వచ్చిన మీకు నావలన నగు సహాయముఁ జేయకున్నచో మహాపాపము ంచును. నేఁడేనేను ప్రయాణమై మీవెంట వచ్చెదను" అని దృఢముగా

జెప్పి వారిదిగులు వారించి వారికీదగు నుపచారములు జరుగుటకు దగినట్టి యేర్పాటులు గావించి విడియించి, నాఁటిరాత్రి తనభర్త కావృత్తాంతం బును దెలిపి యా పుణ్య కార్యార్థమరుగుట కనుజ్ఞ వేడిన భార్యయొక్క సుగుణముల నెఱింగిన వాఁడైన యామె పతి ప్రయాణమునకు సులభ ముగా నంగీకరించెను.

మఱునాఁడు ధీమతి వసుదేవునివెంటఁ బోవుటకు ప్రయాణంబై యింటిలోని వాఁనిపిలిచి "నేనరిగినంతట మన గృహంబున నెవరైనను, లేక నెందఱైనను మరణించినయెడల నట్టివారి. నేమియుంజేయక గదిలో బెట్టి తలుపుమూసి పెట్టవలసినది" అని దిట్టముగా జెప్పిపయనమయ్యెను. అపుడు బ్రాహ్మణుండు తనలో 'పోవుట కేసాధనమును లేదే సముద్ర మును దాఁటవలయునే! బహుదూరము బోవలయునే! ఎట్లు? ఈమె పయనమై యేమిచేయును?' అనితలంచి 'యేలాగున జేయునో చూతము గాక' యని యామె ముందుజనుచుండ కూతుందోడ్కొని యామె నను సరించి వెనుకనే పోవుచుండెను.

ఆలాగునఁ బోయి ధీమతి సముద్రములో నడుగుబెట్టెను. ఆమె పాదము సోఁకగానే నీరుగట్టిపడి వారి మార్గము తరంగరహితమై రాయి వలెనయ్యెను. వసుదేవుఁడావింతఁజూచి యది ధీమతి మహిమ యగుట నెఱింగి యాశ్చర్యమును జెంది 'నానివాసము సుమారు యేనూరామడల దూరమున నున్నది. ఈమె యిటుల నడచి యచటి కెపుడు చేరగలదు? అధమ మూఁడుమాసములైన నుపట్టునే!' యని తలంపుచుమిన్నకయామె వెనుకనే పోవుచుండెను. సుమారొకటి రెండుగడియలదూరము వారలా గట్టిపడిన నీటిపై నడిచిపోయి నంతట ధీమతి విప్రునిఁజూచి "అయ్యా! నేను మరల చెప్పెడిదనుక మీర లిరువురును గట్టిగా కండ్లు మూసికొనుఁడు" అని చెప్పెను. వారట్లే గావించిరి. రెండు నిమిషములు గడచినంతట కండ్లుతెరువుం" డనెను. వారు కండ్లుదెరచిచూచి యత్యంతాశ్చర్యమును జెందిరి. ఏలనసగా, వసుదేవుఁడును చారుమతియును ధీమతీసహితులై తమ పురద్వారమునొద్ద నుండుట దెలిసికొనిరి. ఆహా పతివ్రతల మహిమ యెంత గొప్పదనవలయును? వారు ముగ్గురును పట్టణములోఁ ప్రవేశించిరి. భర్తయునుగూఁతురును రాగానే చూచి భాగ్యవతి విస్మయించెను. అసాధ్యమగు కార్యార్థము బోయినవారగుటచే యంత శీఘ్రముగా రాఁగలరని యామె తలంచి యుండినది కాదు. అంతలో ధీమతియు

వచ్చెను. బ్రాహ్మణుండామెను భార్య కెఱింగించెను. ఆపుణ్యశీలకు వారు తగు సత్కారములు గావించి సుఖాసీనం గావించిరి. తమయందు కనికరించి, కష్టమనక తమ కుపకారముఁ జేయుటకై బహుదూరమునుండి వచ్చిన ధీమతికిఁగల యవ్యాజానురాగమునకును, దయకును, తన భర్త జెప్పఁగా నెఱింగిన యామె ప్రభావమునకు నెంతయుం దృప్తినొందివిప్రుని భార్య యా పుణ్యవర్తనను మిక్కిలి గొనియాడెను. ఇల్లువిడిచి తాము పోయినదాదిగా నప్పటిదనుక తనకుమార్తెనొసంగఁదలచియున్న యుత్తమకులజండును విద్యావంతుఁడునగు యువకునకు కన్యాదానముఁ జేయ నిశ్చయించి శీఘ్రకాలములోముహూర్తమునిశ్చయించి తగినప్రయత్నము జేసి, శక్తికిఁ దగిన వైభవముతో పెండ్లి గావించెను. నాలుగు దినములు గడచినవి, అయిదవ నాడు తనభర్త మృతుండగునని బుద్ధి దెలిసినదైన చారుమతి యెఱింగియున్నది. కావున నామె వివర్ణముఖియై చింతాకుల మానసయైయుండెను. ఆమె తల్లిదండ్రులును నట్లేయుండిరి. విధి తప్పదు గదా? ఐదవనాఁటి సాయంకాలము హఠాత్తుగా పెండ్లికుమారునకు జ్వరము సంభవించి, కొలఁదిగడియలలో నది కడుతీవ్రమై పరిణమించి యా యువకుండు తటాలున మరణించెను.

ఇరువంకల పెండ్లివారును శోకసాగర మగ్నులై యుండిరి. వసుదేవుడు మాత్రము సర్వమును సన్యాసి చెప్పినట్లే జరుగుచుండుటం దలంచి ధీమతి దయవలన దమ జామాత జీవింపగలడను నమ్మకము గలవాఁడై ధైర్యముతో నుండెను అతడు ధీమతియొద్దకరిగి సంభవించిన విధమంతయు నెఱిఁగించుటయు, పరమసాధ్వీరత్నంబైన యామె మందహాససుందరవదనారవిందయయి మృతకళేబరము నొద్దకరుదెంచి చూచి ' ఓ పరమేశ్వరా! మనోవాక్కాయ కర్మములందు నేను నాప్రాణవిభుని సేవయె కండుదక్క తలంపు నితర విషయముల దగులనీయక మెలంగుచుండెడి పతివ్రతనగుదునేని, యనవరతమును భక్తిసంకలితచింతనై నీదివ్య పాదారవిందములను భజించుచుండెడి భవదీయసేవకురాలనగుదునేని, సత్యమును ధర్మమును నూతగా మెలంగు నిర్మలశీలనగుదునేని, యకాలమరణమును బొందిన యామృడకుమారుండు పునర్జీవి యగునుగాక! ఇతండు బ్రతుకుటకై నేనొనర్చిన పతిభక్తి పుణ్యములో నొకనాటియం దొక జాముఫలము నీతని కొసంగిన దానను'' అని పలికి పుడిసిట నీరుఁగొని మృతకళేబరంబుపై జల్లెను. ఆపావన జలంబులు మీఁదసోఁకగానే, నిదు

రించువాఁడు మేలుకొన్న చందమున చారుమతి భర్త సజీవుఁడై లేచి కూర్చుండి యచ్చటివారి నెల్లర నాశ్చర్యమగ్నులఁ గావించెను.

సర్వజనులును ధీమతీదేవి సామాన్య మానవస్త్రీగాదనియు మనుష్యరూపముతో నవతరించిన పరదేవత యనియు భావించి మహాపతివ్రతయగు మానవతిని సందర్శించి తమ పాపములన్నియు తొలంగెనని యనేకవిధంబుల స్తోత్రము గావించిరి. వివాహానంతరము స్వపురంబునకు బోవుటకు ధీమతి ప్రయాణంబై, చారుమతినిఁ జేరఁబిలిచి యాసుందరాంగికి పతివ్రతాధర్మములును, లక్ష్మీవ్రతంబుఁ జేయవలసిన విధానంబును నుపదేశించి యామెను, తదీయభర్తను దీవించి, భాగ్యవతీ వసుదేవుల యనుజ్ఞంగైకొని వీడ్కొని తన నగరంబున కరిగెను. ఆమె స్వగృహంబునకుఁ జేరుటకు లోపల, చారుమతి ధీమతికి ఫలమును ధారబోసినది మొదలుగా నా సాధ్వికింగల నలుగురు పుత్రులు మృతినొందుటయు, ఇంటగల వారా ప్రేతములను భద్రపఱచియుండి యామె రాగానే యావృత్తాంతము నెఱింగించి కళేబరంబులం జూపిరి.

ధీమతి నిశ్చలచిత్తయై పరిశుద్ధజలంబుల నాదేహములపైఁ బ్రోక్షించి యందఱ బ్రతికించి యందఱితోడనుం జేరి మహాపతివ్రత యనెడి శాశ్వత విఖ్యాతి యతిశయింపఁగా సంతోషముతో కాలము గడపుచుండెను ఇచట చారుమతీదేవియు, తనకు ధీమతిదేవి యుపదేశించిన క్రమముందప్పక శ్రీదేవిని భక్తియుక్తయై పూజింపుచు, పతిని మించిన దైవము వేఱు గలుగదనియు, సద్గుణవంతులైన యువతులకు పతియే యేడుగడయు ననియు, పతివ్రతామాహాత్మ్యమును మించిన గొప్ప మహిమ మఱియొకటి లేదనియు నెంచి సదా పతిసేవయే నిత్యకృత్యముగా నెంచి సేవింపుచు, సత్ప్రవర్తనము గలిగియు చిరకాలముననే ధీమతి యంతటి పవిత్రశక్తి గలదై లోకంబున శాశ్వత కీర్తిగడించి వర్ధిల్లుచుండెను.

చా రు మ తీ దే వి క థ

సం పూ ర్ణ ము

# 6. ఇందుమతీదేవి కథ

ఇందుమతీదేవి యొక వైశ్యకాంత! చాల బుద్ధిమంతురాల సుగుణనిధి. ఆమె తల్లిదండ్రులు మిక్కిలి యోగ్యులగుటవలన చిన్ననాట నుండియు, తమ కుమార్తెకు మంచిబుద్ధులు చెప్పి మంచి నడవడియందు మెలంగునట్లు నేర్పుచుండిరి. కావున నాకన్యకారత్నము గొప్పగుణములును సుశీలమునుగలదై యెల్లపుడును సత్క్రియాచరణమున నలవాటుపడి వర్తిల్లుచుండెను. గుణములకును, నడవడికిని దగినట్లు యా బాల మిక్కిలి రూపవతి. బంగారమునకు మెఱుగుబెట్టినలాగున సర్వశుభలక్షణంబులను నామె కమరి యుండినవి.

ఇందుమతి తల్లి పేరు శాంత. తండ్రి వర్ధనుఁడు. శాంతావర్ధనులు పరిపాటియైన స్థితిగలవారై యొక చిన్నగ్రామములో నివసించుచుండిరి. వారికి యిందుమతి దక్క మఱి సంతానము లేదు. ఒకతయే కుమార్తెయైనందున నావణిగ్దంపతులు మిక్కిలి గారాబముతో తమ నందనను పెంచుచుండిరి. అంతట నాచిన్నది యుక్తవయస్కురాలగుటయు, తమకు బాంధవ్యము కలసినవారిలో యోగ్యుండైన యొక యువకున కొసంగి యిందుమతికి పరిణయంబుఁ జేసి తమ కాదరువుగా నుండుటకై వైశ్య దంపతులు జామాతను తమ యింటనే యుండునటుల నేర్పాటుఁగావించి నిలుపుకొనిరి.

గోవిందుఁ డనెడి యావణిక్కుమారుం డత్తమామల కతివిధేయుఁడై భార్యయందు ప్రియముగలిగి వర్తించుచుండెను. ఆ యువతీయువకుల దాంపత్యము చూచువారి కెంతయు నానందకరమై యన్ని విధంబులను నుద్ది తగినదగుటచే శ్లాఘాపాత్రముగా నొప్పుచుండినది. శాంతావర్ధనులు సుగుణవంతులగు కూతుని నల్లునిగని మిక్కిలి మురియుచుండిరి. ఇట్లుండఁగా యొకనాఁడు తాముచేయుచుండిన చిన్నవ్యాపార కార్యార్థముగా గోవిందుండు కొంతదూరమునంగల పొరుగూరునకుఁ బోవలసినట్లు ప్రయాణము తటస్థించెను. పోక తప్పని పని యగుటవలన పయనంబు మాట ప్రియకాంత కెఱింగించి, యత్తమామల యనుజ్ఞగైకొని యిలు వెడలెను.

ఆ సమయమున నిందుమతిదారి సాగనంపుటకై కొంతదవ్వువచ్చి మరలి యింటికిఁ బోవునదియయి, భర్తనుజూచి "ప్రాణనాథా! నిన్ను విడిచి క్షణకాలమైనను నుండఁగల దాననుగాను, ఏమిచేయుదును!

పోయితీరవలసి వచ్చెనేర్పడినది గదా? మరల నెపుడు వచ్చెదనో తెలియదయ్యెను. ఇదిగో! ఈ పుష్పమును గైకొని భద్రముగా నుంచుకొనుము ఇదియే నేనుగా భావించుకొనుము మరలి నీవిలు జేరువరకును యీ పూవు వాడక నే నొసంగినట్లే యుండగలదు. ఒకవేళ నేదైనను నీకు విపత్తుగలిగినపు డీపూవును విసరివేయుము. నీకష్టము దొలంగుటయెగాక యది వెంటనే నాచేతిలోనికి రాగలదు. ఇట్లే చేయుచు నీకార్యమును నెఱవేర్చుకొని శీఘ్రముగా నరుగుదెంచి నామనఃక్లేశమును దొలంగింపు" మని చెప్పి "నేను పతివ్రతనే యగుదునేని, స్వప్నమందైనను, పతిపాద ధ్యానమునకెక్కడ నెన్నడు భంగముగని దాననేని, యీ కుసుమము సర్వ విధములను మదీయ ప్రాణేశ్వరునకు రక్షయై యుండునది యగునుగాక" యని భగవంతుని ధ్యానించి యొక పూవును [illegible] భర్తకొసంగి యాతనికి నమస్కరించి యింటికివచ్చెను.

గోవిందుడును తన భార్య ప్రియమున నొసంగిన పూవును భద్రముగా బెట్టుకొని, యూరువిడిచి యడవిదారిం బట్టి పోవుచుండెను. అది నిర్జనమైన యడవి తానన్ననో యొంటరివాడు, దారిలో నొక పిట్టయైనను వానికి గనుపడలేదు. ధైర్యముతో నడువదొడంగెను. ఆకీకారణ్యములో చాలదూర మరిగెను. ఇట్లు పోవుచున్న సమయమున నతనికి

క॥ వినుమధురాహారంబులు
గొనుటయు బెక్కండ్రు నిదుర గూరినతఱి మే
ల్కొనియుండుట కార్యాలో
చనముం దెరువునడుచుటయును జనదొక్కరికిన్॥

అనెడి యర్థముగల భారతశ్లోకము తలంపునకు దోచెను. 'ఇటువంటి యడవిమార్గములలో నొంటరిగా బోరాదు. నాప్రయాణమన్ననో యట్టిది గానే యేర్పడినది. ఏమి చేయవచ్చును? భగవంతుడున్నాడు. అతడు సర్వరక్షకుడుగదా!' యని తలపోయుచు నడుచుచుండెను. అతని సంశయము వ్యర్థముగాలేదు. నట్టడవిలో భయంకరాయుధహస్తులగు చోరులు హఠాత్తుగా నయ్యువకుని జుట్టుముట్టిరి. నిర్జనమైన చోట పదుగురువచ్చి చుట్టుకొనినపు డేకాకియైన వాడేమి చేయగలడు? భయభ్రాంతుడై, కర్తవ్యముదోచక నిలిచెను. దొంగలు సమీపించిరి. తనయొద్ద ధనము గలదని యెంచి వారు పట్టుకొని చంపుదురేమో యనెడు సంశయము గలిగెను. అట్టియెడ భార్య యిచ్చిన పూవు జ్ఞప్తికి వచ్చెను. అపత్కాల

మున నుపయోగించవలసినట్లు చెప్పిన పలుకులం దలంచి, దాచికొని యున్న పూవునుంగొని ముచ్చులపై విసరివైచెను. ఆహా! దానిమహిమ యెట్టిదియో కాని, దిగ్గున దొంగలందరును నేలంబడి నిమిషకాలంబులో మృతినొందిరి. అవ్విధంబును జూచి వణిక్పుత్రుండు తన యర్ధాంగి పతివ్రతా మహిమ కెంతేనియు నాశ్చర్యమొంది, యంతలో నిజహస్తగతంబైన కుసుమమును గొని నడువ నారంభించెను.

మఱియుం గొంతదవ్వుపోవ నంతట సమీపమున నుండెడి గొప్ప పుట్టలోనుండి పెనుబా మొకటి వెలువడి భయంకరముగా బుసగొట్టుచు గోవిందుని మీఁదికి వచ్చినది. దానిం జూడగానే వాని దేహము గడగడ వడంకసాగినది. అంతటి పదరులో నెట్లో సమాళించుకొని పూవును విసరివైచెను. తత్క్షణమే యాసర్పము మృతినొందినది. ఇంకనుగొంతదూరము పోయినంతట దారి వెంబడి పొదలోనుండి బెబ్బులి యొకటి హఠాత్తుగా వెలువడి గాండ్రించుచు వానిమీఁది కురికెను. అతఁ డాకుసుమంబును దానిపై విసరివైచెను. అపుడే యది క్రిందపడి విలవిలఁ దన్నుకొని ప్రాణములు విడిచెను.

ఈ ప్రకారము మూడు గండములను దప్పించుకొని నిజపత్ని శక్తినిఁ గొనియాడుచుండగా దారిలో కార్చిచ్చుపుట్టి నలువంకలును జుట్టుకొని మహా భయంకరముగ వానిమీఁదికి జ్వాల లెగయించుచు వ్యాపించుటయు దప్పించుకొను నెంవుగానక, 'తన కీసారి చావునిక్క' మని యెంచి తత్తఱిల్లుచు, తన యొద్దనుండు పుష్పమును మంటపై వైచి యెట్లగునో తెలియనెంచి దానిని మంటల విసరికొట్టెను. జడివానచే నడంగినదియుంబోలె, జ్వాలాకరాళంబైన కార్చిచ్చు చప్పున చల్లారెను. అన్ని సంకటములను గడచి యతండు సుఖముగా గమ్యస్థానమును జేరి యచ్చోటం దన పనులు జక్కబెట్టుకొని స్వగ్రామమునకు వచ్చుచుండగా నాయూరిలో నొక చిన్నయింట వసించుచుండిన మగువ యొకర్తు వాకిట నిలిచియుండి తన యింటికి చేరువనే పోవుచున్న గోవిందునిఁ జూచి చేరఁ బిలిచి ముఖము వికసింపఁగా, "అయ్యా! నీవు తన మహిమ పరులకెఱుంగరాని విధమున వర్తించుచుండెడి మహాపతివ్రతయగు నిందుమతీదేవి భర్తవుగాదా? ఆమె సౌఖ్యముగానున్నదనియే తలంచుచున్నాను. ఆసాధ్వీమణి యిచ్చిన పూవు మహిమచే మార్గమధ్యమున తటస్థించిననాల్గు గండములు తప్పిపోయినవి గదా?" యని పలికెను.

తానెన్నఁడును నెఱింగి యుండని యామె, తనభార్య నెఱిగినట్లు మాటలాడుటయు, నన్యు లెఱుంగని, యడవిలోజరిగిన విషయములనుగ్గడించుటయు, తాను పూర్వపుశక్తిచే నాపదను దప్పించుకొనుటయు చూచినట్లు చెప్పుట విని, వణిక్పుత్రుఁడు విస్మయించి "అమ్మా! నీ వెవ్వతవు?" అని యడిగెను. ఆమె నవ్వుచు "అయ్యా! నేను చాకితను. నాపేరు రోహిణి" అనియెను,

గో:— చాకితవా? పేరు రోహిణియా?

రోహి:—ఔను! చాకిజాతిదాననే, రోహిణియనియే నానామము

గో:—మంచిది. కాని మీ మెవ్వరమును నిన్నెఱుంగమే! నా భార్యపేరు తెలిసినట్లు చెప్పితివి. అదియునుగాక, దారిలో నాకు తటస్థించిన యుపద్రవములు చూచినట్లు పలికితివి. ఎట్లు తెలిసికొంటివి? యక్షిణి విద్య నీకుఁ దెలిసియున్నదా?

రోహి:- (నవ్వుచు) ఏవిద్య దెలిసిన నేమిగాని, నేను పొల్లు చెప్పలేదు గదా? ఇంక నేదియు నడుగవలదు. సుఖముగాఁ బోయి గృహంబును చేరుము. పోయిన తరువాత నీభార్యతో 'రోహిణియఁట! చాకలివారి పడుచు. నేను పోయి యుండిన చోటున నుండి వచ్చుచుండఁగా నన్నుచూచి యిటుల చెప్పినదని నా మాటలన్నియు నెఱింగించి తన క్షేమమును విచారించితి నని చెప్పుము' అని యింటిలోని కేగెను.

అచ్చెరువుతో వైశ్యకుమారుఁ డటఁ గదలి సత్వరముగా నడిచి భార్యయొద్దకు వచ్చెను. పతిరాక కెదురుచూచుచుండిన యిందుమతి యతఁడు రాగానే నమస్కరించి పాదప్రక్షాళనమునకు నీళ్ళు దెచ్చి యిచ్చి, లోనికి వచ్చినంతట సుఖాసీనుం జేసి, వినయముతో "ప్రాణేశ్వరా! నీవు పోయినపుడు గహన మధ్యంబున తటస్థించిన చో-రాహి-వ్యా-ఘ్రానలంబుల వలని బాధ నవలీలం దప్పించుకొని సుఖమున మరలి వచ్చినందుల కెంతయు సంతసించుచున్నాను. నీవరిగి యుండిన గ్రామములో రోహిణి యనుపేరుగల చాకలిజాతి భామిని నాక్షేమమును విచారించినదిగదా! నన్నుగూర్చి యామె విచారించినపుడు నీకు వింతగాఁ దోఁచియుండును" అని పలికెను.

భార్యమాటలు వినగానే యాయువకునకుఁ గలిగిన యాశ్చర్య మింతింత యనరాని దయ్యెను. క్రొత్తచోట మొగమెఱుకయైనను లేని

స్త్రీరూపకర్తృక తన భార్య నెఱింగిన దానివలె చెప్పుటయు, దన యిల్లాలాచాకిత నెఱింగియున్న దానివలె పలుకుటయు నతని కద్భుతమును రెట్టింపఁ జేసినవి. గోవిందుండు జాయను జూచి, "కాంతామణీ! రోహిణి నిన్నును, నామెను నీవును నెటుల నెఱింగియున్నారు? ఆమెయు, నామె వలెనే నీవును నరణ్యమార్గమధ్యంబునఁ దొడరిన నాయాపదల నెవ్విధంబునఁ దెలిసికొంటిరి? ఇందలి రహస్యము నెఱింగించి నాలోఁ బొడమిన యాశ్చర్య సంశయంబులను నివారింపు" మని యడిగెను.

ఇందుమతి చిఱునగ వంకురింపఁగా "హృదయేశ్వరా! జాతియందు చాకితయైనను రోహిణి పరమ పవిత్రచరిత్ర, మహాపతివ్రత. సావిత్రి యరుంధతీ యనసూయాదులైన సాధ్వీమణులకు సాటియైనది. అసాధారణ మహిమగలది. కాఁబట్టి భూతభవిష్యద్వర్తమాన కాలంబుల విషయంబులెల్లను నామెకన్నులఁగట్టినట్లు తోఁచుచుండును. తనప్రభావము చేత సర్వమును, నప్పుణ్యవతి తెలిసికొని నీతో నటుల మాటలాడినది. నన్ను దా నెఱుంగుటకును నామెమహిమయే కారణము. ఇంక నావిషయమనిననో, భవదీయ పాదసేవా ఫలాతిశయంబున నట్టిశక్తిని నేను గడించియున్నాను. నిర్మల చిత్తలగు పతివ్రతకు లోకంబులు హస్తగతంబులై యుండును. వారు లెంతదూరమున నుండినను నొకరినొకరెఱుంగని వారైయున్నను నొండొరుల వృత్తాంతమును సులభముగాఁ దెలిసికొనుచుండగలరు. భవద్రక్షణార్థముగా నే నొసంగిన పుష్పము పతివ్రతా మహాత్మ్య కల్పితంబైనదియే కాని వేఱు కాదు" అని వచించెను.

వైశ్యనందనుండు తన భార్య చెప్పిన విషయంబులు విని యామె యంతటి మహాసాధ్వి యగుట నప్పటివరకును దా నెఱుంగకుండుటకు వగచి, పరమానంద మగ్నుఁడై కులసతి నెంతయు మెచ్చియది మొదలా సుందరాంగిపై తొల్లింటికంటె నధికానురాగంబు గలిగి సుఖముగా కాలమును బుచ్చుచుండెను.

పతివ్రతలలో నుత్తమురాలైన యిందుమతీదేవి భవానిని భక్తితో పూజించుచు, తత్ప్రసాదంబున సకల సంపదలను బడసి, వృద్ధులైన తల్లిదండ్రులను, దైవసముడైన వల్లభుని భయభక్తి వినయవిధేయతలతిశయింప సేవించుచు నిరంతరము నతిథులను, నభ్యాగతులను సత్కరించుచు పేదలయందు దయయు శాంతమును నోర్మియుం గలిగి పుత్రపౌత్రాభి

వృద్ధి విలసిల్లగా నొప్పుచు, జగత్ప్రఖ్యాతిని గడించి స్తోత్రపాత్రయు ప్రాతఃస్మరణీయయునై వర్తించుచుండెను.

ఇందుమతీదేవి కథ సంపూర్ణము

# పద్మావతీదేవి కథ

త్రివిక్రమ పురంబను పట్టణంబును రాజరాజనెడి సార్వభౌముండు పరిపాలించుచుండెను. అతని పట్టమహిషి భానుమతీదేవి. ఆరాజ దంపతులకు వరుసగా పద్మనాభుఁడు పద్మమిత్రుఁడు పద్మనేత్రుఁడునను కొడుకులు ముగ్గురును పద్మినీదేవి యను కూతురును గలిగిరి. వారిలో పద్మిని యనన్య సామాన్య లావణ్య విలాసాదులయందును, సుగుణ సంపదయందును వన్నెకెక్కినదై యొప్పుచు చిన్నతనముంచే సకల విద్యలును గ్రహించి తల్లిదండ్రుల కల్లారు ముద్దుగాఁ బెరుగుచు, క్రమముగా వర్ధిల్లి పూర్ణ చంద్రునివలె శోభిల్లుచు, యౌవనవతియై యుండెను.

తల్లిదండ్రు లపుడు కుమార్తెను పెండ్లి చేయఁదలంచి, యశోకవర్ధనంబను పురాధిపుని కుమారుండును, రూపసుగుణ లక్షణాదులందు తమ కూతునకుం దగినవాడునునగు సత్యశీలుండను వానికొసంగి శుభముహూర్తమున వివాహమహోత్సవ మత్యంత వైభవముతో జరిగించి, విందులు వేడుకలును నొనరింపుచు కొన్నిదినము లల్లుని దమయొద్ద నిలుపుకొని యుండి పిమ్మట సుతాజామాతల కనేకములైన ధన కనక వస్త్రాభరణాదుల నొసంగి తమ కుమార్తెను అల్లుని వెంట నత్తవారి యింటికిఁబనిచిరి.

పద్మినీదేవి భర్తతో నరిగి శ్వశుర గృహంబుఁజేరి నంతట, యందును, నత్తమామలయందును భక్తిగలదై తనకు భర్తయే యిష్టదైవంబుగాఁ దలంచి, సంతతంబును సర్వవిధంబుల నతనికి ప్రియంబగు తెఱంగున సేవలు సలుపుచు, వాణీ, లక్ష్మీ, భవానుల సువర్ణవిగ్రహంబులను భక్తితో త్రికాలములందును బూజించుచు బ్రాహ్మణులకును, పేదవారికిని, దానధర్మము లొనరించి సంతృప్తులం జేయుచు, నిష్కళంక చిత్తయై వర్తించుచుండెను.

కొంతకాల మీవిధమున జరిగినంతట ప్రబలుండైన శత్రురాజొకండు హటాత్తుగా దండెత్తివచ్చి పట్టణంబును ముట్టడించుటయు, నతని

నోర్చుటకు తగిన బలిమి లేమింజేసి, పద్మినీదేవి యత్తమామలను భర్తయును పట్టణమువిడిచి యంతఃపురస్త్రీలను వెంటగొని గూఢమార్గమునం బోయి యొక మహారణ్యములోఁ బ్రవేశించి, యందొక రహస్య కుటీరమును గల్పించుకొని వసించుచుండిరి.

ఇవ్విధమున కొన్నాళ్లు జరిగినంతట, రాజరాజ భూపాలునకు తన వియ్యంకుని రాజ్యము బోవుటయు, నతఁడు కుటుంబసహితుఁడై యెటకో పాఱిపోవుటయు దెలిసి, వారిని గలుపుడు మనుష్యులను బనిచి వెదకించెను. కాని వారిజాడ నెవ్వరును దెలిసికొనలేకపోయిరి. సుకుమారగాత్రయగు తన ముద్దుకూతురునకు నల్లునకును సంభవించిన కష్టదశను గూర్చి మిక్కిలి చింతాక్రాంతుఁడై పరితపించుచుండెను.

అశోకవర్ధన పురాధిపతి వనంబున నున్న సమయమున నొక దినమతని పుత్రుఁడగు సత్యశీలుఁడు ఫలసంగ్రహణార్థియై యందందుం దిరుగుచు, నీరుపట్టుఁగొని, జలంబు లరయుచుం బోయిబోయి యొక కొండ దరినుండిన సరోవరంబు నొకదానిం గాంచి యందలి మధుర జలంబులం గ్రోలి యొక్కింత తడవు తత్తీరంబున గూర్చుండెను. సత్యశీలుఁడటుల పోయి, కొన్ని ఫలములును గడ్డలు సేకరించుకొనివచ్చెను. అతఁడు సుఖముగా వచ్చినందుకు తల్లిదండ్రులును భార్యయు సంతోషమును పొందిరి. అంతట భార్య తన ప్రాణేశ్వరునింజూచి "నాథా! మీరు తడవు రానందుకు దిగులొంది మిక్కిలి కుందుచుంటిని. క్రూరమృగ సంకులంబైనది గదా ఈయడవి? మనకిది కష్టకాలమగుటచే నేసమయమున నేమిసంభవించునో యను సంశయము గలిగి నేను పడుచుండిన పరితాపమునకు మేరయే లేదు ఎట్లో దేవుని దయవలన నేయుపద్రవమును లేక మీరు వచ్చితిరి. మిమ్ము చూచినంతట నామది కుదుటఁబడినది సుఁడీ! నేఁడు మీరాకకింత యాలస్య మగుటకు కారణమేమి?" యని యడిగెను.

సత్య:—కారణము లేకుండిన నుండుదునా?

పద్మి:—ఆ కారణమునే యడుగుచున్నాను.

సత్య:—నేఁడు కొంత దూరములో నుండెడి కొండసమీపమునకు బోయినాఁడను, అందు మంచి పండ్లుండునని నా తలంపు.

పద్మి:—మీరు తెచ్చిన పండ్లు అచ్చట దొరికినవేనా?

సత్య:—కాదు కాదు, ఇవి యడవిలో నచటచట సేకరించితిని.

పద్మి:—ఐన, మీ రంతదూరము బోయినది వ్యర్థమేగదా యైన,

సత్యః—వ్యర్థముగాలేదు. ఒకవిధమైన లాభమునే పొందితిని.

పద్మి:—ఆ లాభ మేదియో చెప్పవలయును.

భార్య యిటుల నడుగగానే యతండు నవ్వుచు తన రొండిలో గుప్తముగా దాచుకొ యుం రొుక విధమైన చిన్న కటి సతిచేతం బెట్టి ఇదియే నేను పొందిన లాభము'' అనెను.

ఈ చిరుపండుకా? అంతదూరము పోయినది, నన్ను పరి జేయుటకె గాఁ లు ని పన్నుగడ?

సత్య: యు కుల సా.

పద్మి:-మీరెట్లు ను హాస కలుగ నాబుద్ధికిఁ దోచి

భార్యమాటకు నవ్వుచు రాజపుత్రుఁ ప్రియదృష్టులతో

జూన్-2 66.

బును, సంల జాగ్రత్తిగా దాచుకొనియుండి నీకొసంగిన దాని కారణమును వినుము. నేఁడు నేను వాడుక గా బోవు దారిఁగాక మఱియొక ప్రక్కఁ బోయితిని, యొకచోట కొండలోయలో వృక్షములు దట్టముగాఁ బెరిగి యుండుటం గాంచితిని. అచ్చట మంచిఫలము లుండవచ్చునని తలంచిన వాఁడనై, దుష్టమృగములుండునేమో యని సయితము సంశయింపక యందుఁ జొచ్చితిని. అట్టివేవియును గనుపట్ట లేదు గాని, యొక చెట్టు మొదట మహాత్ముఁడొకడు గూర్చుండి యేమో ధ్యానించుకొనుచుండెను. అతనిం జూచి నేను వెఱపులేక సమీపించి భక్తితో మ్రొక్కి చేతులు గట్టుకొని ముందు నిలిచితిని. ఆ మహానుభావుఁడు కొంతతడవువరకును నాతో నేదియుం బలుకక యట్లేనన్ను జూచుచుండి, పిమ్మట పూర్వమె రింగియున్నవానివలె ప్రియముతో 'రాజకుమారా! పాపము! రాజ్యమును గోలుపడి తల్లిదండ్రులతోడను, పరమ సాధ్వియైన భార్యతోడను వచ్చి దుర్గమారణ్యములోఁజేరి కాయగసురులు దినుచు కాలము గడుపుచుం డెడి నిన్ను జూడగా నాలో నెంతయు జాలిబొడముచున్నది. అయినను, నీకు మంచికాలము రాగలదు. వెఱవకుము, బుద్ధిమంతుడైన మనుజుఁ డాపత్సంపదలకు చింతాసంతోషములను బొందడు. నీవును ధైర్యముతో నుండుము. ఇదిగో! ఈపండును గొనిపోయి నీ భార్య కొసంగుము. నీకా మెయం దొక సుపుత్రుఁ డుదయించును. కొడుకు గలిగినంతట కొలఁది దినములలో రాజ్యప్రాప్తియు సర్వసౌఖ్యములును నీకు కలుగును' అని పలికి తనదగ్గఱఁ బెట్టుకొనియున్న యీపండు నిచ్చెను. నాస్థితినంతయుఁ

దెలిసి యాలాగు చెప్పుట నెంచి యాశ్చర్యంబునొంది, యతండు సామాన్యుడగు మనుజమాత్రుండుగా నుండఁడని యెంచి పండుఁగైకొని మరల మ్రొక్కితిని. అతఁడనుజ్ఞ నొసంగుటయు, వీడ్కొని వచ్చుచు మరలి జూడఁగా కోనయు నతండును మఱి నాకండ్ల గోచరింపలేదు. అద్భుతముగాఁ దోచినది. అది సామాన్యముగా నుండు ఫలము గాదని యెంచి నీకొసంగితిఁ జుమీ!' యని చెప్పెను.

పద్మి:—ఇట్టి దశలో మనకు బిడ్డలు గలుగవలయునా? అనెను. "బిడ్డలు యెట్టిదశలో గలిగినను వలదని యెవరు చెప్ప నెంతురు?" అని పలికి పండును దినుటకు పురికొలుపుటయు, నామె దానినిగొని భక్తితో భుజించెను. తత్ప్రభావమున సకలైశ్వర్యములును తొలఁగి వెతలొందుచున్న సమయమున పద్మాహారణ్యములో పద్మినిగర్భవతియయ్యెను. ఎట్లో వారు కాలము గడుపుచుండిరి. ఆమెకు నెలలు నిండి యొకశుభలగ్నమున పూర్ణచంద్రునివంటి కుమారుని గాంచెను. వానిముఖము చంద్రబింబము వలె నుండుటవలన శిశువునకు చంద్రహాసుఁడని తల్లిదండ్రులు పేరుబెట్టిరి. ఆ యడవిలో నట్టి రహస్య ప్రదేశంబులో, జాతకర్మాదిక్రియలు నెరవేర్చుటకు దగినవార లెవ్వరుగలరు? వారే యాకార్యములు నెరవేర్చిబిడ్డను గారాబముతో బెంచుచుండిరి. దినదినప్రవర్ధమానుండై చంద్రహాసుండు తల్లిదండ్రుల కల్లారుముద్దుగాఁ బెరుగుచుండెను.

అపుడు పద్మినీదేవి యత్తమామలు విరక్తచిత్తులై కోరికలువిడిచి కొడుకును, కోడలిని, మనుమని దీవించి వారిని వీడ్కొని యడవిలో చాల దూరముపోయి యొక పుణ్యనదీతీరమున నాశ్రమము నేర్పరచుకొని తపము జేసికొనుట కారంభించిరి. పద్మినియు నామె పతియు నచ్చటనే యుండి, తమకు సకలైశ్వర్యములు కుమారరత్నంబైన చంద్రహాసుఁడే యని యెంచి సంతుష్టులై కాలము గడుపుచుండిరి. ఇట్లు కొంతకాలము జరిగినది. ఇపుడు చంద్రహాసునకైదేండ్లు నిండినవి.

ఒకనాడు వాడుకప్రకారము సత్యశీలుడు భార్యను ముద్దుకుమారుని యునికిపట్టున నిలిపి కందమూల ఫలాదులను సంగ్రహించుకొనివచ్చుటకై ఖడ్గంబు కేలంబూని యడవిలో నొకవంకను బోయెను. అట్టి సమయంబున ధర్మదేవత పద్మినీదేవియొక్క పతిభక్తిని పరిశీలింప దలంచి కాయగసరులకై దిరుగుచున్న సత్యశీలుని సమీపించి క్రూరసర్పాకృతిం దాల్చి బుసకొట్టుచుఁ బోయి యతని పాదంబును గఱచి యొక పొదలో

దూరి మాయమయ్యెను. దారుణంబైన యాసర్ప విషము కడు త్వరిత ముగా శరీరమున వ్యాపించుటచే నతండు నిలువలేక స్మృతిదప్పి క్రింద బడి యసువులు విడిచెను.

ఎప్పటివేళకు నాథుండు రాకుండుటచే పద్మిని దిగులొంది నలుగ లంకులు జూచుచు దుఃఖాక్రాంతయై తత్తరపడ దొడంగెను. దూరముగా బోయి యుండి మరల వచ్చుటలో తడవయ్యెనేమోయని కొంతతడవు పతిరాకకై నిరీక్షించెను. కాని లాభము లేకపోయినది. ఆమెకు పొంగి పొరలి వచ్చుచున్న శోకము నాపుకొనలేక పోయెను. తన ప్రాణేశునకే యుపద్రవమును లేక సుఖముగా రావలయునని ఎందఱు వేల్పులనో ప్రార్థించెను. ప్రయోజనము లేకుండెను. ఆయబల యేమిచేయును? జాముర్రాత్రి యైనది. ఉసికిపట్టున నిలుచుట కామెకు సుంతయైనను నిష్టముగా నుండ లేదు. గుండెనిబ్బరము చేసుకొని బిడ్డను చంకనిడుకొని పతిని వెదకుటకై యరణ్యముఁబోఁబోవ దొడంగె. వెన్నెలకాలమైనందున చెట్లయాకుల సందులనుండి పొడవెలుగు కొంచెముకొంచెము నేలపైఁబడుచుండుటఁబట్టి యా వెలుతురు సహాయమున చెట్టు పుట్టలు ముండ్లు పొదలుం దప్పించు కొనుచు 'ప్రాణేశ్వరా! నామనోహరా! ప్రియవల్లభా!' యనియెలుగెత్తి పిలుచుచుం బోవదొడంగెను. స్థలనిర్దేశము లేకయు, దిక్కు తెలియకయు నాలాఁగున దిరుగుచున్న యాకోమలాంగికి నలువంకలను దాపున పులులు, సింహములు మొదలైన దుష్టమృగములు కూయుట వినవచ్చుచున్న యామెకు గలుగుచున్న భయమునకు మేర లేకుండినది.

ఈక్రమంబునఁ బోవుచున్న తఱి, ధర్మదేవతయే కొనివచ్చి యా చిగురుబోణిముందు బెట్టెనో యనునట్లు భర్తమృతకళేబరంబామె కంట నొకచోటఁ బడి యుండుట గాన్పించెను. చూడఁగానే యామె గుండెలు బ్రద్దలయ్యెను. బిడ్డనుదించి "హా! హృదయేశ్వరా!" యని యామె మూర్ఛిల్లి క్రిందబడినది. ఎట్లోకొంతవడికి తెలివినొంది భర్తదేహముపై బడి పలవించుచు, మృగంబులెవ్వియు నచ్చోటికిఁ జేరకుండుటయు, శరీరంబున గాయమైనను లేకుండుటయుం జూచి, దుష్టసర్పం బేదియో కఱచుటవలన మృతుండై యుండవలయునని యూహించి, రాజ్యసంపదలు బోఁగొట్టుకొని యడవులపాలై యల్లాడుచుండినను, తమయెడలఁ గనికరము లేక తమ కట్టి కీడుపరచిన దైవంబుదలచి "ఓ దీనదయాపరా! పరమేశ్వరా! నీపట్ల నేనేమి యపరాధ మొనర్చితిని? పుత్రవతినైన నన్ను

నింతటి యాపదలను బొందించుట కరుణామయుండగు నీకు న్యాయము గాఁ దోఁచెనా?" యని పలుకుచు "మనోవల్లభా! ఎవతెను నీవు ప్రాణతుల్యముగ దలంచుచుంటివో, యట్టి ప్రియపత్ని వాపోవుచుండ కన్నులు విచ్చి చూడవేల? ఏల పలుకకుండెదవు! వీఁడె ముద్దుకుమారుఁడు చెంత జేరి పిలుచుచున్నవాడు. ప్రీతితో నెత్తుకొని ముద్దాడుము ప్రియనాథా నీవు లేకుండినచో, నింక నాకు లోకమెక్కడిది? నీమార్గమున ననుసరించుట దక్క వేఱేమిగలదు' నోరెఱుంగని యాపసిపాప గతియేమి కావలయును? ఏమిచేయుదును? హా! నాథా! నాథా! మాకేమి గతియున్నది" అని అతని గుణవిశేషములను, తనకుగల భక్తియు, నుతువుచు, క్రుంగి వాపోవం దొడంగెను. ఎంత యేడ్చినను, దట్టమైన యా నట్టడవిలో, యామె రోదన మరణ్యరోదన మనెడు వాక్యమును సార్థకము గావించెను. లోక మస్తమించినట్లును, భూమి క్రుంగిపోయినట్లును తోఁచుచుండగా పరితాపమొంది యా యిందువదన యవ్విధంబున నల్లాడుచున్న సమయమున నాకాశమందుండి కొన్ని యశరీర వాక్కులు క్రింద వివరించిన విధమున నామెకు వినవచ్చెను.

"ఓ రాజపుత్రీ! నీపతి సర్పదష్టుడై మృతినొందెను. నీకు పతిపై ప్రీతియు భక్తియుం గలుగుటయే నిజమగునేని భర్తను బ్రతికించుకొనవలయునెడి కోరిక గలిగి యెట్లైన జీవింపఁ జేయదలంచెదవేని, నీ చెంత నుండెడి వంశవర్ధనుండైన నీకుమారునికత్తుక ద్రెంచితి వేని నీభర్తపునర్జీవితుండగును. అటుల ప్రాణమునకు బదులు ప్రాణము నొసంగిననే కాని మఱి యేవిధముననను, నీకు లాభము గలుగదు. ఇచ్చగలదేని కొడుకుం జంపి పతిని బ్రతికించుకొనుము. అలాగునం జేయు నొల్లవేని మిన్నక నీయిచ్చం బొమ్ము"— ఇవియే యామాటలు. పద్మినికి భయాశ్చర్యకరములై యుండెను.

ఆ యశరీరవాక్కులను విన్నంతట యామెకు పలుయోచన లంకురించినవి. 'ప్రాణతుల్యుడును, దైవసముడునగు భర్తను బ్రతికించుకొనుట ముఖ్యము. అపుడు చేతులార కన్నకొడుకును జంపుకొనవలయును. ఒకవేళ తెగించి, పతికంటె కుమారుండధికుడు గాఁజాలడని వధించినచో నంతర్వాణి వాక్కులెట్టివియో! నావిభుండు జీవింపడేని కొడుకును సయితము గోలుపోయి, దిక్కులేని రెక్కలు విఱిగిన పక్షినై యల్లాడవలసిన దాన నగుదునుగదా? ఏమి చేయుదును? ఈ యశరీర వాక్కులనునమ్ముట

గాని, నమ్మక మానుటగాని యెట్లు?' అని పెక్కురీతుల నాలోచింపఁ దొడంగెను. కళవరమును పొందసాగెను. కడపట సర్వవిధములను, పతివ్రతయైన యతివకు తన నాథునికంటె యెక్కువయైన దేదియును లేదనియును తొమ్మిది నెలలు మోసి కని పెంచినవాఁడును, సకల శుభలక్షణములను గలిగి యుల్లారు ముద్దుగా వర్తించుచున్న వాఁడును నగు నోరెరుంగని బాలకునిం జంపియైనను ప్రాణవల్లభుని బ్రతికించుకొనుటయే యుత్తమ పథంబని యామెకు దోఁచినది. అలాగున జేయుటకే యామె నిశ్చయించెను.

అంతట నాసాధ్వీమణి మనంబున ధైర్యంబుఁ బాదుకొలిపి సర్వమును భగవత్సంకల్ప ప్రకారము జరుగగలదని నిశ్చయించి పతిపదంబును మనంబున నిలిపి, సర్వరక్షకుడగు నిందిరా సుందరీ వల్లభుండగు కంజలోచనుని ధ్యానించి, "ఈకార్యంబువలన శిశుహత్యా దోషంబు నన్ను నంటకుండునుగాక" యని పలికి. యట గ్రిందఁబడవైచి యున్నడగు తన నాథుని వాలుంగొని, కుసుమకోమల గాత్రుండైన కుమారుని కంఠంబుఁ దెగవేసెను. కాని తెగినదికాదు. 'ఏల? గుఱితప్పినదా?'—అని యెంచి, యామె రెండవసారి కృపాణంబును మీదికెత్తి 'నిజముగా నేను పతిభక్తిగలసచ్ఛీలనగుదునేని, యీ బాలుని కంఠంబు దునియును గాక! నావిభుండు పునర్జీవితుఁ డగునుగాక' అని వ్రేయ నుంకించెను.

అప్పుడు బిగ్గరగా "ఆగుమాగుము! వేగిర పడబోకుము" అనెడి పలుకు లామెకు వినవచ్చెను. 'ఇది ఘోరారణ్యము, రాత్రికాలము, నిర్మానుష్యస్థలము. ఇట్టిచోట యీకాలమున నవ్విధమున బలుకుచున్న వారెవ్వరు?'—అని యామె కెలంకులు బరికించుచుండు నంతలో, దివ్యస్వరూపుడైన మహాపురుషుఁ డొక్క డామె ముందు సాక్షాత్కరించెను. తేజస్స్వరూపుడైన యాదివ్యాకారునిం జూచి యక్కోమలాంగి తటాలున కేలం గీలించియున్న వాలును నేలఁబడవైచి, యమ్మహానీయునకు ప్రదక్షిణ నమస్కారము లాచరించి కరంబులు మోడ్చి పలుకుటకు నోరురాక యట్టె నిలిచియున్న యామె కాపురుషుం డిట్లనియె.

"పుణ్యావతీ! సాహసింపకుము. కన్నబిడ్డను చేతులారఁ జంపుటకు నీవలె నెవ్వరైనను సాహసింపుదురా?" అని నవ్వుచుం బలికిన నామగువ "దేవా! ఇట్లు ప్రత్యక్షంబై నేను చేయబూనిన కార్యమును వారించిన

పుణ్యస్వరూపుఁడవైన నీ వెవ్వండవో తెలిసికొనజాలకున్నాను. నాయపరాధములను క్షమింపుము. మృతుండైన నాపతి పునర్జీవితుఁడగుట కిటువంటి పనిఁ జేయవలయునని యశరీరయాదేశించుటం జేసి అతివకు పతియే యాధారమగుటవలన బిడ్డను జంపి యైనను వల్లభుని బ్రతికించుకొనుట మేలుగా నెంచి యీక్రూరకృత్యంబునకు గడంగితిని. గాని క్రూరస్వభావంబుచే నిట్లు చేయఁబూనిన దానను గాను" అని విన్నవించెను. ఆమె పతిభక్తినిఁ దెలిసికొన దలంచిన ధర్మదేవత యామాటలు విని సంతసించి యీలాగున చెప్పెను.

"ఓ సాధ్వీమతల్లీ! నేను ధర్మదేవతను లోకస్తుత పవిత్ర చరిత్రవగు నీశీలమును, పతిభక్తినిఁ బరీక్షింపగోరి సర్పరూపమును దాల్చి నీ భర్తను కఱచితిని. అతండు మృతినొందినవానివలె గాఢ మూర్ఛనొందియున్నవాఁడుగాని మరణింపలేదు. పతి మృతుడయ్యెనని నీవు వాపోవుచుండగా నీకు వినబడిన వాక్కులను నేనే చెప్పి, పతికొరకై సజీవుండైయున్న కన్నకుమారునిఁ జంపుటకు సాహసింతువా? లేక పుత్రవాత్సల్యమును విడువలేక యాకార్యముఁ జేయనొల్లక, 'కాలము దీఱి మరణించిన వానికై, ఏవో వినబడిన పలుకులు నిజములని నమ్మి పుత్రుని బ్రతికియున్నవానిని, సకల శుభలక్షణములుం గలిగి శోభిల్లుచున్న వానిని చేతులార తల్లినగు నేను వధించి యామహాపాతకము నొడిగట్టుకొనుటెట్లు?" అని తలంచి, అశరీరి చెప్పినట్లు చేయుటనొల్లక మానుదువా? యనెడి విషయము నెఱుంగుటకొఱకే యిటువంటి పన్నుగడ బన్నితిని. నీ వన్ననో మహాపతివ్రతవు. భర్తకు మించిన దేవియును గలుగదనెడి నిశ్చయముతో మనోవాక్కాయ కర్మలయందెల్లపుడును వేఱుబుద్ధి లేక పతిని సేవించుచుండెడి దానవగుటచే, 'కడుపునఁ బుట్టిన బిడ్డఁడుగదా?' యని సంశయింపక 'ఈ కుమారుండు మరణించినను మరణించుగాక, నావల్లభునికంటె కుమారుం డధికుఁడు గానేరఁడని యెంచి నందనుని ఖండించితివి. అమ్మా! నీ ధైర్యమునకును, తెగువకును, భర్తపైఁ గల భక్తికిని, మనశ్శుద్ధికిని నేను మిక్కిలి సంతసించితిని. నీకేమి వరము కావలయునో యది యెఱిగింపుము" అని పలికెను.

ఆ మహాపురుషుండు తాను ధర్మదేవతనని చెప్పగానే పద్మినీదేవి యత్యంత భయభక్తులు కలదై నమస్కరించి "స్వామీ! మీపాద

సేవకురాలవగు నాయందు కనికరించి వరంబు నొసంగుదు వేని, నా ప్రాణేశ్వరుండు మరణ తుల్యంబైన మూర్ఛనుండి తేఱి నిర్బాధగా లేచునట్లు వరంబుఁ బ్రసాదింపు" మని యడిగెను. ఆమె యట్టితఱి నైనను తాను వరమొసంగుట సంసిద్ధుండై యున్నప్పుడైనను, తన భర్తతోడ కుమారుని సయితము జీవింపఁజేయులాగున గోరిక, భర్తను మాత్రమే బ్రతికింపు మనుటను విని యాశ్చర్యమొంది యామె స్థిర చిత్తంబు కెంతయు మెచ్చి "రాజపుత్రీ! నీవంటి పుణ్యవతి లోకంబున మఱియొకర్తుక యుండదని తెలిసికొంటిని, వినుము! నీ నాథుండశ్రముఁడై లేచునట్లును, నీకుమారుఁడు జీవవంతుఁడగునట్లును, పోయిన మీ రాజ్య సంపదలు మరల మీకు లభించునట్లును మూఁడువరములు ప్రసాదించితిని. ఇచ్చోట నుండి మీకుటీరమున కరిగి యట నేఁటిరాత్రి గడిపి, యరుణోదయంబున ప్రయాణంబై విడిచి వచ్చిన మీపట్టణము చెంత కరుఁగుడు. పిమ్మట మీకు సకల సుఖములును సంఘటిల్లగలవు" అని యాదేశించి ధర్మదేవత మాయమయ్యెను.

అంతలో నామె వల్లభుండును కుమారుండును నేశ్రమయును లేక జీవముల బొందిరి. అపుడు సత్యశీలుడు తనభార్య కుమారసహితయై రాత్రికాలమున నంతదూరమునకువచ్చి యుండుటంగాంచి యాశ్చర్యమొంది తనకు సంభవించిన యాపద నామె కెఱిఁగించి "నాస్థితి నీ కెట్లు తెలిసినది? ఏలాగున నన్నుఁ గనుఁగొంటివి?" యని యడిగెను. ఆమె జరిగినదంతయును, తు-చ-తప్పక మగనితో చెప్పెను. సత్యశీలుడు ధర్మదేవతం దలంచి మ్రొక్కి భార్యాపుత్రుల దోడ్కొని తాము వసించుచుండిన పర్ణకుటీరమున కరిగెను.

మఱునాఁడు ప్రొద్దు పొడుపున పద్మినీ చంద్రహాసులను వెంటఁ బెట్టుకొని ధర్మదేవత యాజ్ఞప్రకారముగా స్వపుర సామీప్యమునకుఁ బోయెను. అపుడు తమ రాజ్యము నపహరించిన రాజు మరణించి మఱి తగిన పాలకుఁడు లేకున్నందున. పౌరులును ప్రధానులుం గూడి యాలోచించి యేనుఁగుచేఁ బూలమాలిక నొసంగి యది యాదండ నెవని మెడలో వేయునో వానిని రాజుఁ గావించుటకై నిశ్చయించి యక్కే దానిని విడిచిరి.

ఆ యేనుంగు పురంబును దాఁటివచ్చి యాసమీపమున నుండిన సత్యశీలుని మెడలో దండను వైచెను.

అతఁడు తమ రాజనందనుఁడే యగుటంగాంచి, యచ్చటి కతని నా సమయమునకు వచ్చునట్లు చేసిన దేవినిం బదఱును గొనియాడిరి. మహాపతివ్రతయగు పద్మినీదేవి, సమస్త సుఖములు ననుభవించుచు, పతివ్రతా రత్నంబనెడి ఖ్యాతిని బొందినదయ్యెను.

పద్మావతీదేవి కథ సంపూర్ణము

# 8. ప్రియంవదక

మధురా నగరంబున బలభద్రుండను సాలెవాఁ డొకఁ డుండెను. అతడు మిక్కిలి సజ్జనుండు. కాని పేదవాఁడు. కులవృత్తియైన నేతపనియే యతనికి జీవనము, పిత్రార్జితమగు చిన్న యిల్లుమాత్ర మొకటి కలదు. అతనిభార్య కాంచనవల్లియను పేరుగలది. స్త్రీలలో కడునుత్తమురాలని యెన్నఁదగిన సుగుణవతి. బలభద్రుండు తనభార్య పనులందు తోడ్పడు చుండగా సాయంకాలము వరకు నేతసాగించి, దానివలన రాఁబడిన కూలింగొని సూర్యాస్తమయ సమయంబున నంగడికిఁబోయి ఉప్పుపప్పు బియ్యము మొదలైన భోజనసామగ్రులం దెచ్చియిచ్చును. కాంచనవల్లి యంతలో యింటిలోని పనులను చక్కబెట్టుకొని సిద్ధముగానుండి భర్త రాగానే తెచ్చిన వస్తువులంగొని వంటచేయును. అంతటి పేదవారై యున్నను, వార లిరువురును తమకుఁ గలిగినంతలో నతిథులుగాని, యభ్యాగతులుగాని, తటస్థించినచో కొంత వారికిఁబెట్టి శేషమును రెండు భాగములుచేసి, మఱునాఁటికని యొకపాలు పెట్టుకొని మిగిలిన యన్నమును భార్యాభర్తలు భుజించి, భగవంతుని ధ్యానింపుచు, నేవైన సత్కథలును సద్విషయములును నొకరితో నొకరు వివరించుకొనుచు నిర్విచారులై శయనించి మఱునటి దినము వెచ్చమునకు దారిచూపు వాఁడు పరమేశ్వరుండు గలండని నమ్మి నిదురించుచుదురు. ఇట్లేవారు కాలమును గడపుచుండిరి. కొన్నినాళ్ళకు వారి కొక కూతురు గలిగినది. ఆమెకు తల్లిదండ్రులు ప్రియంవదయను పేరుఁబెట్టి తమ పేదరికమునకు దగినరీతిగా నెక్కుడు ప్రియముతోఁ బెంచుచుండిరి.

ప్రియంవద దినదినాభివృద్ధినిఁ బొందుచుండఁగా, యాబాలిక

గుణములును, లక్షణములును చక్కని యాకృతియుం జూచి యిరుగు పొరుగు వారు సయిత మత్యంత ప్రియముగలవారై మిక్కిలి కొని యాడుచు, నామె పలుకు ముద్దు మాటలు విని, ప్రియంవద యను పేరు తగినట్లే కుదిరినదని సంతసించుచుండిరి. క్రమముగ ఆమెకు పదు నాఱు సంవత్సరములు నిండినవి. యౌవనవతియైయున్న యామెగుణం జూచి తల్లిదండ్రులు వివాహముఁ జేయనెంచి వరాన్వేషణముఁ జేయ నారంభించిరి.

ఈప్రకారము విచారించి కర్దముఁ డనెడి పేరుగల బంధువులలోని వాడైన యొకని కుమారుని కొసంగి పెండ్లిఁజేసి యామెను భర్తవెంట నత్తమామల యొద్దకుఁ బంపిరి. ప్రియుంవద యత్తవారి యింటి కరిగినది మొదలుగా పతియందును, శ్వశురులయందును భక్తిగలదై,సహనమును నడకువయు, ప్రియమును, శ్రద్ధయుంగలిగి, శేయింబవళ్లు వారి కుపచరిం చుట యందే కాలమును గడపుచుండెను. ఆమెభక్తి శ్రద్ధలంగాంచి కర్దముఁ డెంతయును సంతుష్టినొంది, భార్యమీద నధికానురాగముగల వాడై, పరిపాటియైన కలిమిగల తమ సంసారమందామెకు యేకష్టమును గలుగనీయక మెలగుచుండెను. ఈవిధమున గొలదిదినములు గడచినవి.

కర్దముఁడు నివసించు గ్రామములో నొక బ్రాహ్మణుఁడు ప్రతి దినమును, సటఁగల చిన్నగుడి ముందట గూర్చుండి పురాణముఁ జెప్పు చుండును. వినుటకై పెక్కండ్రు స్త్రీపురుషు లచ్చోటికిఁజేరి యతండు చెప్పెడి విషయములను శ్రద్ధతో విని పోవుచుందురు. ఈవిషయము ప్రియుంవదకు తెలిసినది మొదలుగా, సాధారణముగా సద్గుణములు గల దగు నయ్యతివ తానుంబోయి యా మంచి విషయములను వినవలయు ననెడి కోరికగలదై తనకు పురాణశ్రవణమున కనుజ్ఞ నిమ్మని భర్తను ప్రార్థించెను.

భార్యయం దధిక ప్రీతిగలవాఁడైన కర్దముఁడు సంతసించి నిరా టంకముగాఁ బోయి విని రావచ్చునని యనుమతించి చెప్పెను. అది మొదలు ప్రియుంవద యింటిపనులు దీర్చుకొని యత్తమామలకు వలయు నుపచారములు గావించి యందఱునుం జేరువేళకు తానునుంబోయి విప్రుండు చెప్పిన పురాణ గాథల నతిశ్రద్ధతోడను భక్తితోడను విని వచ్చుచుండఁ దొడంగెను. పౌరాణికుఁ డొక్కొక్క నాఁడును చంద్ర మతి, సావిత్రి, దమయంతి, సుకన్య, యనసూయ, యరుంధతి మొదలైన

రొక్కొక్క పతివ్రతల చరిత్రములును, వారి మహిమయు, ప్రపంచమున వారు బొందిన గౌరవమును, కీర్తియును, పతివ్రతా ధర్మములును వివరించుచున్న విని, యామె తానును వారివంటి మహిమయును ప్రఖ్యాతియును, సద్గతియును నొందవలయునను తలపు మిక్కుట మాగుటయు, దృఢముగా భామినులకు దైవము భర్తయేయనియు, వారిని సేవించు పడంతికి పొందరాని పదవి గలుగదనియు నిశ్చయించి, మొదటి నుండియును తాను సుస్వభావము గలదైనను పురాణము వినుటచేత మనంబున మఱియును భక్తి శ్రద్ధ లధికమయ్యెను. పనిచేయుచుండినను, నడుచుచుండినను, మాటలాడుచున్నను, నామెకు భర్తృపాదారవింద ధ్యానము దక్క మఱియొక తలంపు లేనేలేదు. అతని సేవయే ముఖ్యమైనది.

ఈవిధముగా పుణ్య గుణనిధియగు ప్రియంవద పూజయు, పతిసేవయు నేమరక చేయుచు, సత్ప్రవర్తనగలిగి వర్తించుటను చూచి యెల్లరును నాశ్చర్యమునొంది కొనియాడుచుండిరి.

మఱి కొన్నిదినముల కామె యత్తమామలును మరణించిరి. వారి యుత్తరక్రియలు క్రమముగా జరిగించి యైనంతట ప్రియంవదాకర్దములు సంసార విషయములను శ్రద్ధతో చూచుకొనవలసివచ్చెను. అతఁడు వ్యాపారార్థముగా, తాను పెట్టుబడిపెట్టి చేయించిన వస్తువులు, అనగా వస్త్రములను గొని విక్రయించుటకై పొరుగ గ్రామముల కరుగుటయు; నొకటి రెండు దినములును, నొక్కొకపుడు నాలుగైదు నాళ్ళనుగూడ యింటికి రాకుండుటయు గలదు. అపుడు ప్రియంవద మాత్రమే యింట నుండును. ఆమె తన నాథుండే యుపద్రవమును బొందక సుఖముగా యిల్లుచేరవలయునని యతఁడు పోయినది మొదలు మరలి గృహమును జేరువరకును తాను సంతతమును బూజించుచుండెడి గౌరీ దేవిని ప్రార్థించుచుండును. ఇట్లు కొన్నినాళ్ళు జరిగినవి.

ఒకపర్యాయము కర్దముడు వస్త్రముల నమ్ముటకై పోయినపుడు, తన గుడ్డలు ఖర్చుపడనందున గ్రామాంతరములు దిరుగుచుండుటచే నాలుగైదు దినములు యింటికి వచ్చుటకువలను గాదయ్యెను. అట్టి సమయమున కొందఱు దొంగలర్ధరాత్రి కాలమున కన్నము వేసి, యింటిలో ప్రవేశించి, యున్నంతవరకును వస్తువుల నపహరించి మూటలుగట్టుకొనిపోవుచువారు, యేకాకిగా నరుండి దొంగలరాక నెఱుంగక నిద్రించుచుండెడి

ప్రియంవదను చూచి యొంటరిగా నుండుటయు, నామె కడుచక్కని దగుటయు నాలోచించి యామెపై మోహముఁగొని భంగపరచుటకు యత్నించిరి. మహాపతివ్రత యని యెంచక ఆ దొంగలకు నాయకుడైన వాడు మహత్తర కామపీడితుడై యా సుందరాంగి శయ్యను సమీపించెను అపుడు దైవికముగా నామెకు మెలకువ గలిగి లేచి యింటి లోని సందడివలన దొంగలు చొచ్చుటం దెలిసికొని, యేకాకియు నబలయునైన తానేమియుం జేయుటకు శక్తిలేకయు, నిరుగు పొరుగు వారిని బిలుచుటకు నవకాశము లేక దొంగ యొకఁడు పట్టుకొని వచ్చు చుండుటయు, భయాతిశయమున నఱచుటకు నయితము శక్తిలేక డగ్గుత్తిక పడుటయు, నామె కెన్నెన్నియో యాలోచనలు పుట్టెను.

ఆలోచించుటచే నేమి ఫలము? దొంగ దగ్గఱకు వచ్చెను. "ఓసుందరీ! నీపై మోహముఁ గొనిన నాకోర్కె దీర్పుము. ఒల్లననినను నిన్ను విడుచుట లేదు. సందడిఁ జేసితివేని నీకుత్తుకఁ ద్రెంచెదను. ఇంత యేల నాయాశఁ దీర్చితివా నిన్ను ప్రాణములతో విడిచిపోయెదను, ఆలోచింపుము. ఇపుడిచ్చోట నీకు దిక్కెవ్వరును లేరనుటఁ దలంపుము" అని బెదరించి మూర్ఖత్వమున బట్టుకొన వచ్చెను.

పాపము! ఆమె యేమిచేయును? ఎట్లు తప్పించుకొనును? మతిలేని భయమునొంది యొడలు వడంకఁ దొడఁగెను. దైవసహాయము దక్క వేఱు విధమైన యాధారము లేకుండెను. అటువంటి విపత్సమయంబున ప్రియంవద సదా పూజించి ధ్యానించుచుండు కాత్యాయనీదేవిని దలంచి "పరమేశ్వరీ! కరుణాస్వరూపిణీ! దుష్టసంహారిణీ! యాశ్రితజన సంరక్షిణీ! ఇపుడు నీవుదక్క దిక్కు వేఱులేదు. నిరాధారనగు నాయందు కనికరించి యీ దుర్మార్గుని బారిం బడకుండునట్లుచేసి నన్ను రక్షింపుము రక్షింపు" మని యార్తయై ప్రార్థించెను. ఇంతలో చోరుఁడు మిక్కిలి దగ్గఱ పట్టుకొనుటకు చేతులు చాచెను. తిరస్కరించినను వాడు మరల కుండుటయు మానభంగ మేర్పడుట నిక్కమని తలంచి, యత్యంత కోపమును బొంది యుగ్రదృష్టులంగాంచి 'ఓరీ! నీచాత్మా! నన్నంట రాకుము. దూరముగఁ దొలంగిపొమ్ము 'నిశీథకాలముగదా? ఇచ్చట సహాయులీ యువతి కెవ్వరును లేరు గదా! యిచ్చవచ్చినట్లు వర్తించ వచ్చును' అని తలంచితివి కాబోలు? ఇసీ! నాచెంత రాకుము. ఓరీ! నేను పరిశుద్ధ చిత్తనగు పతివ్రత నగుదునేని, నిశ్చలభక్తితో జగదంబయగు

భవానీ దేవిని పూజింపుచు నమ్మియుండెడిదాన నగుదునేని-నాపై పరమేశ్వరికృప నిక్కముగాఁ గలిగియుండునేని, పాపశీలుండవైన నీవును, నీకు సహాయులై యున్న యీ నీసహచరులును నీక్షణంబె విగతజీవులగుదురు గాక!''—అని శపించెను.

పరమసాధ్వియైన యామె నోటనుండి యాపలుకులు వెలువడఁగానే, చోరనాయకుండును వాని స్నేహితులును మొదళ్ళు నఱికిన చెట్లవలె దిగ్గన నేలంబడి, విలవిలం దన్నుకొని ప్రాణంబులు విడిచిరి. దొంగలందఱును మృతినొంది పడినంతట యాశవములంగాంచి తనలో 'అయ్యో! ఇంతమందియొక్కసారిగా మరణించిరే! ఇందఱిజంపిన పాపమునకు పాత్రురాలనైతినే! ఇల్లు దోఁచుకొనిన ను, సంతటితోఁ బోవక దుశ్శీలుండగు దొంగల నాయకుఁడు, నన్ను భంగపఱచుట కెంచకున్న చో నిందరకును వీరికిటువంటి మరణము గలుగకుండును గదా? ఇందఱి చావునకును వీడొక్కరుండే కారణమయ్యెను. ఒక పక్షమున నేను చేసిన కార్యము మంచిదిగానే తోఁచుచున్నది. ఎట్లనగా, వీరుమడియకుండుదురేని మానభంగమునకు పాత్రయైయుందును. ఆసంకట మిపుడు తప్పిపోయినది. పాపము కలుగునని యూరకుండుటెట్లు? ఒక వేళ నా వల్లభుండువచ్చి యీ మృత కళేబరంబులంగాంచి నాకృత్యము నేరముగాఁగొని యేమనునో, యీ శరీరముల నేమిచేయుదును. లోకులు చూచినయెడల నేమిగాఁ దలంపుదురో ఎట్లు?' అని భయమును, సందేహమును వ్యాకులమును సంతసమును, మనంబున నంకురించుచుండఁగా నేదియుం జేయఁదోచక తత్తఱించుచుండెను. పిమ్మట కొంతసేఁపటికి తెల్లవారెను.

అపుడే శర్మముఁ డిల్లుచేరెను. అతఁడులోపల ప్రవేశించి యింట పెక్కు శవములు పడియుండుటయు, తేజోరహితమగు ముఖముతో తన భార్యపులుకు పులుకునంజూచుచు నివ్వెఱపడి నిలిచియుండుటయుం జూచి భయమును నాశ్చర్యమును బొంది మాటాడ నోరురాక కొంత తడవట్టె నిలిచియుండి యెట్లో ధైర్యముఁ దెచ్చుకొని, ''ఈశవము లెక్కడిది? ఎట్లు వచ్చినవి?'' యని భార్య నడిగెను.

ఆమె పతికి నమస్కరించి కన్నుల శోకాశ్రుకణములు జారుచుండఁగా జరిగిన విధమంతయుం బూసగ్రుచ్చినట్లు చెప్పి ''నాథా! మానసంరక్షణముఁ జేసికొనుటకై శపించితిని, వీరుమరణించిరి. ప్రాణహత్యాదోషము నాడిగట్టుకొంటి'' నని యంగలార్చెను. భార్య పాతివ్రత్యమహి

మకు మిగుల నచ్చెరువొంది, అత్మశీలముఁ గాపాడుకొనుటకై దుర్మార్గులను శిక్షించుట తప్పుగాకుండినను, తన కపకారముచేయ నెంచిన చోరులకు తనవలన మరణము గలిగిన దానికై పశ్చాత్తాపమునొంది చింతించుచున్న తన యురాంగియొక్క దయాబుద్ధిని, సుగుణములకును మిక్కిలి సంతుష్టి నొ [illegible] న్చుకొని "ప్రాణేశ్వరీ! ఏల చింతిల్లెదవు? ఊరడిల్లుము. నీమహిమ కొనియాడఁదగినది [illegible] ర్యంబు నీవు చేసిన నేర మిసుమంతయు లేదు [illegible] శిక్షించుట పాపమని యెవ [illegible] లరు! నిన్నును, నీపాతివ్రత్యమును సంరక్షించుటకొరకై [illegible] పని చేయవలసి వచ్చినది. ఈవిషయమున నీమీఁద లేశమైనను నాలో కోపము గలుగదు. కాని, ఒకమాటఁ జెప్పెదను వినుమని యిట్లనియె.

"అసాధారణ ప్రభావముగల మహా [illegible] వీరిపై జాలిగలిగెనేని, మరల జీవించునటుల చేయుము. యికార్యము నీకు కష్టములోనిదిగాదు" యివ్విధమునం దనపతి యాజ్ఞాపించుటయు ప్రియంవద యటులఁ జేయనెంచి సర్వమంగళాదేవిని మనంబునందలంచి పతిపాదపద్మంబులు సంస్తుతించి, "తల్లీ! అపర్ణా! నాపతి యాజ్ఞప్రకారం చేయబూనిన నామనోరథంబును నెరవేరఁజేయుము. పాపక్రియాపరులై తమ దుష్కార్యమునకుఁదగిన ఫలమునుబొందివి మృతులైన యీ చోరులు సజీవులగునట్లు ప్రసాదింపు" మని ప్రార్థించి "నేను నిజముగాఁ బతివ్రతనగుదునేని చచ్చిపడియున్న యీదొంగ లందఱును పునర్జీవితులగుదురుగాక" అని మూడుసారులు పలికి పుడిసిట నీరుగొని యామృత కళేబరంబులపైఁ జల్లెను.

ప్రియంవద చల్లిన నీరుసోకగానే యా ముచ్చులు నిదురించి మేల్కొనిన వారివలె లేచి కూర్చుండి యచ్చోటి లక్షణంబులనుబట్టి జరిగిన రీతిని గ్రహించినవారై పరమపతివ్రత యగుటను దెలిసికొనలేక యామెయెడల తాము వర్తింపఁబూనిన యక్రమచర్యలం దలంచి పశ్చాత్తాప దుఃఖములను బొంది, తటాలున లేచి, యామెకు ప్రదక్షిణ నమస్కారము లొనరించి చేతులుజోడించి నిలిచి "తల్లీ! నీపట్లదుర్వాంఛను బొందిన మహాపాపచిత్తులమగు మానేరములను క్షమించి యనుగ్రహింపుము. నీవు ప్రజ్వలించు వహ్నివంటి దానవు. మేమన్న శలభములము. మాచెడు తలంపువలనఁ గలిగిన ఫలమును బొంది, కృపావతి వగుటచే బ్రతికింపఁ దలంచిన కారణమున మరల జీవము బొందితిమి. అమ్మా! బుద్ధివచ్చినది

నీవు మాజననివి ఎన్నడును నిఁక మేము యిటువంటి యకృత్యమును చేయక సత్ప్రవర్తనులమై యుండెదమని నీపాదములపై నాఁచెట్టి విన్న వించుచున్నాము" అని పలికి యాసాధ్వీరత్నమునకు, భర్తయగు కర్దమునకును మ్రొక్కి, కరుణింపుమని వేడుకొనిరి.

కర్దముఁడు వారిని మన్నించి, "యనుజ్ఞ నొసంగు"మని భార్యతో చెప్పిన, నమ్మగువ వారి యపరాధములను క్షమించి మంచిబుద్ధులు గఱపి పొండనుటయు, దొంగలు వారి యింటిలో నపహరించిన వస్తువులను వారి కొప్పగించి యిల్లు వెలువడిపోయి నాఁడు మొదలుగా సత్ప్రవర్తన గలిగి దైవభక్తియు, పరోపకార చింతయుంగలవారై మెలంగుచు కాలముఁ గడపుచుండిరి. ప్రియంవదయు కర్దముఁడు సుఖముగా వర్తించుచు జగద్విఖ్యాతినిం గాంచిరి. ప్రియంవద పాతివ్రత్య మహిమ భరతదేశమంతటను వెల్లివిరిసి సతీజనంబులకు మార్గదర్శకమై యలరారుచుండెను.

ప్రియంవద కథ సంపూర్ణము

# 9 వసుమతీదేవి కథ

మణిధ్వజుఁడను రాజు పురుషోత్తమ పురాధీశ్వరుఁడు. అతని తండ్రి వృద్ధుడైనందున కుమారుండైన మణిధ్వజునకు రాజ్యము నప్పగించి భార్యా ద్వితీయుండై తపంబుఁ జేసికొనుటకు వనంబులకరిగెను మణిధ్వజుఁడు పట్టాభిషిక్తుఁడయ్యెను. కాని యతని కింకను వివాహముకాలేదు. రాజ్యాధిపత్యమును వహించినంతట మంత్రులు పెండ్లిప్రయత్నము చేసిరి కాని తనకు దగిన సుగుణవతియగు కన్య దొరికిననేగాని పెండ్లాడనొల్లనని చెప్పిన, నచ్చటచ్చట రూపగుణ శీలాదులుగల కన్నియలను విచారించుచుండెను. వారు గారు నెందఱినో చూచివచ్చి మిక్కిలి వర్ణించి చెప్పిరి. వారి నతఁడొల్లడయ్యెను.

ఇవ్విధమున జరుగుచుండఁగా, నొకనాఁడు మణిధ్వజుండు సర్వస్నానాహ్నికములునుఁ జేయించి వేటాడుటకై గుఱ్ఱమునెక్కి యడవులకు బోయెను. అటఁగల దుష్టజంతువులం జంపుచు వేటకాండ్రు మొదలుగాఁగల పరిజనులు నలువంకలం బోయిరి, రాజకుమారుం డన్ననో యొకపొడల

దుప్పి తరుమొత్తంబులం జొచ్చి పోవుచుండగాఁజూచి దానిని వెంబడించి తరుముకొనిపోయెను. కాని యదియతనికి జిక్కినది కాదు. చాలదూరము వచ్చియు, నమ్మృగము దప్పించుకొని పోవుటచే నిరాశఁజేసికొని మిక్కిలి యలసి, నీరుపట్టఁగొని తనవలెనే డస్సియున్న యశ్వమును మెల్లగా నడిపించుకొనుచు, నయ్యడవిలో నెచ్చోటనేనియు నీటిపట్టు గనుపడునో యని వెదకుచు పోయి పోయి, యెదుటనొక చిన్నపల్లియ గోచరించుటయును, నందుఁజొచ్చి యొకయింటివాకిట నిలిచిగుఱ్ఱమునుండి దిగి యింటి పంచటరుగుపై గూర్చుండి "యింటిలోనుండు వారెవ్వరు? నాలుక పిడచగట్టుకొని పోవుచున్నది. త్రాగుటకు కొంచెము నీరుయిచ్చెదరా?" యని హీనస్వరముతో నడిగెను. అప్పుడు పదునాఱేండ్ల ప్రాయముగల యౌవనవతి క్రొక్కాఱు మెఱుపువలెఁ దోఁచి పరిశుద్ధ జలములం దెచ్చి శ్రమబాయ మెల్లగా విసరుచు నిలిచియుండెను. ఆ ముద్దియం జూచి యామెయందు సకల శుభలక్షణములును నమరియుండుట కెంతయు సంతసించి యాబిడ వృత్తాంతమెఱుంగ దలంచి "కాంతామణీ! నిన్నుఁజూడగా జగన్మోహినివో యని తలంపవలసియున్నది. ఇంతటి చక్కని సుకుమారగాత్ర వీ యడవిపల్లియలో బడియుండుట నాకెంతయు వింతగాఁ దోఁచుచున్నది. ఇది యెట్లు? రాజహంసను పొగగూటియందుంచునట్టున్నదే! ఒంటరిదానవై కనబడుచున్నావు. ఇంట మఱి యెవ్వరును లేరా? తలిదండ్రులెవ్వరు? మీజాతియెయ్యది? సంకోచింపక పలుకుము" అని యడిగెను.

ఆలకాంగి యతని పలుకులువిని లజ్జావనతముఖయై "నేనుక్షత్రియకులజాతనే కాని, మేము మిక్కిలి పేదవారము. చిన్నప్పుడే నాతల్లిదండ్రులు మృతినొందిరి. దిక్కులేనిదాననైన నన్ను నామాతృజనకుండైన వృద్ధుఁడు పెంచెను. మేమీపల్లెలో వసించుచు నెట్లో కాలముఁ గడుపుచున్నాము. మీరిచటికి వచ్చుటకు కొంతతడవుముందుగా నాతాత యేదో పని గలిగి యెచ్చోటికోగాని శీఘ్రముగా వచ్చెదనని చెప్పిపోయినందున నేను మాత్రమేయున్నాను" అని కడువినయముతో చెప్పెను.

ఆ పలుకులు విని మణిధ్వజుఁడు మిక్కిలి జాలినిఁబొంది, చెప్పినట్లే వేషమునుబట్టి నిరుపేదరాలగుటం దెలిసికొని 'అయ్యో! ఇంత రూపవతియును కోమలాంగియునైన యీ రమణికా యిట్టి దారిద్ర్యకష్టము? ఇసీ! విధాత యెంతటి కఠినహృదయుఁడుగదా! అన్నవస్త్రాదులకాధారము

లేక కష్టపడుచున్నను, మలినాంబరమును గట్టి యాభరణము లెవ్వియును లేక యుండినను, మేఘాచ్ఛాదిత రాకాచంద్రబింబము పగిది నీమగువ ప్రకాశించుచునే యున్నది. ఔరా! ఎంత చక్కదనము? రూపమును దానికిం దగిన సుగుణ సంపదయు నమరియుండుట పూవునకుం దావి యున్నట్లు మిగుల నొప్పుచున్నది' అని తలంచి మెచ్చుచు "సుందరాంగీ! నీనామ మెయ్యది?" అనెను. "అయ్యా నాపేరు వసుమతి" యని యామె చెప్పినది.

మణి:—ఆహా! నీలక్షణములకుం దగినట్లే పేరుకుదిరినది నేనొక మాటను జెప్పెదను అంగీకరించెదవా?

వసు:—అది యేమి మాటయో తెలిసికొనక, యంగీకరించుటెట్లు? దయచేసి చెప్పండి, యుక్తమైనదేని యంగీకరించెదను.

మణి:— ఉచితముగాని మాటను పలుకుదునా?

వసు:—మంచిది. సెలవియ్యండి.

మణి:—ఆమాటను దెలుపుటకు పూర్వము నావృత్తాంతమును నీవు తెలిసికొనవలయును.

వసు:—సరే! ఏలాగున జెప్పవలయునో అటులనే చెప్పండి.

అంతట మణిధ్వజుండు మందహాసముం గావించి "అబలా! నేను పురుషోత్తమ పురాధీశుండను. నాపేరు మణిధ్వజుడు. అవివాహితుడను, వేటకై వచ్చి పరిజనులతో వేరుపడి, దాహము మించుటచే నీరు నరయుచు వచ్చి యిచ్చోటికిం జేరినాడను. నారాజ్యములోనే యీ చిన్నపల్లెలో నీవంటి యువతీమణి యుండుట యిప్పటివరకును నెరుంగను. నేడు లోకసుందరివైన నిన్ను జూచుటంజేసి నాకన్నులు ధన్యములైనవి. తగిన గుణవతియగు కన్నియ దొరికిననే గాని పెండ్లి జేసికొనరాదని ప్రతిజ్ఞం జేసికొని తదర్థమై వెదకుచుంటిని, కాని లభించినవారు కారు. నేడు హఠాత్తుగా నిన్ను గనగానే నాకోరిక నెరవేరినదిగా భావించితిని. నాకు తృప్తికరములైన సర్వ శుభలక్షణములును నీయందు మూర్తీభవించినట్లు కనుపట్టుచున్నవి. కావున సమ్మతించెదవేని నిన్ను నాయర్ధాంగినిం జేసికొనియెదను. ఈ దారిద్ర్యదశనుండి విడివడి నారాణివై సర్వభోగములను ననుభవింపుము" అని పలికెను.

దైవికముగా నొకమహారాజు పెండ్లాడ గోరినపుడు వలదనిపలుకువారుందురా? అతనిం జేబట్టుట కామెకు సమ్మతముగా నుండినను,

పెంచి పెద్దదానింజేసిన వృద్ధుని యనుమతి వడసిగాని యేదియుం జెప్పుటకు ధైర్యము చాలదయ్యెను. సిగ్గుతోఁ దలవాంచి మృదుమధురములగు మాటలతో "రాజోత్తమా! పరాధీనను గదా! కన్యలు పెద్దల యనుమతి లేక సాహసించుట యెట్లు? మీయర్ధాంగిన గుటకు మించిన యదృష్టము నాకు వేఱొక గలుగునా? అయినను మీరు నా తాతగారి నడుగుట మంచిది. వారు సమ్మతించినచో మీ యిష్టము వచ్చినట్లు జరిగించుటకీదాసురాలు సిద్ధముగా నున్నది" అని చెప్పెను. ఆ మాటలు యుక్తముగానే యున్నవని మణిధ్వజుండు యోచించుచున్నంతలో వసుమతి తాతయును వచ్చెను. చూడగానే యాముసలివాఁడు మణిధ్వజుండు ప్రభుడని గ్రహించెను. వినయముతో వందన మాచరించెను. నృపాలుం డతని సాదర దృష్టులంగని తన యభిప్రాయమును వసుమతితో చెప్పినవిధముగ విశదీకరించెను. అంతటి మహారాజు తానుగా తన మనుమరాలిని వరించుటం దలంచి యుప్పొంగి భూవరుండు కోరినట్లు చేయుట కంగీకరించె. అంతలో రాజసేవకులు తమ రేనిని వెదకుచు నచ్చటికిం జేరిరి మణిధ్వజుండు వసుమతియొక్క తాతను బిలుచుకొనివచ్చునట్లు సేవకున కాజ్ఞాపించి తానా వన్నెలాడిని నిజాశ్వముపై నెక్కించుకొని పురంబునకుఁ బోయెను.

మణిధ్వజుండు పట్టణమును జేరగానే మంత్రి ప్రధానముఖ్యులు వృత్తాంతమంతయుం దెలిసికొని తామందఱును నొకచోట రహస్యప్రదేశమునఁ జేరి "మన మెల్లరమును నెంతయో కష్టపడి గొప్పరాజుల కూతుండ్ర బలువుర నెఱింగివచ్చి పెండ్లాడుమనిన మనరాజు సమ్మతింపఁడయ్యెను. ఇప్పుడన్ననో దిక్కుమాలిన యొకనిరుపేద చిన్నదాని ననాగరకురాలిం బెండ్లాడుటకు తెచ్చెను. ఇది గౌరవమగునా? చక్కదనము కలిగియున్నంత మాత్రమున సరిపోయినదా? తన పరువునకుఁ దగియుండవలదా? మనయందఱి మాటలును వమ్ముగావించినాఁడు 'రాజు మెచ్చినది రంభ' యను మాటకర్థముగా నేర్పడినది. ఎట్లు పరిణమించునో చూతము" అని గుసగుసలు పోవుచు తమ మాటలు నిరాకరించుటచే గలిగిన పరిభవమునకు పరిహారము నాలోచింపఁదొడంగిరి. కాని రాజున కేమియుం దెలియదు.

దైవజ్ఞులను రావించి ముహూర్త నిశ్చయముఁ జేయించి యొక శుభలగ్నమున మణిధ్వజుండు మహావైభవముతో వసుమతినిఁ బెండ్లాడి

యామెను రాణినిఁ గావించుకొనెను. వసుమతీ మణిధ్వజులు పూవును పరిమళమువలె కలిసి వర్తించుచు, సకల సుఖముల ననుభవించుచుండిరి.

కొంతకాలము గడచినది. రాణియైన వసుమతి తాను మహారాజు భార్య ననెడి గర్వము సుంతయును లేక, బీదరాలుగనే భావించుచు, రాజోద్యోగులందును సేవకులందును నధికమగు దయగలదై పేదసాదల కెల్లపుడును నుపచార మొనరించుచు, చిన్ననాటనుండియుఁ దాను పూజించుచుండిన శ్రీరాబ్ధిపుత్రిక నారాధించుటను మరువక, సదా తత్క్రియా నిమగ్నచిత్తయై యస్త్యవిచారముదక్క వర్తింపుచు పతి యందు మిక్కిలి భక్తిగలిగి, నిరంతరమును దైవముగా భావించి సేవింపుచు దయ, సత్యము, శౌచము దనకుఁబెట్టని సొమ్ములై యలరారుచుండఁగా శ్లాఘాపాత్రయై యొప్పుచుండెను.

మణిధ్వజుండు తన భార్యయొక్క సుగుణములను ప్రవర్తనమును గనుంగొని, యామెయందు క్రమముగా నధికానురాగమున సర్వమామె యేయని తలంచి, రాజ్యకార్యములందు సయితము కొంతి యశ్రద్ధను గన పఱచుచుండెను. రాజు నడవడి మంత్రిప్రధానులకు బొత్తుగానిష్టము లేకుండినది. వారలు యెవ్విధమునఁ గాని రాజదంపతులకు భేదమును బుట్టించవలెనని తమవలననైనంతవరకును బ్రయత్నించి యెన్నెన్నియో కుయుక్తులఁబన్నిరి. ఒకటియైనను ఫలించినది కాదు. అన్నియువ్యర్థములై పోయినవి. కడపట నొక యుపాయమును జింతించి యంతఃపుర దాసి కొకతెకు కోరినంతి ధన మొసఁగి తమకు లోఁబరచుకొని దాని మూల మున కార్యము సాధించుటకు నిశ్చయించుకొనిరి.

వారు చేసిన పనియెయ్యది అనఁగా సుదర్శనుం డనెడివాఁడు రాజునకు మిక్కిలి స్నేహితుడు గలడు. వాఁడు పూర్ణముగా రాజుమన్న నకుఁ బాత్రుఁడై యెప్పుడునుగాని నిరాటంకముగా నంతఃపురంబునకు నైతము పోవుటకు వాడుకపడియుండెను. సుదర్శనుఁడు బుద్ధిమంతుఁడు, ప్రభుభక్తిగలవాఁడు, రాజపత్నిని తల్లిగానెంచి యామె యభిమానము నకు పాత్రుఁడై వినయవిధేయత లతిశయింపగా వర్తించుచుండెను. ఈమంత్రి ముఖ్యులు కుట్రకుగడంగి, సుదర్శన వసుమతీ దేవులకు సంబం ధము గలి/యుండిన రీతి దోఁచువిధంబున నొక కమ్మవ్రాసిచుట్టి, దాని నెటులనైనను రాజు చూచుట తటస్థింపదగిన యుపాయముచేయునటుల తమకులోఁబడియున్న దాసికి ప్రబోధించి దానిచేత నొసంగి, ఈజాబుమూల

మున కార్యసిద్ధి యయ్యేనేని నీకు మఱియు గొప్ప బహుమానము లభించు'' నని యాసఁజూపిరి.

అంతఃపుర దాసి, యాయుత్తరము రాజ దంపతులు శయనించు తల్పమున రాణిపరుండు పార్శ్వంబులో నునిచి వెలికిఁగనిపించు విధంబున బెట్టి యెఱుంగనట్లుండెను. నాఁటిరాత్రి మణిధ్వజుఁడు శయనాగారమును జేరినపుడు దీపంబుల వెలుంగున నలుగెలంకులను జూచుచున్న సమయమున పడక యడుగునఁ బెట్టఁబడిన జాబుకండ్లఁబడెను. అతఁడు ''ఏమిది! జాబువలె నున్నదే! నాకు దెలియక యిది యెట్లువచ్చినది!'' అని యెంచుకొని యాజాబునుదీసి చుట్టవిప్పివిడదీసి చదువుకొని వివర్ణముఖుఁడయ్యెను. అతఁకి తానొక మహాసముద్రములో మునిఁగిపోయిన రీతిగాఁ దలంచుకొనెను. మరల జాబును రెండు మూఁడు సారులు చదివెను. ఒక్కసారి చదివినపుడును రాజు ముఖమున వేరు వేరు లక్షణములు గనుపట్టుచుండెను. ఆలోచనా నిమగ్నుండై కొంత తడవు యోచించెను. కడపటి కతని యోచనయంతయు నతిశయమగు నాగ్రహముగా పరిణమించినది.

ఆజాబులో ''నామనోహారీ! నీయుత్తర మందినది ఏమిచేయుదును? మనకూటమికిఁదగు సమయము దొరకమిచే నీ వెటుల పరితపించుచుండెదవో, యంతటికంటె వేయి మడుంగుల కష్టముతో నేను వెతనొందుచున్నాను. పాపాత్ముఁడు నీమగఁడు సర్వదా నిన్ను విడచిపోకుండుటయే మన కిటువంటి దుఃఖము నొందుటకు కారణమైనది. ఎటులనో యొకటి రెండుమారులు దేవుని కృపవలన మనకు కూటమి సౌఖ్యము లభించినది. అది మొదలు మరి సందర్భపడమిచే నేను పడుచున్న మనోవేదన దేవునకే యెరుక. అప్పుడప్పుడును నేను నీయంతఃపురమునకు వచ్చుచున్నను నీచుడగు నీభర్త నీదగ్గఱనే యుండుటవలన నోరార మాటలాడుటకు సయితము వలనుగాకున్నది. చూచి సంతృప్తుడను గావలసినది తప్ప యొండు ఫలితము లేకున్నది. ఇన్నిదినములు నీపొందు లభింపకున్నందున నా ప్రాణములు పోయియే యుండునుగాని, 'యెన్నటికైనను దేవునకు దయ గలుగకుండునా? చూతము గాక' అనెడి యడియాసతో మేనజీవంబులను చిక్కఁబట్టుకొని కాలము గడుపుచున్నాను. నాప్రియ మనోనాయకీ! నీమనఃప్రియుండనైన నాయందు నీకు పూర్ణమగు వాంఛ గలిగి యుండవలయునని భగవంతుని బ్రార్థించుచున్నాను.

యిట్లు నీమనఃప్రియుండు''

ఆజాబులో వ్రాయఁబడియున్న వృత్తాంతమిది! ఇటువంటి విషయమును చూచినంతట నతని మనస్థితి యెట్లుండును? అప్పటివరకును తన యర్ధాంగి యంతటి దుస్స్వభావముగలదని యతఁ డెప్పుడును దలంచి యెఱుంగఁడు. మహాపతివ్రత యనియు సచ్ఛీలవతి యనియు, తనపై నధికమైన యనురాగమును భక్తియు గలదనియు నమ్మియున్నవాఁడగుటచే నయ్యుత్తరమువలన తత్పూర్వము తాను దలంచియున్న దంతయుం దన యవివేకఫలమేనని తలంచెను. ఇట్టి దుష్కృత్యము తన భార్య చేయుచున్నదని యెఱిఁగినపుడు పౌరుషవంతుడైన పురుషుఁ డోర్చియుండునా? ఆశ్చర్యమును కోపమును నప్పటప్పటికి మణిధ్వజున కధికముగాఁ జొచ్చినది. తనలో నతఁడు 'ఓరీ దురాత్మా! సువర్ణా! ఎంతద్రోహమున కొడిగట్టినాడవు? పరమ మిత్రుండవని యంతిపురమునకు వచ్చుచుం బోవుచుండుట కనుమతించితిని, దానికిదియా ఫలము? ఇట్టి యకార్యమును చేయఁగడంగిన నీధైర్య సాహసములం గూర్చి యేమనవచ్చును? ఛీ! ఛీ! నీముఖమును జూడరాదు. చూడరాదనుట మాత్రమే కాదు. పరమపాపశీలుండవును నంతఃపురద్రోహ మొనరించిన దుష్కార్యమునకు బ్రదికియుండుటకే యర్హుఁడవు గావు. నీవును నిన్ను కామించి నీమోహమునకు పాత్రురాలైయున్న చెడిపెయు, మీరొనరించిన దుష్కార్యమునకుదగిన ఫలము ననుభవించెదరుగాక' యని యుగ్రముగా భావించుకొనెను.

ఈలాగున మణిధ్వజుం డాలోచింపుచు మహాదాగ్రహచిత్తుఁడై యున్న సమయంబున మజ్జన భోజనాదిక్రియ లాచరించి సమస్తాలంకార శోభితాంగియై వసుమతీదేవి శయనాగారమున కరుదెంచెను. ఆమెను చూడగానే నేయిఁబోసిన మంటయుం బోలె మణిధ్వజుని కోపాగ్ని ప్రజ్వలింపఁ దొడంగినది. ఎప్పటివలె తాను రాగానే తన వల్లభుండు ప్రియంబుతో దగ్గఱకుఁ జేరఁదీసికొనక యుగ్రదృష్టులఁ గనుచుండుటగని, వసుమతీదేవి తత్కారణంబు దెలియనిది యగుటచే నిష్కళంక చిత్తమున "ప్రాణేశ్వరా! నేఁడు మీరొకతీరున నేదియో నాలోచనం దగిలి పలుకకుండెదరేల? మీపట్ల నావలన నేదేనియు నపరాధము కలిగినదా? ఏమి కారణము? ఇట్లు మీరు పలుకకుండినచో నాప్రాణములు నిలువవు. కరుణించి యానిమిత్తము నెఱింగింపు" డని డాయవచ్చెను.

మణిధ్వజుండు తొలఁగి నిలిచి "ఓసి దురాత్మురాల! మాయలాడీ! నీవెంతటికపటముగానటించినను, దనవృత్తాంతము బయలుకానేయైనది

పాపక్రియలకు భగవంతుఁ డోర్చునా? నీవు సుగుణవతివనియు, పతిభక్తి గలదానవనియు, సత్ప్రవర్తనరాలవనియును నెంచి నిన్ను నేఁటివరకును నమ్మియుంటిని. ఇట్టి నా వెఱ్ఱి నమ్మకమునకు నన్ను నిందించుకొనుచున్నాను. నేను తెలిసికొనలేదని తలంచితివి కాఁబోలు? దొంగతనము యెంతకాలము దాగియుండును? అంతయు స్పష్టమైనది. ఓసీ! ఇదిగో! ఈజాబును చూడుము. నీమనోహరుఁడు దీనిని వ్రాసియున్నాఁడని మరచితివేమో? చింపివేయక దాచియున్న కారణమున నీదుశ్శీలమును నేను తెలిసికొంటిని'' అని భయంకరముగాఁ బలికెను

ఏవిషయమును నెఱుంగని నిరపరాధినియు నిష్కళంక చిత్తయునగు యమ్మగువ పతి పలికిన దారుణోక్తులు ములుకుల క్రియ దోఁచి భ్రమించి నివ్వెఱపడి నిలిచి పలుకుటకు నోరురాక కొంత తడవునకు యెట్లో సమాళించుకొని భయంబునొంది యొడలు వడఁకుచుండగాఁ గద్గద కంఠయై ''నాథా! మీరు చెప్పెడి విషయ మెట్టిదియో నాకు దెలియకున్నది. జాబెక్కడిది? ఎవరు వ్రాసినది? ఎందుకొఱకు!'' అనెను.

మణి:—ఈ జాబు విషయమే నీకుఁ దెలియదా?

వసు:- -అయ్యో! నేనెఱుంగనే! ఆవిషయ మెట్లు తెలియును?

మణి:- -ఓసి మాయలాడీ! ఇంకేమి దాఁకరికము? నీ ప్రియుండు వ్రాసెను?

వసు:- -నా ప్రియుఁడా? మీరేగదా? ఏమని వ్రాసితిరి?

మణి:- నేనా? నీ ప్రియుఁడను?

వసు:- కాకున్న మఱి యెవ్వరు?

మణి:—నీకు ప్రియుఁడు సువర్ణుఁడు గదా? అతఁడు వ్రాసినదే యిది!

ఆమె గుండియలు వ్రీలినట్లయ్యెను. ''అయ్యో! అయ్యో! హరి హరీ! ప్రాణనాథా! ఈకఠోర వాక్కులు మీనోటనుండి వేల వెడలుచున్నవో తెలియఁజాలకున్నాను'' అని పలికి వలవల యేడ్చెను.

మణి:—సంతోష కాలము చింతింపనేమిటికి?

వసు:—మీరు చెప్పెడి విషయమును గాని, చెప్పిన జాబు విషయమును గాని నేను దైవసాక్షిగా నెఱుంగను. అది యెవరు వ్రాసిరో, యేమని వ్రాసిరో యావిషయము భగవంతునకే తెలియవలెను.

మణి:—ఓహో! తెలియదా? తెలిపెదను వినుము.

అతఁడా జాబులో వ్రాయఁబడియున్న విషయమంతయును జదివి యామెకు వినికిడిఁ జేసెను. దానిని వినగానే కుసుమకోమల దేహయగు వసుమతి, "హా! హా!"—యని మొదలు నఱికిన చెట్టువలె మూర్ఛిల్లి క్రిందఁబడెను. ఇంచుక శ్రమనొందినచో నామెకును మూడఁజాలక యుపచరించునట్టి మణిధ్వజుం డాసమయమునఁ దిగ్గన మూర్ఛిల్లి పడిన యమ్ముద్దియ విషయమై యించుకయును జాలినొందక బిరబిర నచటనుండి వెడలిపోయెను. అతఁడొక యేకాంతస్థలంబునఁ జేరి కర్తవ్యంబును గూర్చి యాలోచనా నిమగ్నుండాయెను.

చెలులును విషయ మెఱుంగని వారగుటచే తమ యేలికసాని మూర్ఛిల్లుటయు, భర్త యామె నట్టి స్థితిలో విడిచి పోవుటయుం జూచి నిమిత్తముఁ దెలిసికొనలేక తత్తఱించుచుడాయఁబోయి యనేకములైన యుపచారములు గావించి యెట్లో మహాకష్టమున నామెకు తెలివి గలుగునట్లు గావించిరి.

ఆమె తెలివినొందినిరపరాధినియైన తనవిషయమును, ప్రాణనాథునకుఁ గలిగిన యనుమానమును దానిమూలమునఁ బొడమిన యాగ్రహమును దలంచి తనలో 'కటకటా! నా విభుని పాదపద్మములు దక్క—యన్యమును దలంచి యెఱుంగనే, పరపురుషులను తండ్రులుగను, సోదరులుగను, పుత్రులుగను దలంచుచు సకారణముగ కనులెత్తి చూడనైన చూడకుండు దానను గదా! నా కీయపనిందరానేల? దైవమా! మా యొద్దికగని యోర్వలేక యేపాపకారులింతటి యకృత్యమునకొడికట్టిరో కదా! హరిహరీ! మహా వివేకవంతుఁడయ్యును నామనోహరుఁ డాకపటంపు జాబును చూచి నంతట నా ప్రవర్తనమంతయు నెఱింగియుండియు నిజంబుగానే యుండునని నమ్మి నాపై నత్యంతముగ కోపమునుగొనెను. ఇది కల్లయని యాగుణాకరునకు దృఢముగాఁ జేతంబున దోచులాగున నెట్లు చేయుదును? నాపైని యొసంగిన యనుమానము నెవ్విధంబున తొలంగింప ననువుపడును. ఏమి చేయుదు' నని శోకమును భయంబును నతిశయింపఁగా మూర్ఛిల్లినతటి తనయందు కనికరము లేక విడిచిపోవుట కెంతయు పరితాపమును బొందుచు చింతాసాగరమున మునింగి యల్లాడుచుండెను.

సద్వర్తనులును, సద్గుణవంతులునైన యాదంపతులను నాటిరాత్రి యంతయును నిద్రపట్టక వెతనొందుచు కాలమును గడుపుచుండిరి. కర్త

వ్యాంశమునుగూర్చి యాలోచించుచున్న మణిధ్వజుండు తానుచేయవలసిన విధమును నిశ్చయించుకొనెను. అప్పటికి తూర్పు తెల్లవారిండి. అతఁడు త్వరితముగా కాలకృత్యములు దీర్చుకొని కొలువు కూటంబున కేతెంచెను. ఎన్నఁడును నటుల నొనరించి యుండని తమ రాజు నాఁడు ప్రొద్దుననే సభకు వచ్చినందున నందఱు నాశ్చర్యమొంది, తాము సభ కేతెంచిరి

రాజు మహోగ్రుఁడై జాబు వృత్తాంతమును మంత్రి ప్రధానుల కెఱింగించి, "యంతఃపుర ద్రోహియైన సుదర్శనునిబట్టి తెం"డని భటుల కాజ్ఞాపించెను. అట్టియెడ తామొనరించిన కుట్ర సఫలమైనదని మంత్రి మొదలయినవారు సంతసించిరి. కాని, యందువలన నేపాపము నెఱుంగని సుదర్శనుం డాపదలో జిక్కుపడుట దలంచి యాపాపము తమకు దప్పదని లోలోన దుఃఖించుచు, పయికిఁదోపనీయక జాగ్రత్తగా నటించుచుండిరి. అంతలోనే తప్పును జేయని సుదర్శనుని భటులు బంధించి తెచ్చి సభలో నిలిపిరి. అతఁడు కారణము తెలియక ప్రమాన్పడి యత్యుగ్రుఁడై యున్న రాజు తనయెడల నంతటి క్రూరముగా వర్తించి యేమి చేయనుండెనో యని మాటలాడజాలక నిలిచియుండెను.

మణిధ్వజుండు తన భార్యను సయితము సుదర్శనుడు వచ్చినట్లే సభకు తోడి తెప్పించి, యేపాపము నెఱుంగని యామెపై నేరము నారోపించి తానెంతటి బుద్ధిమంతుఁడై యున్నను స్త్రీసంబంధమగు నెవ్విషయమున వివేకమును గోల్పోయి మూఢుని చందమున మంచి చెడుగులను విమర్శింపక, పరమ పతివ్రతా శిరోమణికి, తన భక్తుండగు సుదర్శనుని తగులము నంటగట్టి, యంతఃపుర ద్రోహ మొనర్చెనను నేరమునకై సుదర్శనుని తనయందు భక్తియు ననురాగమును గలదియుంబోలె నటించుచు నన్యపురుష సంగమ వాంఛగలిగి మోసగించి నష్టవర్తనయై కడు మంచిదానివలె నుండిన మహానేరమునకై తన యర్ధాంగిని యొకసారిగానే శిరచ్ఛేదముఁ గావించుటకు సేవకుల కాజ్ఞయొసంగెను. ఈ యుపద్రవము కలుగుటకు కారణభూతులైన కొందఱు దక్క, తక్కినవారందఱును "అయ్యో! అన్యాయ మన్యాయము, సుగుణనిధియు, సాధ్వియు నగు నయ్యిందువదన యింతటి యక్రమకృత్యములుఁ జేయఁదలంచునా? ఈమె ప్రవర్తనము నిష్కళంక మగుట మన మెఱుంగని వారమా? ఇది యెవ్వరో దుర్మార్గులు పన్నిన కుతంత్రముగాని వేఱుకాదు. మహా పతి

వ్రతయు సుశీలయునగుట సర్వజనులును నెఱుంగుదురే! అట్టి యీమెలో కళంకము గానంగునా! అనుకూలురైన యీ రాజదంపతుల మేలు చూడఁజాలని పాపాత్ములు వీరికి భేదము బుట్టించుటకుఁ గడంగి యింత పని జరుగునట్లు చేసిరి. బుద్ధిమంతుఁ డయ్యును రాజు యోచింపక పరుల మాయా వాగురలోఁ దగుల్కొని ఘోరకృత్యమునకుఁ గడంగెను. ఇది యేమి వివేకము? ఇతండు పిమ్మట పశ్చాత్తాపమును బొంది కృశింపఁ గలడు" అని సభలో వసుమతి శీలము నెఱిఁగినవారు రాజు చేసిన యాజ్ఞను విని చింతాక్రాంతులై, వారింప శక్తి లేక పలు తెఱంగులం బలుకుచు గుసగుసలఁ బోవుచుండిరి. ఇదమిత్థమని యొక్కరును బలుక లేదు.

పైనఁ జెప్పినట్లు రాజు నాజ్ఞాప్రకారము జరిగించువారై సేవకులు ప్రయత్నించుచుండఁగా, వసుమతి పతివంకఁ జూచి "ప్రాణనాథా! ఇందు నేనొక పాపము నెఱుంగని నిరపరాధిని, నా హృదయమును జీల్చి చూచినను నాలో మీపాదాంబుజములు దక్క మఱి యొక్కటి యుండదు. ఎల్లప్పుడును మీధ్యానమే ముఖ్యమని, మిమ్ము భగవత్స్వరూపముగా నెంచుచు సేవించుచుండు దానను మఱి యొద్దికనుఁజూచి యోర్వలేని పాపాత్ము లెవ్వరో యింతటి ద్రోహముఁ గొడిగట్టి పాటును గలిగించిరి. మీకు నాయందు భేదబుద్ధి గలుగఁజేసిరి. ఈ సువర్ణుఁడు నాకు పుత్రసామ్యుఁడు. ఇట్టివానికి నాకును తగులము నంటగట్టి మీకును నాకును నెడబాటు గలిగించి నన్ను మరణదండనకుఁ బాత్రురాల నగునట్లు చేసిన దురాత్ము లెప్పటికిని సుఖింపఁజాలరు. మహానాయకా! నేను మరణమునకై సుంతయు వ్యసనమును జెందుచుండలేదు. పతివ్రతనని పేరుపోని ఖ్యాతిని గడించి తుదకిటువంటి యుపవాదమును జెంది ప్రాణములను గోల్పోవలసివచ్చినందులకై దుఃఖించుచున్నాను. ఆగ్రహావశులరై యిపుడు నన్ను జంపించినను యింకను కొన్నినాళ్ళకైనను నేను నిరపరాధిని ననుట మీకుఁ దెలియగలదు. అపుడు పశ్చాత్తాపము పాలుగాఁగలరు నానిష్కళంక ప్రవర్తనకు సూర్య చంద్రులును, భూమ్యాకాశాది పంచభూతములును సాక్షులు. హృదయేశా! నేను మన్నింపుఁడని మిమ్ము ప్రార్థించుట లేదు; ఈమాటను మీపాదములపై నానఁబెట్టి దైవసాక్షిగాఁ జెప్పుచున్నాను. నన్ను జంపినంతటనైనను మీస్వాంతము శాంతించి మీరు సుఖమైన దీర్ఘాయుష్మంతులరై యుండవలయునని దేవుని వేడుచు, మీ

యాజ్ఞను మహాసంతోషముతో తలఁదాల్చి సిద్ధముగా నున్నదానను" అని చెప్పి భోరున నేడ్చి మరణమునకు సంసిద్ధయై నిలిచెను.

ఇట్టి మహా పతివ్రత నోటనుండి యీమాటలు వెలువడగానే యంబరమునుండి హఠాత్తుగా సముద్రఘోషమువలె నొక మహా శబ్దము బొడమినది. ఒకటి రెండు సారులా కొలువుమందిరము భూకంప సమయమందువలె నూఁగులాడినది. అచ్చట గలవారలెల్లరును భయ భ్రాంతులై "అదియేమి విపరీతమో, యెట్టి యాపద సంభవించునో" యని వడంకుచుండిరి.

తత్సమయంబున మెరుపుమెరసినట్లు దిగ్గన నొక వెలుఁగు గనుపించి యచ్చటివారి కొకటి రెండు నిమిషములవరకును కన్నులు మిఱుమిట్లు నొందజేసెను. పిమ్మట నాతేజము నడుమ నొక దివ్యస్వరూప మందఱకును గోచరించెను. సభ్యులు భయాశ్చర్యమగ్నులై యట్టెచూచు చుండఁగా, ఆ మహాపురుషుండు గంభీరస్వరముతో నెల్లరును విను చుండఁగా రాజుతో నీ క్రింద వివరించిన రీతిగాఁ బలికెను.

"ఓయిరాజా! నీవు సుగుణవంతుడవయ్యు గుణహీనుని చందమున వర్తించుచున్నాఁడవు. సద్గుణముల కాటపట్టయి సచ్ఛీలముగలదై నీయందు నిష్కళంక భక్తిగలిగి సదా దైవమును వలె నిన్ను సేవించు చుండెడి సాధ్వీమతల్లిని, నీధర్మపత్నియైన యీసతీరత్నమును దుష్టవర్తనునుగా నెంచి, ధర్మము నెఱుంగలేక, పాపమని భావింపక, యుక్తాయుక్త పరిజ్ఞానశూన్యుండవై నిబ్బరంబునఁ జంపించుటకుఁ బూనితివి. ఇట్టిదేనా నీరాజ్ఞత? ధర్మపాలనమిట్టిదగునా? ఈమె పరమపతివ్రత. అన్యపురుషుల మనంబునం దలంచి యెరుంగని పుణ్యవతి. ఈమెపై నిందను మోపుటయు మరణదండనను విధించుటయు మిక్కిలి యక్రమము. పావనచరిత్ర యగు నీమె యేపాపము నెరుఁగదు. ఈమెయం దత్యంతమైన ప్రియము గలవాడవై నీవు రాజ్యవిషయములందును, నుద్యోగులయందును నొక్కింత యశ్రద్ధను చూపుచుండినందున, నెటులనైనను మీకు భేదము గలిగింపవలయునని యెంచి నీమంత్రి ప్రధానులు యోచించి, యొకదాసి మూలమున తాము సృష్టించినట్టి నీవు చూచిన జాబును నీకుఁ గనుపడు నట్లు శయ్యయందు బెట్టించిరి. దానినిఁ జూచి నీవు నిజమని భావించి, భ్రమనొంది పతివ్రతయగు భార్యపై దోషమారోపించి యింతటి క్రూర కృత్యమున కొడిగట్టితివి. ఓయి నృపాలా! నేను సూర్యుడను. ప్రతిమాన

వుండునుచేయు సర్వకార్యక్రమములును పురుషవృత్తములు నేనును, చంద్రుడును, వాయుదేవుండును, భూమ్యాకాశములును జూచుచుండు దుము. మాకుఁ దెలియని యేరహస్యకార్యమును లోకంబుననుండదు. సాధ్వియగు నీకులసతి తనలో మమ్ము దలంచి పరిదేవనంబు జేసినందున యామె శీలము సర్వజనులు నెఱుంగులాగున నీకు దెలుపుటకై నేనుపాడ నూపితిని. అగ్నికి చెదలంటని విధంబున యీపతివ్రతా శిరోమణియందు ఏదోషమును బొసంగ నేరదు. అనుమానము విడిచి నిర్దోషులగు నాశితా బద్ధులను విడిపింపుము. నీభార్య యెట్లో యీసుదర్శనుండును నిష్కళంక చిత్తుఁడు, మహీవల్లభా! జాయనాదరించి యామె దుఃఖమును నివారించి యభేదచిత్తుడవై యెప్పటివలె సంతోషముతో సుఖములనుభవింపుము.''

అని యివ్విధమున నాదిత్యుండు పలుకుచుండఁగా, వసుమతిపైఁ బుష్పదృష్టి జల్లునఁ గురిసెను. ''వసుమతీదేవీ! నీపాతివ్రత్య మహిమ లోకంబున శాశ్వతముగా ప్రశంసింపఁబడును గాక, నీకు సకల సౌభాగ్యములును గలుగునుగాక'' యని మింటనుండి దేవతల సాధువాదములు వినవచ్చెను. సభ్యులలో ప్రధాని ముఖ్యులుదక్క మిగిలినవారలా సాధ్వికి దండన దప్పినందు కెంతయు సంతోషమును బొందిరి. అపుడు మణిధ్వజుండు తెలివిదెచ్చుకొని, దోషరహితయగు సతిని దుఃఖమొందించి వేగిర పడి దండింప గడంగిన తన యెనలేని యవివేకమునకు చింతించి పశ్చాత్తాపమునొంది, ప్రత్యక్షమైన సూర్యునకు దండప్రణామంబులు సమర్పించి యజ్ఞానకృతమగు తన నేరమును మన్నింపవలయునని వేడుకొనెను.

వసుమతి సూర్యునకు నమస్కరించి పలుతెఱంగులఁ బ్రార్థించిన, యబ్జమిత్రుం డామెయందు కరుణాళుండై వంశోద్ధారకుండైన యొక సుపుత్రుం డామెకు గలుగులాగున ననుగ్రహించి యంతర్హితుండయ్యెను. పిమ్మట నరేశ్వరుండు తన యజ్ఞానమును వివరించి వసుమతిదేవి నెంతయు నాదరించి యంతఃపురంబున కనిచి, పరమమిత్రుండగు సుదర్శనుని నాలింగనముఁ జేసికొని తన నేరమును మదిఁదలంపక యెప్పటి రీతిని మెలంగుటకై యతని వేడుకొనెను. ఈనాటక మంతయుం గనుచు వినుచునుండెడి మంత్రి ప్రధాని ప్రముఖులు, తమ గుట్టు బయలయి నందున, నేమి కీడుమూడునో యని భయాకులచిత్తులై తత్తఱిల్లుచుండిరి. అటుల వారలు భీతినొందిన విషయము వ్యర్థమైనది కాదు. దానిఫలము వారి కనుభవింపక తప్పిపోలేదు.

మణిధ్వజుండు, దురాత్ములైన మంత్రి ప్రధానులు తనయెడలఁ గావించియున్న మహాపరాధమును దలంచి యధికమైన కోపమును బొంది, తన భార్యకును సుదర్శనునకును విధించిన శిక్ష వారికి విధింపఁ దలచెను. కాని యటుల చేయరాదని యెంచి, ఆదుష్టులు బ్రతికియున్నంత కాలము కారాగారమునఁబడి నానాకష్టములు ననుభవించునటుల శాసించెను. ఈవృత్తాంతము నెఱింగి, దయామానసయైన వసుమతీదేవి అటువంటి శిక్ష వారికి విధించుట యుచితము గాదనియు, మన్నించుట యుక్తమనియు పతితో విన్నవించెను. ఆమె దయాళుత్వమునకు నృపాలుండు సంతసించియు నేదేనియు నొక దండన యుండవలయునని యెంచి కుటిలవర్తనులగు వారలనెల్లరను, నాఁడే తన దేశమును విడిచి పోవు లాగున నాజ్ఞాపించిన చేసిన నేరమునకుఁ దమకుఁ దొరకిన ఫలము లభ్యమయ్యెనని తలంచి, దయాగుణముగల వసుమతీదేవికి తా మొనరించిన కీడు నెంచక తమ్ము విడుదలఁ జేయించిన యమ్మగువను గొనియాడుచు, నానాఁడే యాపురంబును విడిపోయిరి. తరువాత, వసుమతీ మణిధ్వజులు సుఖముగా కాలమును గడపుచు సూర్యుని వరముచేత పుత్రుండు గలుగుటయు నానందవార్ధిలో నోలలాడుచుండిరి.

వసుమతీదేవి కథ సంపూర్ణము

# 10. సాగరికకథ

సాగరిక కులాలవనిత, మహాపతివ్రత. ఆమె పతిపేరు మందరుఁడు. సాగరికా మందరులు సాధు దంపతులు. వారికి వారి కులవృత్తియే జీవనము. వారు భవనాశనీ నదీతీరంబుననుండు శాంతినికేతనంబను పట్టణమున నివసించుచుండిరి. ప్రతిదినమును నక్కులాల సాధ్వి, ప్రభాతకాలమున తనభర్తకంటె మున్నుగా నిద్రలేచి, కాలకృత్యంబులు నిర్వర్తించి స్నానముఁజేసి శుభ్రవస్త్రంబుఁదాల్చి, సరస్వతీదేవిని భక్తితాత్పర్యములతోఁబూజించి వల్లభుడు మేల్కొనగానే సంతోషముతో మొగము కలకల లాడుచుండఁగా పతిని నతని మానసమున కానందము గలుగు నట్టుల ముందుగనుపట్టును. మందరుఁడు లేచి నిత్యకృత్యములు దీర్చుకొను నంతలో నామె భవనాశనికరిగి పరిశుద్ధమైన యిసుక నొక గంపనిండుగ

సేకరించుకొనివచ్చి యింటిలోఁబోయును. ఆ యిసుకను నీరుపోసి త్రొక్కి మందరుఁడు కుండలు చేయును. ఆ మహాపతివ్రతామణి యుండుటచేతఁగలిగిన మహిమయో లేక యామె సంకల్ప మహాత్మ్యమోగాని, నీరు విడిచి కలిపినపుడును కాళ్ళతోఁద్రొక్కినపుడును, ముద్దజేసి సారెపైఁ బెట్టునపుడును, పలురూపముల పాత్రములుగా దిద్ది కుదిరించినపుడును, నాయమ తెచ్చిన యాయిసుము మేలైన బంకమన్నుకంటె నెక్కుడు బాగుగా సాగి సంకల్పించినట్లు సకల పాత్రములును నగుచుండును. చేయఁబడిన యా మట్టిపాత్రముల సాగరిక గొనిపోయి మందిరములోనుంచును. అంతట వానిని ఆవమునఁ జేర్చుటయు, గాల్చుటయు వారెఱుగనే యెఱుఁగరు. ఆ పాత్రములను వాడినచో, నీరు తగులగానే వీడి చెడిపోవక, శుద్ధమైన బంకమట్టితో చేసి, కాల్చినకుండల కన్నను గట్టివై క్రింద జారిపడినను పగులకుండును.

ఇటులనుండెడి సిద్ధమైన యా కుండలను భార్యాభర్త లిరువురుం గొంపోయి పురంబులో విక్రయించి రాఁబడిన రూకలను పప్పుబియ్యము మొదలగు సామగ్రిఁగొని, వారు సూర్యాస్తమానమునకు తమ యిల్లు జేరుచుండుదురు. ఇట్లు చేయుచుండుట వారికి వాడుక. సాగరికా మందరులు దెచ్చిన యిసుక కుండలంజూచి వానింగొని వాడిచూచి యాపాత్రముల యందమునకును, గట్టికిని మెచ్చి, పురజనులొండొరులతో "ఆహా! లోకమున నిసుకతో కుండలు చేయువారుగలరా? ఒకవేళ శ్రమపడి చేసినను నడి పట్టుకొనఁగానే యులవుల మాడిపోవునేగాని, యా కుండలవలె నింతగట్టిగలిగి, చేజాఱి నేలబడినను పగులకమనియుండునా? వీరి మహిమ యెట్టిదియోగదా!" యని చెప్పుకొనుచు, మహాదాశ్చర్య నిమగ్నులై విచిత్రముగా యుండెడి యాసైకత పాత్రముల నెల్లరును విశేషముగాఁ గొనుచుండుదురు.

కులాలదంపతులు ప్రతిదినమునుం దాముగొనిపోయిన పదార్థములను వండి, యతిథులకును, నభ్యాగతులకునుంబెట్టి తచ్ఛేషమును రెండు పాళ్ళుగా భాగించి మఱుసటి యుదయమున భుజించుటకై యొకపాలు పెట్టుకొని మిగిలిన దానిని భార్యాభర్తలు తృప్తిగా భుజించి సంతుష్టాంతరంగులై శయనించి భగవత్కథా ప్రసంగమున కొంతసేపు కాలముఁ గడపి యనంతరము నిద్రించుదురు. ఇట్లే పూర్వోక్తక్రమంబున మఱుసటి దినమును జరిగించుచుండుదురు.

కొంతకాలము గడచినంతట, యిసుము కుండలయ్యెడి మహిమ సాగరికయొక్క పాతివ్రత్య ప్రభావంబని యెల్లరును దెలిసికొనిరి. తత్పూర్వ మా కార్యమేమి యింద్రజాలమువలననో జరుగుచున్నదని తలంచుచుండిన ప్రజలిపుడు సాగరిక పతిభక్తియు, సత్ప్రవర్తనమును దెలిసికొని యామెయందు మిక్కిలి పూజ్యభావముం గలవారై కొనియాడుచుండిరి.

అప్పటినుండియును నప్పురంబున గుణవంతులైన స్త్రీలు తాము నుం దమ పతులయందు భక్తిగలిగి సేవించుచు, సాగరికయుంబోలె వర్తించి కీర్తి వడయం దలంపుగొని వర్తింపఁ దొడంగిరి. ఇవ్విధమున జరుగుచుండగా, వాడుక ప్రకారముగా సాగరిక యిసుకఁ దెచ్చుటకై నదికిఁబోయి, కంపలో సేకరించుకొని, గట్టునకు వచ్చుచుండు సమయమున నొడ్డునంగల యొక చెట్టు కొమ్మపై పక్షి మిథునము గూర్చుండియుండుట యామెకు గోచరించెను. వానిలో మగపక్షి సంగమాపేక్షచే తన పెంటిని పైకొనఁజూచుటయు, సమ్మతింపక యాడుపిట్ట దూరదూరముగఁ బోవుటయు, నత్యంతప్రియముతో మగది దాని చెంతకేగి దైన్యముగా ప్రార్థించునట్టి లక్షణములు గనపరచుచుండుటయు చూచి, సాగరిక తనలో ‘అయ్యో’ పాపము! ఇదియెంతకష్ట మనవలయును? ఇసీ! ప్రియముతోఁ గలయవచ్చిన తన పతికోర్కెదీర్పక యీ పెంటిపిట్ట యెతగా నలయించుచున్నది? మగపక్షి పడెడి వేదన నామనంబున కెంతయు జాలిగలిగించుచున్నది. కనికరము లేని భార్యతో నిది యెట్లు జతకూడియున్నదోగదా!’ అని యాపురుష పక్షిపై మిక్కిలియు గనికరముగలదై కొంతతడ వట్టె వానినిఁ జూచుచు నిలిచియుండి, పిమ్మట నటనుండి యింటికరిగెను.

నాఁటిదిన మామె తెచ్చిన యిసుక కుండలుచేయుటకు వలనుగాక పోయినది. ఎంత ప్రయత్నించినను మందరునకు సాధ్యము కాలేదు. తత్కారణ మతనికిఁ దెలిసినదికాదు. అతఁ డేమిచేయును? బంకమట్టిఁ దెచ్చి నానఁబెట్టి పిసికి కుండలు చేయఁ దలంచినచో నా కార్యమంత త్వరలో నగునదికాదు. రెండుమూడు దినములకేగాని యా కార్యమంత కొనసాగదు. సరిగదా? వాడుక ప్రకారముగా పాత్రములుచేసి యమ్ముకొని రూకలు దెచ్చుకొనకుండినచో భోజనమునకు మృగ్యము. ఏనాఁటి కానాఁడు తెచ్చుకొనిన వస్తుచయమును వినియోగించుకొనుచుండు

వారికి నింటిలో నేమైన నెట్లుండును! మందరునకు మిక్కిలి కష్టముగాం దోంచినది. నాటి యిసుక కుండలుగాకపోవుట యట్లుండగా, ముందు పురజనులకు తాము విక్రయించియున్న పాత్రములన్నయు ను, వారివారి యిండ్లలో నున్నట్లుండి పగిలి యిసుకయై పోయినవి! ఈవింతి కెల్లరును నాశ్చర్యమును బొందుచుండిరి

తత్సమయంబున మందరుండు భార్యనుబిలిచి "వనితామణి! నేండు నీవు తెచ్చిన యిసుక కుండలుకావయ్యెను. మున్ను మనయొద్ద గొనిన వారి యిండ్లలోని కుండలన్నియుం బగిలిపోయెనని చెప్పుకొనుచున్నారు. హేతువేమో తెలియకున్నది; పాత్రమునుచేసి యమ్ముకున్నచో నేడు మన కాహార పదార్థములు పూజ్యమగును. పస్తుపడి యుండవలసినది తప్ప వేఱు గతిలేదు. అతిథులను నభ్యాగతులను సంతుష్టి నొందించు టెట్లు? ఏయుపాయమునుం దోచకున్నది" అని కడుదీనముగా జెప్పెను.

ఈవిషయమును విన్నంతట సాగరికకు కారణము తెలియక, తన ప్రవర్తనమందే దేనియు దోషము గలిగియుండునా? యని సంశయించి యెంతగా నాలోచించినను నామె కేది యునుం దోంచలేదు.

ఆమె భయభ్రాంతచిత్తయై సదా తా నారాధించు భారతీదేవిని, బ్రతిష్ఠించి పరిశుద్ధ చిత్తముతో నర్చనం గావించి పరమభక్తి సంకలితముగా నొప్పుస్వాంతముతో కరములు మొగిచి యనేక విధంబుల స్తోత్రముం గావించి, "జననీ! జ్ఞానప్రదాయినీ! సకలదోషనివారిణీ! కాంక్షిత సకలార్థ ప్రసాదన కుతూహలా! కమలావనీ! కమలదళసన్నిభవిశాల లోచని! కరుణాంతరంగా, శుకవాణీ! వీణాపుస్తకపాణీ! భక్తజన సంరక్షణీ వాణీ! కల్యాణీ వేణీజితరోలంబా! జగదంబా! నీకు నమస్కారము, ఓపరమపావన స్వరూపిణీ! రక్ష రక్ష పాహి పాహి! నామనోవాక్కాయ కర్మంబులం దెప్పుడుగాని యెఱిగి నేను దోష మేదియును నొనరింపలేదు, అజ్ఞానజనితంబైన నేర మెయ్యదియైనం బొసంగియుండినచో క్షమించి నన్ను రక్షింపుము. పరదేవతా! ప్రతిదినంబును మేము గావించుచుండిన సైకత భాండకృత్యంబు నేఁటివేఁటక విఫల ప్రయత్నులమైతిమి. ఈ విషయంబునుబట్టి యాలోచింపగా నేదో యొక నేరము గలిగియుండ వలయునని తోచుచున్నదిగాని యదియిట్టిదనుట మనంబునకుం దోచకున్నది. అట్టి నేరము నెఱింగించి దాసురాలనగు నన్ను ధన్యురాలిం జేయు" మని వేడుకొనెను.

భాషాదేవి సాగరిక స్తోత్రమునకు సంతసించి దిగ్గనపొడచూపి, మధుర భాషలతో "ఓ సాధ్వీ! నీవు నిర్దోషచిత్తవైయైనను, పక్షిమిథున సంగమ విషయంబులు నీబుద్ధి పురుషపక్షి పరంబున కనికర రూపంబున లగ్నమైనది. యది యన్యపురుష విషయము గుటచే, నీవు కళంకములేని దానవయ్యును, జాలిఁజెందిన కారణంబున నది దోషముగాఁబరిణమించి, భవత్కృత్యంబులు భగ్నములైనవి. నీ భక్తికిమెచ్చి యాదోషము తుమించులాగున ననుగ్రహించుచున్నాను. ఇంకపై కడు జాగరూకత గల దానవై వర్తించుచు, ప్రపంచమున స్థిరకీర్తి నార్జించి పుణ్యలోక పదవి కర్హురాలవగు" మని యాదేశించి దిచ్చు మొగమయ్యెను.

ఎఱుఁగక తానొనర్చిన నేరమునకై సాగరిక పశ్చాత్తాపమును బొంది తదాదిగా వాణిదేవి కటాక్ష పాత్రురాలై పతిభక్తియందు మునుపటికంటె నధిక శ్రద్ధను బూని వర్తించుచుండెను. శారదవలన సాగరిక దోషము తెలుపఁబడినదో యాక్షణముననే యిసుక మరల కుండలు చేయుట కనువుగా నేర్పడుటయేగాక పట్టణవాసుల భాండములన్నియు తమకు తామే కుండలుగానై యే వస్తువులతో నెటుల బెట్టియుండిరో, యావిధముననే యమరినవై యుండెను. అందఱును నాశ్చర్యమునుబొంది, భాండములు నశించుటకును, చెడియు నేర్పడుటకును నిమిత్తమైన యా సాగరిక వృత్తాంతమంతయుం దెలిసికొని యామెను పరమానందముతో సంస్తుతించిరి. ప్రజలు పతివ్రతల కేకార్యమును నసాధ్యము గాదనుట స్పష్టముగాఁ దెలిసికొనిరి.

సాగరిక కథ సంపూర్ణము

# 11. చింతామణికథ

కదంబవన మనెడి యొక యగ్రహారము గలదు. అందులో నించుమించుగా నిన్నూరు బ్రాహ్మణ గృహములుగలవు. ప్రతిగృహంబునను బాడియు పంటయు సిరియు సంపదయు సమృద్ధిగాఁగలిగి, యందఱును నిర్విచారులై కాలముఁ గడపుచుండిరి. అట్టి సంపన్నమైన యగ్రహారములో నూరికి కడపట ప్రభాసుఁడను విప్రోత్తముఁ డొకఁడొక చిన్నయింట వాసముఁ జేయుచుండెను. అతని భార్యపేరు చింతామణి, నిండుగా పండిన

ఫలవృత్తమున, దయహీనమగు పిప్పికాయవలె యాగ్రామమున నతండు మిక్కిలి దరిద్రుండై, పూటగడచుటయే కష్టముగానుండుటచేతను, యే వృత్తినవలంబించుటకును దెలియనివాఁడగుటచేతను, నిత్యోపవాసములు జేయుచు, తుదకు తండుపాదానవృత్తి నవలంభించి యాయగ్రహారములో విప్రులయిండ్లకుఁబోయి ముష్టిం దెచ్చుకొని, దొరికిన గింజల నన్నముగానో గంజిగానో చేసికొని యాకలిఁ దీర్చుకొని, "కృష్ణా! రామా! గోవిందా!" యని భగవంతుని ధ్యానించుచుండు ఆసజ్జనుని భార్య మహాప్రఖ్యాతిఁ జెందిన పతివ్రత. ఆమెసర్వదా పతికి శుశ్రూషఁ గావించుచు, సదాచార ప్రవర్తనఁ గలిగి దైవభక్తిగలదై వర్తించుచుండును. ప్రతిదినమును తనపతి యుపాదానమునకుఁబోయి తెచ్చినగింజలను పచనము జేసి, భర్తను నతిథులకునుం బెట్టి శేషించియుండెనేని తాను భుజించును మిగులకున్నచో నాఁడు నిరాహారియై క్షుద్బాధకు లొంగక భుజించిన దానివలెనే నటించుచుండును. ఆసాధ్వీరత్నము తమకుఁగలిగిన లేమిడిని దలంచి, స్వప్నమందైనను చింతనొందునదిగాదు. కష్టసుఖంబులు భగవత్సంకల్ప ప్రకారం సంభవించుననియు, ఎవ్వరెవ్వరు చేసిన పాపపుణ్యములెట్టివో వాని ననుసరించి సుఖదుఃఖములు గలుగుచుండుననియు, సుఖము గలిగినపుడు సంతసించుటయు కష్టకాలమున దుఃఖించుచు తమ కర్మఫలమగుటఁ దలంపక నిర్మలుండైన భగవంతుని నిందించుటయు నవివేక లక్షణమనియు నామె యెఱింగిన దగుటచే నిర్వికారచిత్తయై సదా సంతుష్టియు సంతోషమును గలిగియుండెను.

ఈరీతి నావిప్రదంపతులు కాలము గడుపుచుండఁగా పూర్వకర్మమోయనఁదగి యున్నట్టుండి ప్రభాసునకు రెండుకండ్లును దృష్టిచెడి యంధత్వము సంభవించెను. ఇంక నేమిగతి? ఉపాదానమునకుఁ బోవుటకు నయిత మతనికి సాధ్యము గాదయ్యెను. పోకయుండిన జరుగుట యెట్లు? అన్నాతురులై, యింటి కెవ్వరేని వేళకువచ్చినచో వారి కిడుటకు గతియేమియున్నది? సదాచార సంపన్నుండును, సుగుణవంతుఁడునైన, యాసాధు వర్తనుఁడు ప్రభాసుఁడు తనకు సంభవించిన యంధత్వముం దలంచి యాత్మార్థమైన విషయ మెట్లుండినను, నతిథి సత్కారముఁ జేయుటకు మార్గము లేకపోవుటనెంచి మిక్కిలి చింతాక్రాంతుఁడై, యటువంటి దుఃస్థితిని తనకు గలిగించినందుకై భగవంతునిం దలంచి స్వాపరాధములను క్షమించి యేదైన దారిఁ గలిగింపుమని మొఱఁబెట్టుచుండెను.

ఇంక జీవనమెట్లు జరుగవలయును? అతనిస్థితి మిక్కిలి కష్టముగా నేర్పడినది. పాపము. చింతామణియే పెందలకడ లేచి యింటిపనులుదీర్చు కొని వల్లభునకుపచారములు గావించి యూరిలోని కరిగి బ్రాహ్మణ గృహములలో వారి వారికి నేదైనం గావలసిన పనులుచేసి, తదర్థమై వార లొసంగెడి బియ్యము పప్పు మొదలగు సామగ్రులం గొని మధ్యాహ్నమునకు వచ్చి, స్నానముచేసి తెచ్చిన పదార్థములను వండి పెట్టుకొని, పిమ్మట గౌరీశంకరుల నర్చించి షోడశోపచారము లొనరించి, యతిథులు వచ్చినచో సిద్ధముఁ జేసియున్న పదార్థములలో వారికిని తన భర్తకును బెట్టి సంతుష్టులను గావించిద్దైనంతట మిగిలియుండు పదార్థమును చాలినను చాలకున్నను వగవక భుజించి సంతోషముతో పతిని సేవింపుచుండును. ఆహా! ఆపతివ్రత శీలమెంత పొగడినను బొగడవచ్చునుగదా? ఏకాహారాశనమేగాని యాదంపతులకు రెండు పూటలను భోజనములేదు. ఒకపూట మాత్రము పయిఁజెప్పిన చొప్పున భుజింపుచు వారు కాలముఁ గడపుచుండిరి.

కొంతకాలము యీ క్రమమున జరిగినది. పరమసుశీలయైన చింతామణి వర్తనమును, దైవభక్తియు, పతిభక్తియు, సుగుణములును నెంతయు నాశ్చర్యకరములై చూపట్టుచుండెను. ఒకనాఁడా సాధ్వీమణి పార్వతీ పరమేశ్వరులను వాడుక చొప్పునఁ బూజించి పెక్కు తెఱంగుల స్తుతించి తనపతిసేవఁ గావించుచుండు సమయమున, నామె పూజాస్తోత్రాదుల కెంతయు సంతసించినదై కాత్యాయని నీదేని భర్తనుజూచి "ప్రాణేశ్వరా! నీవు దయాసముద్రుండవు. కలుషహరుండవు. భక్తవరదుండవు. ఎవ్వఁడు చిత్తశుద్ధిగలిగి పరమభక్తిసంకలిత స్వాంతుఁడై నిన్ను ధ్యానించునో, పూజించునో, సేవించునో, కొనియాడునో, యటువంటి పుణ్యునకు నీవు సులభుండవై సకల పాపములును, దుఃఖములును తొలగించి వాంఛితార్థము లొనఁగూర్చి సంరక్షింపుదువని నిన్నుఁగూర్చి వేదంబులును, శాస్త్రములు నుద్ఘోషించుచున్నవి. జగన్నాయకా! ఇటువంటి కృపామూర్తివయ్యును, నాశ్రితజన మందారుండవయ్యును, దాసప్రసన్నుండవయ్యును సదా మనల నమ్మి పరిశుద్ధచిత్తముతో పూజింపుచు, చింతించుచు, సేవింపుచు, వర్తించుచున్న పుణ్యశీలయగు చింతామణియందును, విమల గుణాకరుండైన యామె పతియందును నించుకైనను కనికరమును జూపక నిర్దయునివలెనుండుట న్యాయమని తోఁచెనా? అయ్యో! పాపము

వారికష్టములు వర్ణింప నలవిగానివై యున్నవి. ఎన్నిసంకటములకులోనై యులయుచున్నను, వారు మనయందలి భక్తిపీడక, నిరంతరము నారాధించుచుండుట తలపవలదా? దేవా! ఈ విషయము నామనంబున కెంతయు సంకటము, కలిగించుచున్నది. ఇంకనైనను, పరమభక్తులగు వారి కష్టములు దీర్చి రక్షింపుము. 'అక్కఱకురాని చుట్టము, మొక్కినవరమీని వేల్పు' ఇట్టివారిని 'గ్రక్కున విడువంగవలయు' అని నీతివాక్యముండినను, సుస్థిరచిత్తులై చింతామణీ ప్రభాసులట్టిమాటలు పాటింపక తమకు మనమే గతియనెడి నిశ్చయముతో సేవించుచుండగా, నీమానసం బేల కరుంగకున్నది స్వామీ! యాదంపతుల వెతలు నివారించ ప్రార్థించుచుండెడి పరమ భక్తుల కనికరించి రక్షింపవలయునని వేడుచున్నాను. నా విన్నపము సంగీకరింపుము'' అని విజ్ఞాపించెను. సాధుజన వశంకరుండైన శంకరుండా యపర్ణపలుకులువిని మొగంబునఁజిఱునగవు మొలకలెత్తగా కృపాలోకనంబులనామెవంకఁగనుంగొని మధుర భాషణంబుల నిట్లనియె.

"హైమవతీ! సాధారణముగా స్త్రీలు, తమ వంటివారి కేరికైనను నేదేని సంకటము గలిగినచో, యటువంటివారి పక్షము నవలంబించి మాటలాడుట వాడుక. కావుననే చింతామణి సంకటములు నివారింపు మని పలుకుచున్నావు. కరుణారస పూరితమైన చిత్తము గలదానవు గదా? సర్వమంగళవగు నిన్ను నమ్మి పూజించుచుండువారలకు యిష్టార్థములు గలుగకుండుటెట్లు? నీకు కనికరము గలిగినంతనే చింతామణీ ప్రభాసుల వెతలు పటాపంచలయినట్లు భావింపవలయును. సరి! కానిమ్ము భవదభీష్టమెట్టిదియో యావిధముననే జరుగును గాక, అర్ధాంగీ! ఆ విప్రదంపతుల భక్తిశ్రద్ధలును, మన యందుగల నమ్మకయు నేను తెలియక యూరకున్న వాఁడఁగాను. వారి పురాకృత పాపము నివృత్తియైనఁగాని మేలుచేయరాదని మిన్నకుంటిని మనలసేవించుటంబట్టి వారి కిల్బిషములన్నియుం దొలంగిపోయినవి. ఎవరికిగాని వారి వారి పుణ్య పాపానుగుణ్యములై నకష్టసుఖములు గలుగుచుండును. ఇంతవరకును, మన భక్తులగు విప్రదంపతులు పాపఫలమైన కష్టము ననుభవించిరి ఇంక నీకు కృపగలుగుటచే సౌఖ్యమనుభవింపఁగలరు, కాని దీనికి నేనొక పన్నుగడఁ దలంచినాను, దానిని విను'' మఱి యిట్లనియె. "మన మిరువురమును, మొదట వారి చిత్తశుద్ధియు, నడవడియును బరీక్షించుదము. మన శోధనకు వారు తొలంగక నిలిచి

లేని పిమ్మట సకల సంపదలును గలుగులాగున ననుగ్రహింపుదము. ఇటుల భక్తులను పరీక్షించుచుండుట నాకు వాడుకయగుటచే నీ తెఱంగును నీతో చెప్పినాడ సుమీ!" అని చెప్పెను. పార్వతి నవ్వుచు "సర్వేశా! మీసంకల్పమునకు అన్యథా కలుగునా? చిత్రము వచ్చినట్లు చేయుము" అని పలికెను.

కొలఁది దినములు జరిగినవి. ఒకనాఁడు చింతామణి వాడుక ప్రకారము యింటికార్యములు దీర్చుకొని యూరిలోని వారియిండ్ల కరిగి వారికి సహాయముగా చెప్పిన పనులుచేసి, వార లొసంగిన తండులములును, సామగ్రియుం గైకొని రెండుజాములవేళకు యిల్లు జేరి పతికి స్నానముఁ జేయించి యాహ్నికమునకు వలయువస్తువులను, తానును స్నానమాడి తెచ్చియుంచి, యతండు జపముఁ జేయుచుండగా వంటకు ప్రారంభించి శీఘ్రముగా కలిగినట్టుల సిద్ధముజేసి, దేవపూజను జరిగించి, కాలము మించుచుండినను, నతిథు లెవ్వరైనను వత్తురేమో యని యించుక తడవు వాకిటఁజేరి నిలిచి చూచుచుండెను.

అపుడు మిక్కిలి వృద్ధులైన బ్రాహ్మణ దంపతు లామెకు గాన వచ్చిరి. బ్రాహ్మణుండు నడువఁజాలక తొట్రుపడుచుండఁగా భార్యతానును నట్టిస్థితిలోనే యుండినను, యెట్లో భర్తచేయిం బట్టుకొని మెల్లగా నడిపించుచు దోడ్కొనివచ్చి, చింతామణి మందిరపు పంచ తిన్నెపై గూర్చుండబెట్టెను. ఆ ముసలి విప్రుడు మిక్కిలియు నాయాసముతో మాటలు తడబడుచుండఁగా "పరమేశ్వరా! హరీ! నారాయణా!" యని పలుకుచు కూర్చుండలేక కాళ్ళుజాచుకొని పరుండెను. మఱియొకవైపున తిన్నెమీద వృద్ధముత్తైదువ కూర్చుండి మిక్కిలి దైన్యముతో నారాయణ స్మరణముఁజేయుచుండెను. అంతటి దీనస్థితిలో నుండువారును, తన యింటికి వచ్చినవారు నయిన యావృద్ధులంజూచి, చింతామణి మిక్కిలి జాలిఁబొంది, వృద్ధురాలింజూచి "ఓయమ్మా! మీరెవ్వరు? ఎందుండి వచ్చితిరి? అకాలమైనదే! ఇంతవఱకును మీరు భుజించినట్లు తోఁచలేదే భాగ్యవంతులైన యెందఱు బ్రాహ్మణులున్న యీ యూరిలో పండు ముదుసలులైన మీకు భోజనము లేక పోయినదా?" అని అడిగెను.

వృద్ధబ్రాహ్మణి:—మేము యెవ్వర మగుటయు నెచ్చటనుండి యెచ్చటికిబోవుచుండి యీయూరికి వచ్చినదియు, నీతో చెప్పవలయునని నతో మాసమాచార మల్పమైనది కాదు. కొండంత యున్నది. మాదు

దినంబులనుండి నిరాహారులమై, మాటలాడుటకే శక్తిలేకున్న మేము నీ వడిగిన ప్రశ్నలకు జవాబుఁ జెప్పఁదగిన స్థితిలో లేము. నీవు కడుపుణ్యాత్మురాలవు కాఁబట్టి మాపంచలో పరుండుటకైనా నొప్పుకొంటివి. ఇది మేలు.

చింతా:—అయ్యో! అమ్మా! ఎట్లా? మూడు దినములనుండి యాహారము లేదా? ఏమీ! దొరకనందునా? వేఱేదైనఁగారణము కలదా?

వృద్ధ:—దొరకకుండుటయే కారణము. వేఱుగానేమి యున్నది?

చింతా:—దొరక లేదా! ఇంతకుముందు దొరకకుండినను, నేడు ఇంతటి గొప్పయూరిలో కలిగియున్న యందఱు బ్రాహ్మణుల యిండ్లలో పట్టెడన్నము లేకపోయినదా? పెట్టలేక పోయిరా? మీరుపోయి యడుగ లేదు కాఁబోలు, వింతగా తోచుచున్నది.

వృద్ధ:—వింతయే! అడుగలేదనెదవా? ఆదుఃఖమును చెప్పుటయే కష్టముగా నున్నది. నేడు మాపాట్లు దేవునకే యెఱుక. అమ్మా! నాస్థితియెట్లుండినను, యీవృద్ధుడు, నకనకలాడి క్రిందఁబడిపోవుచుండగా చూడలేక నేను మెల్లగా బట్టుకొని నడిపించుచు, యీపాడు గ్రామములో ప్రతియింటికినిఁ బోయి పట్టెడన్నమును బెట్టుఁడని యడిగితిని. హరిహరీ! ఎంతటి పాపకర్ములో? శరీరమును విడిచిపోవునపు డేమిమూట గట్టుకొని పోయెదరో! గాని, ఒకరైనను పిడికెడు మెతుకులు బెట్టుటకు సమ్మతింపరైరి. నేను వేడుటకు రాయియైనఁ గరంగును, కాని వారి మానసములు గరంగవయ్యెను.

చింతా:—ఔరా! ఔరా! ఆశ్చర్య మాశ్చర్యము. ఇది యెంత పాపమనవలయును.

వృద్ధ:—పాపమో, పుణ్యమో, తలంచినవారికికదా యీమాట వేళమించి పోయినదనియు, మిగుల లేదనియు, నేఁడు వంటయే చేయలేదనియు, 'దిక్కుమాలిన బ్రాహ్మణుల యుపద్రవ మెక్కుడైనది. వేళపాళ లేదు. తోచినపుడు వచ్చుచుందురు. వీరికై వండివార్చి పెట్టి కుంభము తోడు రని కాఁబోలు, అట్టె దినమును రావడమే! ఇల్లుఁ గట్టుకొని సంసారము చేయువారికికదా కష్టము తెలియును, పోపొండు' అని పలుకువారును 'ఇశీ! మాయింట నన్నము లేదు పొమ్మ'ను వారును, కుక్కముట్టినయన్న మున్నది. అది కావలసిన పెట్టెదము' అనువారును

కడప మెక్కుటకుపూర్వమే తలుపు మూసుకొనువారునై నిరాకరించి నారు. పెద్దయూరైననేమి? భాగ్యవంతులైననేమి? పట్టెడన్నమూకలి గొనిన వానికిఁ బెట్టలేని భాగ్యమేమిటికి? గ్రామమంతయుం దిరిగి నిరాశఁ జేసికొని కొంతతడ వెవరివాకిటనైనను బరుండి పిమ్మట లేచి యెచటికైనం బోవచ్చునని యెంచితిమి. కాని ఆపుణ్యాత్ములు దానికి సయితము సమ్మతింపలేదు. తమ వాకిళ్ళలోనుండ రాదని తరిమినారు. మఱి నిలువ చోటులేక వచ్చుచు యిచ్చట మీాయిల్లు చూచి సీముఖమును గనఁగా యోగ్యురాలవుగా తోచినందున మెల్లగా వచ్చి విశ్రమించితిమి. కొంత తడవుండి లేచిపోయెదము కోపింపకుము'' అనియెను.

చింతామణి ''ఆహా! ఇది యెంత పాపము? ఎంతటి యన్యాయ మనవలయును? ఈ గొప్ప యూరిలో నిందఱు బ్రాహ్మణుల గృహంబు లుండుచోట రెండుజాముల వేళయాకలిగొని వారియింటికి వచ్చిన ముదుసళ్ళకు యింత కూడఁబెట్టి యాకలిదీర్చి యాదరింపక పొమ్మని చెప్పిరి గదా! అతిథులకు నభ్యాగతులకును నొకింత యన్నముఁ బెట్టిన నష్టము కలుగునా, పాపమువచ్చునా? రామ రామ మిమ్ము జూచిన నా కడుపు దహించుకొని పోవుచున్నది. ఇప్పుడే ప్రాణములు విడుచువారివలె గను పట్టుచున్నారే! కటకటా! ఓయమ్మా శీఘ్రముగా లెండు లెండు. మెల్లగా లోపలికిరండు, నేను వంటచేసియున్నాను సిద్ధముగానున్నది. ఆకలివేళకు ఆకో, ఆలమో, యేదో యొకటిమాయింటగలిగినది పెట్టెదను. భుజించి కొంత తడవు విశ్రమింపుఁడు. బడలికతీరును, తడవుఁ జేయకుఁడు'' అని కడు వినయముతో, భక్తితో, ప్రియముతో ప్రార్థించి వేగిరించను.

ప్రభాసుండు భార్యవలన వృత్తాంతమెఱింగి మిక్కిలి పరితాపమును జెంది, ''వేగిరము యావృద్ధున కన్నపానము లొసంగి పిమ్మట మఱియొక కార్యమును జేయవలసిన'' దని చెప్పెను. ఆ గృహస్థులు తమ యెడలఁ గనబఱచిన శ్రద్ధకు సంతసించి యామువ్వురు లేచి భర్తను పట్టుకొని లేవఁదీసి మెల్లమెల్లగా నింటిలోనికిఁబోయెను. వారు లోపలఁబ్రవేశించుటకు లోపలనే యిరువురకును, కాళ్లుచేతులుఁ గడుగు కొనుటకు నీళ్ళు దెచ్చి పెట్టి, విస్తళ్ళువేసి పీటల నునిచి మంచినీరును పరిశుద్ధ పాత్రలోఁ దెచ్చిపెట్టి చింతామణి వడ్డించుటకు సిద్ధముగాఁ గాచి నిలిచియుండెను.

తిన్నగా ముదుసల్లుహస్తపాదములు ప్రక్షాళనముఁ జేసుకొనివచ్చి తమకుగా నిర్ణయింపఁబడిన పీటలపైఁ గూర్చుండిరి. అప్పుడా వృద్ధబ్రాహ్మ ణుడు యింటి యజమానునకును విస్తరివేసి వడ్డింపుమనిన తమయింటఁ జేసియున్న పదార్థము లందఱకనుచాలునో చాలకపోవునోయనెడి సందే హము గలదై, తనపతి యభిప్రాయమును మున్నే తెలిసికొనియున్నదగు టచే యావృద్ధునితో "స్వామీ! మాకింత యవసర పడవలసినది లేదె. మీరన్ననో మూడునాళ్ళనుండియు పస్తుపడియున్నవారు. కావునముందు గా మీరు భుజింపుఁడు. మేము తరువాత భోజనముఁ గావించెదము" అని కడువినయముతో జెప్పి వారికి, చేసియున్న వస్తువులను వడ్డించెను.

ఎక్కువ యాకలిగొనియున్న వారగుటచే వారు వడివడిగా భుజింప నారంభించిరి. ముసలి బ్రాహ్మణు డాపునాపున రెండుపిడుచల యన్న మును నోటఁ బెట్టుకొని మ్రింగెను. ఆనీరును లోనికి దిగినది కాదు. గొంతు నడుచుకొని యూపిరిద్రిప్పకొనుటయే కష్టమైనది. కనుగ్రుడ్లుదిరిగివచ్చెను. తనుచెమర్చి వడంకసాగెను. మాటలాడ లేకపోయెను. అతినిస్థితి యట్టి దైనది. తటాలున క్రింది కొఱిగెను. శ్వాస యతిశయించినది. భర్తకుఁ దొడరిగిన యుపద్రవస్థితిని గాంచి వృద్ధముత్తైదువ దిగులును దుఃఖమును నతిశయింపఁగా "అయ్యో! ఇంక నేమిగతి గలదు? దైవమా! ప్రాణమును నిలుచునట్లుండలేదే! ఏమిచేయుదును? సర్వేశా! నీవు సర్వజ్ఞుండవు. సర్వ రక్షకుఁడవు. దీనమందారుండవు నాపతిని సంరక్షింపు" మని రోదనముఁ జేయఁదొడంగెను. ఆమె భీతివ్యర్థము కాలేదు. సార్థకమేయైనది. అట్లు కొన్ని నిమిషములు కాళ్ళు చేతులును గుంజుకొనుచుండి యంతట చలన మడంగి వృద్ధవిప్రుండు ప్రాణములు విడిచెను.

ఇంక నమ్ముదుసలి బ్రాహ్మణి దుఃఖమునకు మేరలేకుండెను. ఏమే మియో విషయములం దలంచి పలుకుచు భర్తనుగూర్చి విలపింపసాగెను కన్నులులేని ప్రభాసుండు భార్యవలన జరిగిన వృత్తాంతమును దెలిసికొని యధికదుఃఖమును బొంది 'పాపక్షయార్థము గంగలో మునఁగగా, వంశ క్షయార్థము మొసలిగొనిపోయె' ననెడి సామెతవలె జరిగినది. అన్నము బెట్టి మహాపాపము నొడిగట్టుకొంటిమి. దీని కేమిచేయుదు" మని పరిత పింపఁ దొడంగెను.

చింతామణియన్ననో, ఆమెకుఁ దొడరిన దుఃఖమును మనస్సంకట మును వర్ణింప నలవిగాకుండెను. భర్తదగ్గరకుబోయి కడుదైన్యముతో

"ప్రాణనాథా! ఇంకకర్తవ్యమెయ్యది? మూఁడునాళ్ళనుండియును భోజనము లేదనియు నెవ్వరును నన్నముఁబెట్టరైరనియుం జెప్పి వాకిటిపంచలోఁ జేరిన పండు ముదుసల్లి కడువాడి యున్నవారు, వేళకు మన యింటికి పిలిచినట్లు వచ్చినారు. ఆతిథ్య మొసంగుటకుం దగినవారనియు, మన పుణ్యవశమున మంచి యతిథులు నేఁడు లభించిరనియు దలంచి యాదరించి ఏదో మనయింటఁ గలిగిన యాకో యంబలియో, గంజియో యింత భక్తితోఁ బెట్టితిని ఏమిపాపమోగాని యావృద్ధుండు భుజించునన్నము మ్రింగుడు బడక క్రిందబడి తన్నుకొని ప్రాణములువిడిచెను. అతని భార్య దుఃఖము తీరునదిగా నుండలేదు. ఏమి చేయుదును? మీరన్నో యంధులుగా నున్నారు. నేనో యాడుదానను. వీరియొద్ద నేదేనియును సొత్తుగలిగియుండుటంజూచి పేదవారమగుటచే దానిని హరించుటకై మనమే చంపితిమని లోకులు యెట్లు తలంపుదురో, మనస్థితినిఁబట్టి యావిధమున నెంచినను నన్యులు తలంపవచ్చును గదా! ఎట్లు? జరుగవలసిన విధము తోఁచకున్నది. బుద్ధిపూర్వకముగా నింతటి యాపదయును, కష్టమును పాపమును దెచ్చుకొంటిమి. శివశివా! మంచికార్యమని చేయఁబూననది చెడ్డగాఁ బరిణమించినది. మనలశోధించుటకై దేవుఁడేయిటువంటికష్టములను గలిగించుచున్నవాఁడేమో తెలిసినదికాదు. వృద్ధబ్రాహ్మణుఁడు చచ్చిపడియున్నాఁడు. అతని యిల్లాలు దుఃఖసముద్రములోఁ బడి యల్లాడుచున్నది. ఎంతటి సంకటమునకు పాలైతిమి? మీరేమి చెప్పెదరు?" అని మిక్కిలి దైన్యముతోఁ బలికి యడిగెను.

అంధుడైన యతడు మాత్రమేమిచేయును? దిగులొంది కుప్పకూలి గుటకలు మ్రింగుచు, నేయుపాయంబునుం దోచక కూర్చుండి మాటాడ లేకుండెను. ఏయుపాయంబును వెదకినను నింక చింతామణియే యాలోచింపవలసినదయ్యెను. కొంతతడవు మహాపతివ్రతయైన యామె తనలో చింతించి, తుదకొక నిర్ధారణచేసికొనెను. ఆమె పరిశుద్ధచిత్తయై, శర్వాణీ శంకరులను ధ్యానించి పరమభక్తి కలితస్వాంతయై స్తోత్రమొనరించి "పురాణదంపతులారా! భక్తపరాధీనులారా! దాసురాలనగునాకుఁదొడరిన యపవాదము పాపమునుం దొలగింపుడు. నాపై కృపాదృష్టులు పరగించి ఈ కష్టసముద్రములో నుండి దరిచేర్పు"డని పలుతెఱంగులఁ బ్రార్థించి, యధికదుఃఖములో నల్లాడుచుండెడి వృద్ధురాలి నూఱడించ తిన వల్లభుని పాదంబులు మనంబునఁ దలంచి, యమ్ముహూనీయునకు ప్రద

క్షిణ నమస్కారములు గావించి పుడిసిట పవిత్రజలంబులుగొని "లోకకర్తలును, రక్షకులునైన పార్వతీపరమేశ్వరులారా! సూర్యాది నవగ్రహములారా! పంచభూతములారా! సర్వకాలసర్వావస్థలయందును నేను పతినే దైవముగాభావించి నిర్మలచిత్తనై సేవింపుచుండుదాననేని, కపటకుత్సితము నెఱుంగక వర్తించుచుండుదాన నగుదునేని, సదా దైవభక్తిగలిగి భక్తితోఁ బూజించుచు, వారికృపకు పాత్రురాలనగుటయే నిక్కమగునేని, పతివ్రత సాధ్వియను పేరులొందుటకు నే నర్హురాలనే యగుదునేని, నాయొక్క విభుండు పుణ్యశీలుం డగునేని, నే నొసంగిన యాతిథ్యముంగొని భుజించుచు, హటాత్తుగా మృతినొందిన, ఈ పుణ్యాత్ముండు, ఈ వృద్ధబ్రాహ్మణుండు ప్రాణములొంది లేచునుగాక, ఇతని మృతివలన దొడరిన పాపమును, నపవాదమును నాకు తొలంగిపోవును గాక" అని ప్రమాణపూర్వకముగాఁ బలికి చేతఁగొనిన జలంబులను మృత కళేబరంబుపై ప్రోక్షించెను.

ఆశ్చర్యమాశ్చర్యము! ఆమె పాతివ్రతమహిమ యెట్టిదో కాని ప్రోక్షింపబడిన నీళ్ళు మీఁదపడఁగానే మరణించిన యాద్విజుండు జీవములు బడసి, యటు నిటు కదిలి కన్నులువిచ్చి చూచి లేచి నిద్రితుఁడు మేల్కానిన చందమున కూర్చుండెను. అతనిభార్య అత్యాశ్చర్యమును బొంది యాపుణ్యవతినిఁగొనియాడి "అమ్మా! నీవంటి పతివ్రతలోకంబున గలుగఁబోదు నీ మహిమ యతిశయమైనది. మృతులను బ్రతికించు శక్తి నీకుఁగాక మతి యేయతివకు గలుగును? బళి! పుణ్యవతీ! నిన్ను గొనియాడుటకు నావంటి దానికి శక్యముగాదు. నాపతిని బ్రతికించి నా యెడరు మాన్పితివి. నీకీర్తి లోకంబున శాశ్వతమై నిలుచునుగాక నీకును నీపతికిని స్థిరమైన పుణ్యలోకము సిద్ధించునుగాక" యని పలికెను.

ఇటుల నావృద్ధురాలు పలుకుచుండఁగానే దిగ్గనయాభార్యాభర్తల రూపము లదృశ్యములయ్యెను. అట్టె నిలిచి చూచుచున్న చింతామణి యాయద్భుతప్రకారముఁగని యత్యాశ్చర్యమునొంది తనలో 'ఏమీ! ఎటుపోయిరి? ఇంతిలో మాయమైన విధమెట్టిది? ఆలోచింపఁగా వీరు నిజమైన వృద్ధబ్రాహ్మణ మిథునముగా దోఁచకున్నదే! నాశీలమును బరీక్షించుటకొఱకు సంతతమును నేను బూజించు పార్వతీ పరమేశ్వరులే యిట్టిరూపముదాల్చి వచ్చిరి కాఁబోలు, కాకుండిన మనుజులే యైనచో యింతలో నదృశ్యమైపోవుటకు శక్యమగునా? ఆహా! ఎంత చిత్రము?'

అని తలంపుచుండఁగా అంతలో మెఱుపు మెఱిసినలాగున, కన్నులు మిఱుమిట్లు గలుగునట్టి యొక వెలుఁగుదోఁచెను. ఆ సాధ్వీమణి భ్రమసి, యది యేమగుటయుం దెలియక తత్తఱిల్లుచుండఁగా, నందివాహనా రూఢులై మహాతేజముతో, ఉమామహేశ్వరులామెకఁ బొడసూపిరి.

వివేకవతియైన చింతామణి లక్షణములనుబట్టి తనకుదోఁచినవారు గౌరీశంకరులని తెలిసికొని తనయందు కరుణించి దర్శన భాగ్యమును గలిగించిన యాపురాణదంపతులకు సాష్టాంగ నమస్కృతులొనరించి, పరమ భక్తికలితచిత్తయై కరములు ముకుళించి కొలిచి యిట్లని స్తోత్రముఁ గావించెను.

"సీ॥ జయజయ శంకర! ♦ జయహిమాచలసుతా!
జయజయ పరమేశ! ♦ జయ భవాని!
జయజయ శితికంఠ! ♦ జయ సర్వమంగళా!
జయజయ పురహర! ♦ జయము దుర్గ!
జయజయ వృషభవాహన ♦ జయశంక రార్ధాంగి!
జయజయ పురహర ♦ జయ యపర్ణ!
జయజయాహీన్ద్రభూష ♦ జయము దాక్షాయణి!
జయజయ ఫాలాక్ష ♦ జయము గౌరి!
గీ॥ భక్తజనులను బ్రోచుమీ ♦ పాపములను
సంస్తుతించెద నిర్మల ♦ స్వాంతమగుచు
సకలదోషంబులను మాన్చి ♦ సంతతంబు
నొసరమీ సేవ యనుభాగ్య ♦ మొసఁగుఁడెలమి.
మ॥ పరమానంద చిదాత్ములార! మిముసం♦భావించెదన్ సద్గుణా
కరులారా! సుచరిత్రులార, త్రిజగ♦త్కళ్యాణులారా! మహా
కరుణామానసులార! నిర్మలశుభా♦కారంబు లొప్పారునో
గిరిజాశంకరులా! మాన్పుఁడుదయన్ ♦ క్లేశంబులన్ నామదిన్.
క॥ త్రిజగములకు కర్తలు మీ
రజముఖ్యామర చయార్చి ♦ తాంఘ్రులు మిమ్మున్
భజియించెద సంస్కృతిదుః
ఖజపరితాపంబుఁదొలఁచి ♦ గావుడు నన్నున్.
శా॥ ఘోరంబై సకలాఘ సంఘటనమై♦కూలంబు లేకున్న సం
సారాగాధ సముద్రమందుఁబడిని♦చ్చల్మగ్నులై చిక్కమి

మన్నారాధింపరు పామరుల్ సకల కష్టాయాస సంతాపముల్
వారల్ పొందుదు రట్టిసంకటములన్ వారించినం గావరే!"

అని యివ్విధంబున స్తుతించుచున్న సాధ్వీమతల్లియైన చింతామణిని కృపావలోకనంబులంగాంచి యుమామహేశ్వరులు సంతుష్టినొంది యాదరించిరి. అట్టియెడ పరమశివుని యనుమతంబున మహాకాంత యప్పుడతింజూచి యిట్లు పలికెను. "శీలవతీ! చింతామణీ! ముల్లోకంబులందును పొగడఁదగిన మహాపతివ్రతవనుటకు నీవే తగినదానవు. నీకుఁగల భక్తికిని దేవతాభక్తికిని మేము సంతుష్టులమైతిమి. భవత్పతిభావంబును మహిమయు చిత్తశుద్ధియు బరీక్షించుటకై మేము వృద్ధభూసుర దంపతులవలెవచ్చి నిన్ను శోధించితిమి. మేము జరిగించిన రీతినెల్లను నీవెఱుంగుదువుగదా? ఎవరియందు మాకు కృపగలుగునో, యట్టి వారి శీలమును శోధించి వారికి మేము సర్వాభీష్టములు నొసంగుచుందుము. పూర్వకృతంబైన యల్పపాపంబువలన మీరు లీలాగున కొంతకాలము దారిద్ర్యము ననుభవింపవలసి యుండినది. ఆ పాపము లిపుడు తొలంగినవి. మీకు మంచికాలము తటస్థించినది. యువతీమణీ! వలయు కోరికల నడుగుము. ప్రసాదించెదము" అనెను.

పార్వతీదేవి కృపాయత్తచిత్తయై పలికిన మాటలు విని చింతామణి పరమానందమున నుప్పొంగి కన్నుల సంతోషభాష్పములు జారుచుండఁగా ముకుళిత హస్తయై "తల్లీ! పరదేవీ! భక్తపరాధీనవగుటచే సేవకురాలనగు నాయందు కనికరించి భవదీయ దయార్ద్రచిత్తమునకు దగినమాటలు చెప్పితివి. లోకమాతా! అయినను నాకొక కోరికయు గలుగదు. ఈ పాపభూమి నుద్భవించి యిప్పటివరకును నేననుభవించిన దోషఫలంబులు చాలును. మీపావన స్వరూపంబులం గాంచిన యీనా కన్నులతో నింక నన్యులను చూడనొల్లను. ప్రపంచమున నుండనొల్లను నా విజ్ఞాపనము నంగీకరించి కరుణించి యింతటితో నన్ను నాభర్తృ సహితముగా మీ సన్నిధానమునకుఁ జేర్చుకొని పాలింపుము. ఇది నా కోరిక" యని విన్నవించెను.

కాత్యాయనీదేవి యామె పలుకు లాకర్ణించి మందహాస మొనరించి "గుణవతీ! నీమంచి తలంపునకు సంతసించితిని కాని యటు చేయుట కిపుడువలనుగాదు. కొంతకాలము మీరు సౌఖ్యము లనుభవించుచునుండి యంతట నీవును, నీభర్తయును సాయుజ్యపదవి నొందగలరు. మీకు సక

లైశ్వర్యములును, నాయురారోగ్యభోగములును, ధర్మచింతయుం గలుగునట్లును, భవద్వల్లభుని యంధత్వము తొలంగునట్లును వరంబు ప్రసాదించితి, సుఖులరై యుండుండు, కాలాంతమున మాస్థానమునకుఁ జేరుదురుగాక'' యని యాదేశించెను. అంతలో ప్రభాసునకు కండ్లచూపు గలుగుటయు, దివ్యమంగళ స్వరూపులైన భవానీశంకరులను సందర్శించి యనేకవిధంబుల స్తోత్రముఁ జేసెను.

అప్పుడు, చండికా చంద్రశేఖరుల మీఁదను, చింతామణి ప్రభాసుల మీఁదను మింటనుండి దేవతలు పుష్పవర్షము గురియించిరి. దేవదుందుభి రవంబు లెసంగెను. అచ్చర లాడిరి. గంధర్వులు పాడిరి. తత్సమయంబున నీశ్వరుండు నీశ్వరియు వేల్పులు జయధ్వానములు చేయుచుండఁగా నందివాహన సహితులై యంతర్ధానముఁ జేసిరి. వాలంగూర్చి యావిప్రమిథునము పునఃపునః ప్రణామంబు లాచరించి, తాము కృతార్థు లయితిమని సంతోషించిరి.

అంబికా ప్రసాదంబున సకలసంపదలునుం దమ యంతట బొసంగుటయు నచ్చటి సంపన్ను లందఱికంటె నధికులై ప్రసిద్ధిగాంచిరి. అంతటి మహాదైశ్వర్యవంతులైనను, చింతామణి ప్రభాసులు నిగర్వులును,సత్ప్రవర్తనులును సంతత పరోపకార శీలురును, భగవదారాధనా తత్పరులు నగుచు, సర్వభోగములు ననుభవించుచు సుఖంబుననుండిరి. యప్పటివరకును చింతామణి మహిమ నెఱుంగలేకుండినయా యూరివారలపుడామె గొప్పతనముం దెలిసికొని యామెను సామాన్యస్త్రీగాఁ దలంచుచుండిన తమ యవివేకమున కెంతయుం బశ్చాత్తాపమును బొంది తదాదిగా నా దంపతులను దైవస్వరూపులుగా భావించి, వారియెడల భక్తివినయంబులు కలిగి మెలంగఁ దొడంగిరి.

లోకంబున చింతామణి కీర్తి శాశ్వతంబై దశదిశలకును వ్యాపించెను. ఆమె చరిత్రము నెఱింగినవారు తద్విధమున వర్తించి తామును కీర్తి ప్రతిష్ఠలను బొందుటకుఁ బ్రయత్నించి నాఁడుమొదలు సత్పథంబున మెలంగఁ దొడగిరి. స్త్రీజనంబులకు చింతామణి చరిత్రము గొప్ప యాదర్శంబై విస్తరిల్లెను.

చింతామణి కథ సంపూర్ణము.

# 12. కళావతీదేవికథ

శ్రీపురపట్టణాధిపతి విజయాశ్వ చక్రవర్తి. అతని యర్ధాంగి కళావతి మహాపతివ్రత. దాతృత్వమున విజయాశ్వమహీపతి బలి, శిబి, కర్ణ, ధర్మజాదులను మించినవాఁడనియు, పాతివ్రత్యమున కళావతీదేవి, యనసూయ, యరుంధతి, లక్ష్మి, సరస్వతి, పార్వతి, శచి మొదలైనవారిని మించునది యనియు జగత్ప్రసిద్ధి, లోకులెల్లరును నుత్తమ ప్రవర్తనులై యొప్పుచున్న యీరాజదంపతులను సదా స్తోత్రముఁ గావించుచుండిరి. దేవతలు సయితము వారిశీలముజూచి మెచ్చుకొనుచుండుదురు. ప్రతాపవంతుఁ డారాజ శిఖామణి పరమపతివ్రతా తిలకంబగు భార్యతోఁగూడి నిర్వ్యసనచిత్తుండై సకల సౌఖ్యములు ననుభవించుచుండెను.

ఆకాలంబున నొకనాఁడు త్రిలోకసంచారి నారదుఁడు భూలోక పరిస్థితులం గాంచు కుతూహలంబు గలుగుటయు నరుగుదెంచి యందందుందిరిగి విశేషంబులు గనుగొని యంతట వైకుంఠమునకు శ్రీమన్నారాయణ దర్శనార్థియై చనియెను. సుగుణమునిబృంద, భక్తజన, పుణ్యపురుష సమ్మర్ద బహుళంబై యొప్పుచున్న గధరుని నగరును బహుప్రయాసముతో బ్రవేశించి సందుఁజేసికొని మెల్లమెల్లగా, కమలనాభుని సన్నిధింజేరి, ఫణిరాజ పర్యంకంబుపై లక్ష్మీదేవియు భూదేవియు నిరువంకలనుండి సేవింపఁగా, బ్రహ్మరుద్రేంద్రాదులును, తక్కుంగల దిక్పతులును పరివేష్టించి స్తుతించుచుండఁగా, పరమానందంబున నిండు పేరోలగంబున పుండరీకాక్షుని సందర్శించి భయభక్తి వినయ వినమితోత్తమాంగుఁడై స్తుతించి ఫాలతలంబు నేలసోఁక సాగిలఁబడి దండప్రణామంబు లొనరించి ముకుళిత హస్తయుగళుండై నిలిచిన, పరమేశ్వరుండైన రమావల్లభుని మహామునివర్యునిఁ గనుంగొని కృపావలోకంబున నాదరించి యర్ఘ్యాసనంబున నాసీనుంజేసి మందహాస సుందరవదనారవిందసఁ జెలువంబింపు గొలుపుచుండఁగా మృదుమధురంబులగు మాటలతో నిట్లని ప్రశ్నించెను.

"మునికులోత్తమా! త్రిలోకసంచారివి. ఏలోకమునంగాని యెచ్చటంగాని యెట్టివిశేషములు కలిగినను, నదినీకుఁ దెలియక యుండ నేరదు. కాఁబట్టి నేఁటిదిన మెచ్చోట, నేమి వింతలుజూచి వచ్చితివో వినఁగోరితిని చెప్పుము ఇపుడు యెచ్చటనుండి వచ్చుచున్నావు? ఏమైన విశేషములు

చూచితివా!" అని యడిగెను. తనయం దెంతయు నాదరబుద్ధిగలవాఁడై, యివ్విధమున నడిగిన ముకుందుని పలుకు లాకర్ణించి భక్తియుక్తుండై ప్రణామం బాచరించి "దేవ దేవా నీవు సర్వజ్ఞుండవు. సర్వాంతర్యామివి, సకలలోకనాయకుండవు, దయాకరా! భక్తసులభుండ నగుటచే నాయందు కృపాతిశయంబును జూపుటకై భవదీయదాసుండ నగు నన్ను నడిగితివి కాని, నీ వెఱుంగని వింతలును విశేషములు నైనవి యెచ్చోట నుండును? పరమేశ్వరా! అన్నియుఁ దెలిసినవాఁడ వయ్యును నావలన వినవలయు ననెడి తలంపున నడిగినపుడు, భక్తుండనైన నేను తెలిసిన విషయములను విన్నవింపవలసినది విధియగును. కావున నేను చూచినదియు, నపుడపుడుం జూచు చుండునదియు, నాశ్చర్యకరమైనదియు నగు నొక వృత్తాంతమును భూలోకంబునం గల దానిని విన్నవించెదను. ఆ యుదంతంబు నావంటి యల్పుల కతిశయముగా నుండును గాని. దోఁచ నేరదు. అయినను జెప్పెదను. కరుణతో నాకర్ణింపుము అని చెప్పి యీ క్రింద వివరించిన రీతిని విజ్ఞాపన మొనరించెను. ఎట్లు?

అరవిందలోచనా! లక్ష్మీమనోవల్లభా! భూలోకమున శ్రీపుర మనెడి నగరంబు రాజధానిగా విజయాశ్వమహీపాలుఁ డనెడి రాజు కళావతి యను భార్యతోఁగూడి సకల సుఖములు ననుభవించుచు, సత్యము, నీతి, యౌదార్యము, శౌర్యము, గాంభీర్యము మొదలగు సకల శుభలక్షణములకు నాటపట్టయి ప్రజలను తన బిడ్డలనుబోలె దలంచి, యెవరికి యేకష్టమునుం గలుగనీయక రాజ్యపాలనము జేయుచున్నాడు. అతడు సూనృత వ్రత నిష్ఠా గరిష్ఠుండై హరిశ్చంద్ర ధర్మనందన ప్రభృతులనుమించి, బలి, రాధేయ, శిబి, దధీచి ప్రముఖులను మరపించు దాతృత్వమున నొప్పుచు, తన యశశ్చంద్రికలు దశదిశలకును వ్యాపింపఁగా భూలోకపురందరుండో యనఁదగి విరాజిల్లు చున్నాఁడు. అర్థుల కతండు కల్పవృక్షమని చెప్పినచో నతిశయోక్తిగా నేరదు. జగన్నాయకా! మఱియు వినుము.

ఆ రాజన్యశిరోమణి కర్ధాంగియైన కళావతీదేవి సుగుణశుభలక్షణ శీలాదులన్ననో, వర్ణించుట కాదిశేషునకును గూడ సాధ్యము గానేరదని నేను దృఢముగాఁ జెప్పగలను. అరుంధతి, అనసూయ, ద్రౌపది, దమయంతి, చంద్రమతి, సుకన్య, దమయంతి మొదలైన మహాపతివ్రతలైన స్త్రీరత్నములు గూడ నయ్యబ్జవదనతో సరిబోల్పఁ దగినవారు కారని లోకమున ప్రసిద్ధిఁజెందిన సాధ్వీమణి, ఆమె పతిభక్తియు, భగవద్భక్తియు

సంతోషభావమును, సత్యదృష్టిభావహాముతై కనుపట్టుచుండును. అదంప తులను విధాత యెవ్విధముగాఁ గూర్చెనో కాని, భార్యాభర్తల యను రాగమును నైకమత్యమును, వర్ణనాతీతములు, బంగారమునకు తావి గలిగిన యెట్లుండునో యాభార్యాభర్తల పొందిక లాలాగున నొప్పు చున్న యవి.

హృషీకేశా! వేలుపులందైనను వారికి సమానులు లేరని చెప్పినను తప్పుగాదు. సత్యసంధుడైన యారాజేంద్రునకును, పతివ్రతాతిలకమైన యతని యిల్లాలికిని నెంతయూఁదగియున్నది. భూలోకమున కరగినపుడెల్ల నేను వారిని చూడకవచ్చుటయే లేదు. వారి దాంపత్యము నామనంబున కెంతయుఁ సంతోషకరమగుచుండుటచేత చూచి యానందమొందుచుం డుదు. నేఁడును నేను మర్త్యలోకమున కేగి సంచరించి కళావతీ విజయా భ్యులంగాంచి సంతసించి, భవదీయపావన పాదారవింద సందర్శన కుతూ హలం బతిశయించి యిచ్చోటికి వచ్చితిని. దేవేశ్వరా! నాచేఁ జూడఁబ డిన విషయములలో నిదియొక్కటిమాత్రమే యత్యాశ్చర్యకరముగా బుద్ధికిఁ దోచినది. అల్పజ్ఞులమగు మాఁబోంట్లకిటువంటి విషయములు యెక్కుడుగానుండును కాని, పరంధాముడవైన నీకుయిటువంటి వెల్ల నెక్కు డైనవిగా దోచనేరవు. ఇందిరావల్లభా! ఏదేనియు విశేషమును చెప్పుమని యాజ్ఞాపించితివి గాన నాబుద్ధి కధికమయినదిగాఁ దోచిన విషయమును విన్నవించినాఁడను'' అని యివ్విధంబున నారదుండు పలికెను.

కమలాక్షుం డాపలుకులు విని సంతసించి ముఖంబు వికసింపఁగా నారదునిఁ జూచి ''మునివరా! యుత్తమమైన విషయమును జెప్పి, నామ నంబున కానందముఁగలిగించితివి. పాపక్రియాప్రియులగు భూలోకవాసు లందు గచ్చపొదలనడుమ గంధపుచెట్టువలె యారాజన్యుఁడు జన్మించిన వాఁడు. అతని గుణంబులకుఁ దగినట్లే సాధ్వీమణియైనభార్య గుదిరినది. ఈ విషయమును గూర్చి నేనొకమాటఁ జెప్పెద నాకర్ణింపుము. ఎట్లనిన దైవభక్తిపరులైన సతీపతుల శీలమును బరీక్షించి వారు సుస్థిరమ తులై నాశోధనకుఁ జలింపక నిలిచిరేని వారికి సకల కోరికలను, శాశ్వత మైన వైకుంఠ పదవియు నొసంగెదను. మదీయభక్తులయెడల నిట్లే నేను శోధనఁజేసి వాంఛితార్థము లొసంగుచుందును. ఇది నావాడుక. కనుక పుణ్యవర్తనులగు వారిని పరీక్షింపఁ దలంచినాను. నీవు నాతోడ రమ్ము. మన మిరువురముఁనుం బోయి చూచి వత్తము గాక'' అని పలికెను.

నారదుండు నమస్కరించి "దేవా! నీవుభక్తపరాధీనుండవు, నిన్ను భక్తితో స్మరించువారి యాపదలను నుడిపి సంరక్షించుటకై కంకణము కట్టియుండువాఁడవు. నీచిత్తమునకు యెట్లు ప్రియంబుగాఁదోఁచునో యావిధమునఁ జేయుము. నీవు చేయు కార్యమునకుఁ గాని, సంకల్పమునకుఁ గాని యెట్టి యంతరాయములును గలుగనేరవు. భవదిచ్ఛానుసారముగా నేనును నిన్ను ననుసరించి వచ్చెదను" అని విన్నవించెను.

అంతట నీరదవర్ణుండు చేయుదగిన [illegible]ము, నటించవలసిన [illegible]ములను ప్రబోధించి యతనిం దోడ్కొని [illegible] విజయాశ్వుల చిత్తశుద్ధియు, భక్తియు, సత్ప్రవర్తనాదులను [illegible]ధించుటకై [illegible] ములు దాల్చి [illegible] [illegible]ంపుచు [illegible] భూలోకమ[illegible] [illegible] శ్రీపుర మును ప్రవేశించిరి.

విజయాశ్వుఁడు పేరోలగంబున నుండఁ ద్వారపాలకుఁడు వచ్చి నమస్కరించి "మహారాజా! యెచ్చటనుండియో గురుశిష్యులిరువురు బ్రాహ్మణులు తేజముగలవారు వచ్చి మొగసాలయందు నిలిచియున్నారు. తమతో విన్నవింపుమని చెప్పినారు" అని విన్నవించెను. అది విని విజయాశ్వుండుతటాలున లేచిద్వారముకడకరిగి గొనివచ్చియటనున్నయర్హాసనంబులపైఁ గూర్చుండఁబెట్టి పూజించి, వారి యనుమతంబునఁ దానును నుపవిష్టుండై మిక్కిలి వినయముతో "ఓపావన స్వరూపులారా! నేఁడు మీదర్శనమువలన నాజన్మమును, మీపాదములు సోకుటచేత నామందిరమును పావనములైనవి. ధన్యుడనైతిని, మీరెందుండి యేమి కోరిక గలిగి యిచ్చటికి వచ్చితిరి? నాయందు కరుణించి మీరు వచ్చిన కారణమును దెలుపవలయునని ప్రార్థించుచున్నాను" అని యడిగెను.

రాజటుల నడుగుటయు వచ్చిన బ్రాహ్మణులలో గురుండైన పెద్దవాఁడు చిఱునగవు ముఖంబున వెలయఁగా యిట్లనియె. "నృపాలేశ్వరా! నేనొక యల్పమైన కోరిక గలిగి యర్థులపాలిటి కల్పవృక్షమై యెల్లవారికి గోరిన యర్థంబు నొసఁగుచుండు ధర్మస్వరూపుడవనిలోకులునిన్ను గూర్చి యగ్గించుచుండఁగా నీకీర్తి విని నాయాస నీవు దీర్పఁగలవనెడి తలంపున నీయొద్దకు వచ్చినాఁడను. నావాంఛితమును దీర్చెదని మొదట వాగ్దానముఁ జేసినఁగాని కోరికను చెప్పకూడదని నిశ్చయించుకొంటిని. అటుల వాగ్దత్త మొనరించెదవేని యెఱింగించెదను. ఇంకొకమాట వినుము.

మొదట నాకోరికను దీర్చెదవని చెప్పి నేను విషయము నెఱింగించి నంతట వెలవెలఁబోయి ఇది యేదో సామాన్యమైనదిగా భావించితిని; విన్నంతట నశక్యముగా దోఁచుచున్నది. ఆకార్యము నావలన నెరవేఱునది కాదు' అని చెప్పితివేని నేను సహించి యూరకఁ బోవువాఁడను గాను. నిన్నును నీరాజ్యమును నశించిపోవులాగున శపియించిపోవుదును. కాబట్టి ముందుగానే చెప్పితిని. "ఇత డేమి యడుగునో, కోరికను దీర్చుటకు సాధ్యమగునో కాదో' యనెడి సందేహము గలిగిన యెడల యిపుడే నీవలన గాదని పలుకుము. నేను మఱి యేపుణ్యాత్మునైనను నాశ్రయించి నా వాంఛ పూర్తిఁగావించుకొనెదను" అని చెప్పెను.

మహాదాతయు, ధర్మస్వరూపుఁడునునై యమ్మహీవరుఁ డామాటలకించుకయు జలింపక మనస్థైర్యము తొలంగనీక బ్రాహ్మణోత్తముని జూచి "అయ్యా! ఏమైన నగునుగాక, సాధ్యాసాధ్య విచార మొనరించుట నామతము గాదు. మీరేది యడిగినను నడుగుఁడు. ఎట్టి కోరికఁ గోరి యడిగినను దానిం దీర్చుటకు సిద్ధముగా నున్నాఁడను" అని దృఢముగా చెప్పెను. రాజు పలుకులు విని సభ్యులు "అయ్యో! ఈవిప్రుండేది యడుగునో తెలియక వాగ్దాన మొసర్చినాఁడు పిమ్మట నెటుల పరిణమింపగలదోగదా" యని తత్తఱపడసాగిరి. అట్టియెడ విప్రుండు రాజునుజూచి నీవు సత్యదనుండవగుట నెఱింగియే నీయొద్దకు వచ్చితిని. నాకోరిక యెట్టిదైనను దీర్చుటకు సమ్మతించి వాగ్దానముఁ జేసితివి. ఇంక నాకార్యము సఫలమైనట్లే యని తోఁచెదది ధరణీశా! చెప్పెద విను"మని యిట్లనియె.

"నేను సర్వసంగ పరిత్యాగినై వివాహాది సంసార బంధహేతువులైన పనుల నపేక్షింపక వదలి ముక్తిసాధకంబైన తపంబొనరించుచు పెద్దకాలము గడిపితిని. కాయ లాకులందిని కృశించుట దక్క యా మోక్ష మెట్టిదియో యెపుడు గలుగునో యిప్పటివరకును నేమియుం బ్రయోజన మేర్పడినది కాదు. లోకంబున నన్నువంటి మనుజులందఱును పెండ్లాడి భార్యలతోఁగూడి యిల్లువాకిలియు పుత్రపౌత్ర ధనధాన్యాదులును గలిగి సకల సౌఖ్యములు ననుభవించుట జూచి మాఁది 'అకటా! ఎల్లవారును భోగములను బొందుచుండగా పాడు మోక్షచింత యనెడు వెఱ్ఱితనమునకు లోనై నేనుమాత్ర మివ్విధమున నలయ నేమిటికి? ముక్తి లేకుండిన లేకపోవును గాక, లోకుల కందఱకును గలుగుగతియే నాకునుం గలుగును. ఛీ! ఏమితపస్సు? ఇది యెంత కష్టమైన పని! ఇట్లు వెతలొంది

కృశించుటకన్నను నేనును నొక గుణవంతురాలైన కాంతను పరిగ్రహించి, కామ సుఖాదులగు భోగముల ననుభవించెదను'' అని నిశ్చయించి నాతొల్లిటి సంసార విరక్తి విడిచి; తగినయువతికై యందందు వెదకితిని. నాబుద్ధికిం దగినది కనుపింపలేదు. మఱియొక చిక్కును గలిగినది. ఏమనిన, నేను నిర్ధనుండ నగుటచే, నాకార్యమును సాధించుట యసాధ్యముగా నేర్పడినది. కావున నిట్టిపనిని యేమహీపాలునో ఆశ్రయించిననే కాని నెఱవేరదని నిశ్చయించి నీ యౌదార్యమును, సత్యమును, సుగుణములును విని, నీమూలమున నాయపేక్షఁ దీర్చుకొన నెంచి వచ్చితిని. రాజేంద్రా! నీవును నేమి యడిగినను నిచ్చెద నంటివి. సత్యసంధుఁడవగు నీవు మాటతప్పక యొక చక్కని యువతిని నాకొసంగి మా కాపురము సాగుటకుం దగిన యేర్పాటు జేయవలయును. ఇదియే నా కోరిక. నావంటి పేదవానికి గొప్పగాఁ దోఁచును గాని నీవంటి వారల కిది పెద్ద కార్యముగానేరదు. అడిగితిని గదా? యని దేనినో యొక దానిం దెచ్చి పెండ్లాడుమన్నచో నేను పరిగ్రహించువాఁడను గాను. నా మది కెక్కిన సుగుణములు గలదై యున్ననే చేపట్టుదు. నాయందు కనికరించి యీ యుపకార మొనరించి పుణ్యముఁ గట్టుకొను'' మని ప్రార్థించెను.

ఇట్లు భూసురుం డడుగుటయు, రాజు తనలో 'ఆహా! పావనంబైన ముక్తిమార్గమును విడిచి యితండు సర్వమును నెఱింగిన వాఁడయ్యును, పాప హేతువని తలంపక సంసార సుఖంబును గోరుచున్నాఁడు. ఈ విప్రవరుండన్ననో కడు వృద్ధుఁడు. ఇట్టి యపరవయస్సున నిటువంటి బుద్ధి యీ తపోధనునకుం గలుగుట మిగుల నాశ్చర్యకరమై యున్నది' అని యెంచి అతని జూచి ''స్వామీ! ధర్మాధర్మములం గూర్చి తమవంటి పెద్దలకు కించిజ్జ్ఞుండనైన నేనేదియునుం జెప్పఁదగిన సమర్థుండనుగాను మీరు కోరినట్లే తగిన కన్యను విచారించి యెంత ధనంబైన నొసంగి మీకు పెండ్లిగావించెద'' నని పలికి వారికి తగిన విడిదిఁ జూపి సకలోపచారములును జరగించుచుండుట కర్హులైన వారలను నియమించి యనిచి ''బ్రాహ్మణోత్తముని వివాహార్థమై యుక్తమైన కన్యను విచారించి యెంత ద్రవ్యమైనను నిచ్చికొనిదె'' మ్మని మంత్రివరున కాజ్ఞాపించెను.

అచ్చటచ్చట సచివుఁడు కష్టపడి విచారించి యెందఱనో చక్కని కన్నియలం దెచ్చి వృద్ధభూసురునకు జూపెను. కాని యొక తెయైనను నిది తగినదనక యతం డందరను నిరాకరించెను. అది యంతయు నెఱింగి

భూపాలుం డాశ్చర్యమొంది, యేమి చేయుటకును దోఁచక మునివరుని చెంతకరిగి మ్రొక్కి "తాపసోత్తమా! ఎందఱు కన్యలం దెచ్చినను నేదో యొక లోటు జెప్పి యొల్ల ననుచున్నారు. ఎట్లు? మీరు సర్వజ్ఞులుగాన, మీబుద్ధికి వచ్చిన యంగన యెచ్చటగలదో యోచించి చెప్పుడు. అది యెంత యసాధ్యమగుచోట నుండినను తెప్పించి యొసంగెదను" అని విన్నవించెను.

ఆ పలుకులు విని తపస్వి తలయూఁచి యోచించి "రాజచంద్రా! ఔను! నాకు సమ్మతమైన కన్నియ యెందును నుండినట్లు తోఁచలేదు. ఇంక నట్టి ప్రయత్నమును ప్రయోజనము లేదు. కన్యయే గాకున్న నేమి? ఎవ్వతెయైనను సుగుణవతిగా నుండినం జాలును. అటువంటి యువతినైన నొసంగుము" అనెను. ఇది యెట్లు పొసఁగును? పరకాంతలను గోరుటయు మునికర్పించుటయు నెట్లు? ఈసంశయము రాజుబుద్ధిని గలంచినది. అతఁడు "మహాత్మా! ఇంక పరాంగనలం గదా తేవలయును? ఎవఁడు సమ్మతించి తనభార్య నొసంగును? ఏ కాంత తన కాంతునివిడిచియన్యుని యొద్ద సంసారముఁ జేయుటకు సమ్మతించును. అట్టి చోటును సయితము మీరే యెఱింగింపుడు కలదేని గొనివచ్చి మీ కర్పించెద" నని వినయముతో విన్నవించెను

తాపసోత్తముఁ డాలోచించి 'రాజేంద్రా! అటువంటి జాన లభించుటకును చోటు దోఁచకున్నది. అదియును దుర్లభమైన కార్యమే కాని నెరవేరు పనిగాదు. దీని కొక యుపాయముఁ జెప్పెదను వినుము. నీవు పలికి బొంకని సత్యసంధుఁడవే యగుదువేని నా కోరికఁ దీర్చుట నీకు సమ్మతమై యుండుట నిక్కమే యగునేని, పుణ్యపాపములను, ధర్మాధర్మములను దలంపక నీభార్యనే నాకర్పింపుము. ఆ తరుణీమణియందు సర్వ శుభలక్షణంబులు నమరియుండు ననుటకు సంశయింప వలసినది లేదు. ఇట్లు చేయుటకు ఇష్టము గలుగదేని మాటఁ దప్పితివని పలుకుము. నేను మఱి యెవ్వరినైనను నాశ్రయించి మదీయ వాంఛితంబును దీర్చుకొనెదను. అసత్యదోషమును, నా శాపఫలమును నీకు దప్పనవి కావు. ఈవిషయము మొదటనే చెప్పియున్నాను" అనియెను.

ఇంక నేమి గతిగలదు? ప్రాణమునైనను విడుచును గాని విజయాశ్వుండు పలికి బొంకువాఁడు గాఁడు. బొంకకుండినచో, తన భార్యను గదా యతని కొసంగవలయును? పరమ పతివ్రతాశిరోమణియును సుగుణ

రాశియు, సుశీలయైన నిజార్ధాంగి నొసంగుట యెట్లు? ధర్మమగునా? ఏపురుషుండు లోకమున నిజసతి నన్యుని కర్పించుటకు సమ్మతించును? నృపాలున కెటుల చేయుటకును దోంచలేదు. 'అయ్యో! గొప్ప చిక్కులోం దగుల్కొంటినే! ఏమి చేయుదును?' అని పరితపింపం దొడంగెను. ఎన్ని విధములనో యాలోచించెను. ఏమియు నుచిత మార్గము తోచలేదు. మాటదప్పుటయో భార్య నొసంగుటయో యీ రెంట నేదో యొకటి చేయుట దక్కయన్యథా మార్గము తోచలేదు. ఆడిన మాటలను తప్పుట యెట్లు? తుద కతండు భార్య నొసంగుటకే నిశ్చయించెను. మహాసాధ్వియు, ననుకూలవతియు పుణ్యవర్తనయునైన భార్యను విజయాశ్వుండు గాక మఱి యెవ్వాడు పరున కొసంగుట కంగీకరించును? అతనికి సత్యమున కంటె మఱి యెద్దియును నెక్కుడైనదిగా తోంచదయ్యెను. ఇంక నిచ్చియే తీఱవలయును గదా? అపుడే యతండు భార్యను రావించి జరిగిన తెఱగంతయును వివరముగాం జెప్పి "సాధ్వీమణీ! నిన్ను మునికులోత్తమునకు సమర్పింపందలంచినాను నీవు పతిభక్తిగలదానవేని నాయాజ్ఞను తలందాల్చి తాపసవరుని యిష్టానుసారముగా మెలంగుచు నాసూనృతవ్రతమునకు భంగము గలుగకుండునట్లు రక్షింపుము" అని యాజ్ఞాపించెను.

పతియే దైవమని యెంచి సంతతము నతని మాట దలందాల్చి మెలంగుచుండినదియు, ఎపుడును దైవచింతయందు నిమగ్నమానసయును తన భర్త నియమంబు నెఱింగియుండినదియు నగు కళావతి యేమి చెప్పినను తన నాథుని యాజ్ఞప్రకారము వర్తించుటయే తనకు విధియని యెంచి "ప్రాణేశ్వరా! నేను మీ యాజ్ఞాబద్ధురాలను. ఎటుల చేయుమని శాసించిరో యావిధమున నాచరింపగలదానను" అని విన్నవించెను.

భూకాంతుడు మునివరుని రప్పించి నిజసతి నతని కర్పణముం గావించెను. అతండు సంతసించి "రాజా! నీవు సత్యము దప్పని పుణ్యాత్ముండవు. మహాదాతవు ఆడినమాట దప్పక నాయాశం దీర్చితివి. కాని యింకొక కార్యము కొఱతయున్నది. ఏమనగా నీ భార్య నిరుపమ సుఖముల ననుభవించుచుండిన కోమలి, అడవులలో నిల్లు వాకిలియులేని నాతోడనుండి సుఖించుటెట్లు? కావున నీమందిరము మాకొసంగుము. సుఖముగా మేమిందే యుండి కాలముగడిపెదము" అని యడిగిన, మాఱు పలుకక యానృపాలుం డొసంగితినని. పిమ్మట "పట్టి మందిర మేమిచేయుటకు? సేవకజనంబును నొసంగుమని" యడిగెను.

విజ:—స్వామీ! నా సేవకుల నెల్లరను నిచ్చితి.

ముని:—సంతోషమైనది. కాని వీరిని సంరక్షించు టెట్లు? ధనాగారమును నాయధీనముఁజేసి తద్రక్షణార్థము సైన్యము నొసంగుము.

విజ:—అలాగే యొసంగినాఁడను, ఇంకేమి కావలయును?

ముని:—నీవు రాజ్యాధికారమును విడిచి, ప్రజలందఱును నా యాజ్ఞావర్తులగునట్లు చేయుట, నీవును మా సేవకులలోని వాడవై సదా మాకు యేయాపదయుం గలుగకుండునట్లురక్షించుచుండుట, రాజును నేన గుట దెలియునట్లు ప్రకటించుట యీ కార్యములను నెరవేర్పుము.

విజ:—మునిశేశ్వరా! మీరు కోరిన పనులన్నియుం గ్రమముగా నెరవేర్చినాఁడను. నేను మీ యాజ్ఞానుసారముగా మిమ్మును పురంబును రక్షించుచుండెద. మీరు నిర్భయముగా రాజ్యాధిపత్యమును బొంది సర్వ సుఖంబులను ననుభవించు చుండుఁడు.

ముని:—నరేంద్రా! నీవంటి పుణ్యాత్ముఁడును, నెరదాతయు నూనృతియు, ముల్లోకములందును గలుగఁడు, సంతుష్టుండ నైతిని.

మునివరుండు రాజై సింహాసనాసీనుండై తత్పూర్వపు మంత్రినిపదవి నుండి తొలగించి తన శిష్యునకు మంత్రిత్వము నొసంగి తోచినట్లెల్ల నాజ్ఞ లొనరించుచు సాయంకాలమువరకును గడపి, యస్తమానానంతరము శిష్యసహితుఁడై యంతఃపురంబు ప్రవేశించి, యచ్చటి పరిచారికజనుల నదలించుచు బెదిరించుచు నల్లకల్లోలమొనరించి మజ్జన భోజనాదిక్రియలు నిర్వర్తించి శిష్యు నొక్కెడనుండ నియమించి. తాను శయనాగారముం జేరి తనకై యలంకరింపఁ బడియున్న తల్పంబుపై శయనించి రాజపత్ని రాకకు నిరీక్షించుచు శయనించి యుండెను.

కళావతి సకలాలంకార శోభితాంగియై మజ్జనభోజన కార్యానంత రము శయనాగారమునకు వచ్చెను. ఆమె పదంబుల చప్పుడు వినగానే మునీశ్వరుండు నిదురించు వానివలె కన్నులుమూసి గురుకబెట్టుచున్నట్లు నటించు చుండెను. ఆమె తన రాకకై వేచియుండి తడవగుటచే నిదురించె నని తలంచి యపరాధము పొసంగెనని వెఱచి, శయ్యఁ డాయఁబోయి, మేలు కొలిపినయెడల కోపించునేమోయని సంశయించి కొంతతడవు నిలిచి యుండి యెట్టకేలకు ధైర్యము నవలంబించి శయ్యాగ్ర భాగంబున మెల్లనఁగూర్చుండుటయు, తటాలున నమ్ముని మేలుకొన్నవానివలె నిటు నటుం బొరలి నీల్గి యావులించి కన్నులు విచ్చిచూచుటయు, నతండు కద

లఁగానే దిగ్గన లేచి వెంబడి నిలిచియున్న రాజపత్ని యతనికిఁగనుపట్టెను.

ఆమెను చూడగానే పారాశరి మహా దాగ్రహామును బొంది "దురాత్మురాలా! నేను రాజనగుట మఱచితివా? ఇనీ! పతిభక్తియనగా నిట్టిదేనా? నీరాకకు యెంతతడవు నిరీక్షించుచుంటిని? తుదకు నీకు నా యందు గౌరవభావము గలుగ లేదనుటకు దెలిసికొన విరాళెంజెంది నిద్రించితిని. ఎచ్చటనో యుండి తోఁచినపుడు నాయొద్దకు రాదలంచితివి కాబోలు! ఇటుల చేయుమని నీమగఁడే బోధించియుండునని తోఁచు చున్నది" అనెను.

కళా:—మునికులోత్తమా! మహీపాలుం డేపాపము నెఱుంగడుఁ. ఆ పుణ్యశీలు నందు దోషమారోపించుట న్యాయమగునా?

ముని:—కాదేని యింతతడవు నీవు రాని కారణమెయ్యది?

కళా:—స్నానభోజనాది కృత్యములు నిర్వర్తించి యలంకరించు కొని, మీకు కోపము వచ్చునేమో యని భయముతో నేను త్వరితము గానే వచ్చితిని ఇంతలోనే మీరు నిద్రించితిరి.

ముని:—ఓసి, యసత్యభాషిణీ! నీవు తడవుఁ జేయుటఁ దలంపక నిద్రించిన తప్పు నాయందే యారోపించెదవా? బళీ! నీచాతుర్యము మెచ్చవచ్చును.

కళా:—స్వామీ! నేను మీపైని నేరమిడు నంతదాననా?

ముని:—మఱి నీమాటల కర్థమెయ్యది?

కళా:—మన్నింపుడు. ఒకయెడను మహాప్రభువును నైన మీ రిటుల సేవకురాలిపైఁ గోపించిన మఱీ రక్షకు లెవ్వరు?

ముని:—నీకు రక్షకులు లేరా? కలడుగదా నీమగడు?

కళా:—ఇంక నాకా మగనితో సంబంధ మేమియున్నది?

ముని:—ఔనౌను! ఈమాటలకేమిగాని, ఇపుడొక విషయమున నీతలంపును, నాయందుగల భక్తి శ్రద్ధలను తెలియగలవు. నాయాజ్ఞ ప్రకారము వర్తించు దానవేని నేను చెప్పినట్లు చేయుదువా?

కళా:—సందేహింప నేల? తప్పక చేసెదను.

ముని:—చెప్పినంతట చేయఁజాల ననరాదు సుమా!

కళా:—అటుల తలంపవలదు. మీయాజ్ఞా బద్ధురాలను.

ముని:—సరి! తెలియును గాక, వినుము.

ఏమనఁగా, నేను తప మొనరించుచుండఁగా నొక సమయమున

నీశ్వరుండు ప్రత్యక్షంబై వరంబు వేడుమనెను. "ముదిమితొలంగి యెప్పు డును వయోవంతుఁడనై యుండునట్లు ప్రసాదింపు" మని యడిగితిని. నాకోరిక విని పరమేశ్వరుండు 'ఇపుడు కలుగదుగాని, కొంతకాలము గడచినంతట నీవు తపంబు విడిచి, రాజవై రాజపత్నిని వరించి పరిగ్ర హింపఁగలవు. పతివ్రతయైన యామెచే రాత్రికాలమున నంతఃపురంబున కంఠంబు ఖండింపబడినయెడల వృద్ధరూపము తొలంగి శాశ్వత యౌవనా కృతి కలుగుం" బొమ్మని యాదేశించి యదృశ్యుండయ్యెను.

కళా:—ఆశ్చర్యముఁగానున్నది. ఔను! ఇపుడా మాటయేల?

ముని:—ఏలనా? వయోవంతుడనై సుఖంపదలంచితిని.

కళా:—వృద్ధులై యుండిననేమి?

ముని:—ఓసీ? దుర్మతీ! ఎంతటి యోర్వలేనిదానవు? నేను వయసువాఁడనై నచో చాలకాలము నాతోఁ గాపురముఁ చేయవలసి యుండుననియు, ఇట్లే జరాపీడితుఁడనై యున్నచో త్వరలో నీపీడ తొలఁగు ననియుం దలంచితివా?

కళా:—కళావతి చెవులు మూసికొని హరిహరీ! మీరిటుల చెప్ప వచ్చునా?

ముని:—మఱే యేమనవలయును?

కళా:—ఎట్లుండినను మీయందు నాభక్తికి కొఱత గలుగదు.

ముని:—ఈ మాటలకేమిగాని, చెప్పినట్లు చేయుదు నంటివిగదా?

కళా:—ఔను. నిజమే!

ముని:—మంచిది ఇటురమ్ము.

కళావతి తల్పమును సమీపించెను. మునీంద్రుండు శయ్యవించుక యెత్తి "ఇదిగో చూడుము దీనిని గైకొను"మనెను. అచ్చోట మెఱయు చున్న వాడి ఖడ్గమొకటి యుంచబడి యుండినది. "ఏల దీనిం గొను మనుచున్నారు" అని సంశయించుచు, నామె దానిం గైకొనియెను.

ముని:—తీసికొంటివా?

కళా:—ఇదిగో! యున్నది, కైకొంటిని.

ము:-అంగనామణీ! హరుని వరప్రకారమును మున్నే చెప్పియున్నాను గదా! నీచేతి కరవాలుతో నాలోచింపక, భయమొందక, సంశయము వీడి యొక వ్రేటున నాకంఠమును ద్రెంపుము. ఉత్తరక్షణంబున యీ ముసలి రొడలుపోయి నవమన్మథాంగుఁడనై నీకు గనుపట్టగలను.

అంతట మనము సకల భోగముల ననుభవింపవచ్చును. ఇట్లే యున్నచో కుసుమ కోమలాంగివైన నీకును, జరాపీడిత కృశాంగుఁడనైన నాకును జత సరిగానుండదు సుమీ'' యని చెప్పెను. అట్టి మాట వినఁగానే కళావతి గుండెలు జల్లుమనియెను. ఒడలు గడగడ వడంకసాగెను. పలుకుటకే నోటమాట వెడలదయ్యెను. శిలావిగ్రహంబువలె నట్టె నిలిచి చూచుచుండెను. కాని తపోధనుం డామెను మాటిమాటికి నెచ్చరించి ''తడవేల జేసెదవు? శీఘ్రముగా కార్యమును నెరవేర్చి నన్ను యౌవనవంతునిఁ గావింపు'' మని త్వరపెట్టఁ దొడంగెను.

అయ్యో! పాపము! ఆమె యేమిచేయును? తన కొడయఁడును, ప్రభుండునగుటయట్లుండఁగానిష్కారణముగా బ్రాహ్మణునివధించుటకా మహాసాధ్వి యొడంబడఁగలదా? కాదని యూరకున్నచో, నత్యుగ్ర స్వభావుండైన యాద్విజవరుండు చేయు తొందఱ మిక్కుటమయ్యెను. తన భర్త యామునికి నిచ్చునపుడు ''అతనిమాట కెదురాడక ఏమి చెప్పినను కష్టమనక సమయము గాదనక చెప్పిన పనినిఁ జేయుచుండు'' మని యాజ్ఞాపించియున్న దామెకు మరపురాలేదు. గొప్ప సందిగ్ధస్థితి యేర్పడినది. ఎట్లు? చంపుటయా? మానుటయా? ఆమె దేహము చమరించి వదర నారంభించినది. భయభ్రాంతచిత్తయై తనలో 'శివశివా! ఈ మునిపుంగవుడు నాచేఁ జంపబడిన యెడల యౌవనవంతుడగు నఁట. ఎంత వింత యనవలయును? ఇట్టి వింత యెందైనఁ గలుగునా? ఈశ్వరుండిటువంటి వర మిమ్మహీసుర శ్రేష్ఠున కేల యొసంగెనో కదా! నేనేమి చేయుదును. ఈ మాటలు నిజమని నమ్మి చేజేతఁ బుద్ధి పూర్వకముగా బ్రాహ్మణుం జంపి, చెప్పినలాగున నితఁడు బ్రతుకకుండినచో యామహాపాతకమును నేనొడిగట్టుకొనవలసినదియేగదా? ఈగొప్పకిల్బిష కార్యముఁ జేయుట కెటుల తెగింపుదును. మఱియు పతియాజ్ఞను మీరిన దోషము సంభవించును. ఈమునివరుఁడు యేలాగున శపించునో? తెలిసినది కాదు. నామూలమున నావల్లభున కపకీర్తియు, పాపమును సంఘటిల్లును. అట్లుగాదు చంపెదనందునా? ఇతండు బ్రతుకక పోయెనేని యెఱింగి నాప్రాణేశ్వరుండు వచ్చి చూచి 'ఒకవేళ ముదిమది తప్పి మునీంద్రుఁడు చెప్పగానే మంచి చెడ్డలం దలంపక నీవేలాగు తెగించి యింతటి అకృత్యమును జేసితివి! అని యడిగెనేని యామాట కేమని బదులు చెప్పగలను! ఎట్లు తలంచినను 'వెనుక గొయ్యి ముందు నుయ్యి'

యన్నట్టు నాయిప్పటి స్థితి యేర్పడినది. ఓ పరమేశ్వరా! కర్తవ్య మిట్టి దని తోఁచదయ్యెనే. ఏమి చేయుదు" నని పలువిధంబుల నాలోచనఁ జేయుచు దుఃఖించుచుండఁగా మునీంద్రుఁడు కోపావేశంబున కండ్లనిప్పు లురులు భంగి సుగ్రంబుగాఁ జూచి "ఓసి దురాత్మురాలా! ఇట్టిదేనా నీ పతిభక్తి? ఆలోచింపగా, నిటుల కపటభక్తి నటించి నన్ను మోసగించు లాగున నీనాథుండే నీకు బోధించియుండునని తోచుచున్నది. నాయందు గౌరవములేక, నేను చేయుమనిన కార్యమును చేయనొల్లక నిరాకరించి నిలచియుండెడినీవు నాకేమిటికి. నీముఖమును జూచిన దోషముగలుగును పోపొమ్ము. నిన్నును, యింతటి చెడుదానవగు నిన్ను నాకొసంగిన కటిలుండైన నీవల్లభుని శపించి మదీయ కోపానలంబున కాహుతిఁ గావించి పోయెదను" అని పండ్లు పటపటఁగొఱుకుచు బెదరించి పలికెను.

బదులు బలుకుటకు ఆమెకు నోరురాలేదు. వెఱపును వ్యాకులము నతిశయించినది. తన కెంతటి ముప్పుగలిగినను ననుభవించుట కాసాధ్వీమణి చింతింపలేదుగాని పుణ్యావర్తనుండును, సదదాతయునగు భర్తకుఁ గీడుగలుగున నెడి దుఃఖమామె నెక్కుడుగా బాధింప దొడంగెను. గుండె నిశ్చయముఁ జేసికొని, తాపసోత్తమునిం జూచి, "దేవా! శాంతింపుఁడు ఇపుడు మీరేమిచేయు మనెదరు? సెలవొసంగుడు!" అని యడిగెను.

ముని:—ఓహో! మరల జెప్పవలయునా? మఱచితివా?

కళా:—అకృత్యమగుటచే తెగించి చేయఁజాల కున్నాను.

ముని:—సరియే! దీనికి మరల నడుగనేల?

కళా:—గుండె నిబ్బరముఁ జేసికొంటిని. చంపుమనెదరా?

ముని:—మాటిమాటికి నడుగుచున్న నేను చెప్పఁజాలను. ధైర్యముతో నాపలుకులు నమ్మి నేనాజ్ఞాపించులాగున గావించినచో మనము సకల సుఖములు ననుభవింపఁగలము. చేయవైతివేని నీగతి నీదియు, నాగతి నాదియు నగును. పిమ్మట మన కెట్టిసంబంధమునుండదు. నాశాప ఫలము మాత్రము మీకు తప్పదు.

కళా:— మహాత్మా! వలదు. మీకోపమునకు మేముతాళగలమా? ఇట్లు పలికి కళావతి 'యేమైన నగునుగాక. ఈతాపసాగ్రణి యాజ్ఞ ప్రకారము చేయుటయే కర్తవ్య'మని తుదకు నిర్ధారణఁ గావించుకొని, తన మనంబున పతిని సంస్మరించి, సర్వకర్తయు సర్వశక్తుండును నైన శ్రీయఃపతిం దలచి,

సీ॥ త్రిజగదావన శీల♦గజరాజ పరిపాల♦దేవతా గణపక్ష♦దీనరక్ష
నీరదనీలాంగ♦ఘోరాఘచయభంగ♦కమనీయచారిత్ర♦కంజనేత్ర
సకల [illegible] జమందార♦రాజిత మణిభూష♦రమ్య
శ్రీ. [illegible] నారకోటివిలాస♦పరమభక్తసమాజ♦భాను తేజ

గీ॥ ఇందిరా హృద్విహారయా♦నందసార
భంజితాసుర సమువాయ♦పాహి పాహి
తాపసోత్తము నాజ్ఞను♦దప్ప లేక
తలఁచితిని ఘోరమైన♦కృత్యంబొనర్ప.

క॥ పతియాజ్ఞయు ముని యాజ్ఞయు
జతపడి గడువంగ రాని ♦ సంకట మొదవెన్
ధృతిఁబూన్చి యీ యకృత్యము
వ్రతము విడువలేక చేయ ♦ వలసెను నృహరీ!

ఉ॥ రాక్షసవంశనాశక ధ♦రాధర పన్నగ రాజతల్పయో
పక్షికులేంద్ర వాహనను♦భస్కరయాశ్రితరక్షకా రమా
పక్షదయానిధీ యఘుని ♦ వారక నాయెడ తప్పులేదు సం
రక్షణ సేయవే కరుణ ♦ రాజిల పాపముగల్గ నీయకన్.

క॥ నిను నమ్మి నీపదంబులు♦మనమున నిడి పారికాంక్షి♦మాటకులోనై
దునిమెద నీతని కంఠము♦ఘనకష్టము మానరాని♦కైవడినెసఁగెన్.

సీ॥ పురుషవృత్తి మెఱుంగు ♦ భూత పంచకమును
భక్తితో నాత్మతోఁ ♦ బ్రస్తుతించి
సుఖదుఃఖ ఫలముల ♦ జోక నొసఁగునవ
గ్రహముల సద్భక్తిఁ ♦ గరము వేడి
సతత ధర్మనిరూఢి ♦ జగములు రక్షించు
లోకపాలురనునా ♦ లోఁ దలంచి
యశ్రాంతమును వాంఛి ♦ తార్థముల నొసఁగు
వేల్పులనెల్ల భా ♦ వించి పొగడి

గీ॥ యాత్మవల్లభునాజ్ఞయు ♦ నట్టిదైన
తపసియాజ్ఞయుఁ దొలఁగగా ♦ దరముగామి
పుణ్యపాపంబు లెంచెడి ♦ బుద్ధివిడి
దలఁచితిని ఘోరమైన కృ♦త్యంబుఁ జేయ."

అని వేల్పులను ప్రార్థించి కళావతిముని వేగిరించుచుండగా తటా

లున వాడియైన తన చేతి వాలుతో నమ్మునీంద్రుని కుత్తుకపడ ద్రెంచెను. పిమ్మట నాశ్చర్యము నేమనవచ్చును? కంఠము దునుగులోపలనే యామునిని "ఓయి మంత్రీ! యీ దుర్మార్గురాలు నన్ను మోసగొని చంపుచున్నది. రమ్ము రమ్ము" అని కేకబెట్టి ప్రాణములు విడిచెను. తా నొనరించిన మహాపరాధముం దలంచి యధికమైన వెఱగొంది నిర్విణ్ణయై కళావతి యచ్చట నిలిచి కర్తవ్యము దోచక యుండెను.

మునీంద్రుని కేకను వినినయుగ్రుండప్పటివరకు నెచ్చట నుండెనో గాని పరుగున నచ్చోటికి వచ్చి చూచి "అయ్యో! ఎంతటి యక్రమ కార్యము? ఎంత ఘోరము పరమపావనులైన మునికులోత్తముని నర్ధ రాత్రికాలమున, సహాయులు లేక యొంటరివాడై యున్న సమయమున, తన యిల్లుగదా! యనెడి ధైర్యముతో ఈ పాపాత్మురాలు దయలేక, పుణ్యపాపములు దలంపక క్రూరకృత్యంబని యెంచక, అహో! బడగొని చంపినదే! ఏమనవచ్చును? ఎందైన నీలువంటి యన్యాయ కార్యము గలుగునా? హా! పరమేశ్వరా! ఇక నేమి చేయుదును? తండ్రివలె నన్ను పెంచుచు, విద్యాబుద్ధులను గఱపి నన్ను మన్నించుచుండిన పుణ్య శీలుండు ప్రాణము లీదుష్టాత్మురాలివలనఁ గోల్పడియెనే? యింక నా కెవ్వరు దిక్కు? ఎవరు నను రక్షింతురు? అని ఘోరున నేడ్చుచు, "ఓపుర వాసులారా! ఈ పాపకార్యమును చూడుఁడు. ఇటుల బ్రాహ్మణులను హత్య గావించు క్రూర కర్ములుందురా? ఇదియెంతయు, రాజుచేసిన తంత్రమని తోఁచుచున్నది. మునీంద్రుండు తన భార్యను పరిగ్రహించి నందున యాకోపమును వెలువడనీయక లోలోనఁ బెట్టుకొని తాను మంచివాని చందమున నటించుచు యిల్లాలి మూలముగా నింత దుష్కా ర్యమును జేయించెను. కాదేని, యతనిచే నర్పింపబడి ముని ధనమైన ప్రభుండునుం బలిగా నధికారమును బొందిన యీఋషీశ్వరుని తానధీన యగుట నెఱింగియు, సాహసించి ధైర్యముతో తగునని చంపుటకుం గడంగునా? ఈమె మగడైన యాపాతకుఁడు, అదుర్మతి, అయల్పమతి, ఆరాజుచేసిన దంతయు మోసకృత్యము. చెప్పినవన్నియుం గపటపు మాటలు. మద్గురుండు నిష్కల్మషచిత్తుండగుటచే వాని వాక్యములను, సత్యములే యని నమ్మెను. తుదకు నమ్మి ప్రాణములు పోగొట్టుకొనెను. ఏమనినను నింకనేమి ఫలము! మా యూరాలించువా రిచ్చోట నెవ్వ రున్నారు!" అని యల్లరి చేయసాగెను.

అర్ధరాత్రికాలములో మంత్రిపదవిని బొందియున్న బ్రాహ్మణ వటువు గట్టిగా రోదనముఁ జేయుచు నఱచుచు, నంతఃపురమున నల్లరిఁ గావించుచుండుటను మునియాజ్ఞాప్రకారము నగరువాకిట కావలిగాయు చున్న భూపాలుండు విని కారణ మెఱుంగలేక మిక్కిలి తత్తఱ పాటును నతిశయింపగా, పరుగునవచ్చి యంతఃపురిలోనుండు బ్రాహ్మణ కుమారుంజూచి "అయ్యా! ఏమి సమాచారము? ఏల నిట్లు రోదనముఁ జేయుచున్నాడవు? మునీంద్రుం డెచ్చట నున్నాఁడు? విషయము నెఱిం గింపు" మని యడిగెను.

శిష్యు:—ఓరి పాపాత్ముఁడా! చేయవలసినదంతయుం జేసి యెఱుం గని వానివలె నడిగెదవు. ఇదిగదా నేర్పు

రాజు:—స్వామీ! నాకేమియు బో[illegible]లేదు. [illegible]సితివి?

శిష్యు:—ఏమనియా యడిగెదవు? అడిగిన వన్నియును మంచి వానివలె నిచ్చి భార్యతో జెప్పి నాగురుని జంపించితివి. ఇంక నేమి కావ లయును?

రాజు:—హరిహరీ! మునీంద్రుని జంపించితినా? ఏపాపము నెఱుం గని నాపై నిందమోపెద రేల? మునివరుడు చచ్చెనా?

శిష్యు:—ఔను! మరణించెను. నీకోరిక నెరవేరినది. అటులోపలఁ బోయి చూచి సంతసింపుము.

శిష్యునిమాట లెవ్వియును రాజునకు బోధపడలేదు. తత్తరపాటుతో నతఁడు గృహాభవనములు జొచ్చెను. అచట మునిమృతకళేబరంబు బడి యుండెను. ఖడ్గహస్తయై తన యర్ధాంగి కదలక మెదలక నిర్విణ్ణయై యట్టె నిలిచి దుఃఖమును భయమును నతిశయింపఁగా జూచుచుండెను. రాజు బ్రహ్మచారినింగని "స్వామీ! ఈ విపరీతప్రకారం బెట్లు జరిగినది. ఇందొక్కటియు నేనెఱుంగఁ జాలకున్నవాఁడ. ఇంచుక కోపంబడంచు కొని యిట్లు జరిగిన కారణ మెయ్యదియో వచియింపుఁడు. అయ్యో! పరమపుణ్యుండైన మునికులేంద్రుండు మరణించెనే! మహా దుఃఖమయ మైన విపత్సముద్రమున మునిగితినే! ఇంకెట్లు? ఏమిగతి! ఎట్లు చచ్చెను? ఎవరు చంపిరి? నాకు భార్యగానుండి ముని కర్పింపఁబడిన యిమ్ముద్దియ వాలుంబట్టుకొని దుఃఖాతిశయంబునం గ్రుంగి యీలాగున నిలిచియున్న దేల?" యని కడు దీనతతో ప్రార్థించి యడిగెను. వెక్కివెక్కి యేడ్చు చున్న ముని శిష్యుడు ప్రయత్నంబున శోకము నించుక నాపుకొని గద్గద

కంఠధ్వనితో ఓయిరాజా! నీవీవృత్తాంతము నెఱింగియున్నను, నెఱుంగ కున్నను సరే! అడిగితివి గావున చెప్పెదను. నీభార్యయైన యీమహాత్మురాలు, అకటా! చేతులెట్లాడినవోగాని, నాకు తండ్రి సమానుండ[illegible]ని వరుని గొంతుగోసి చంపినది. అయ్యో! ఇంక జెప్పవలసినది యేమి గలదు? నీసంకల్పము నెఱవేఱినది. తొలుతనే యీ యేర్పాటు లన్నియుం గావించి, యేదియు నెఱుగని మంచివానివలె నటించినను నేను నీకపట చర్యలం దెలిసికొంటిని'' అని పలికెను.

రాజు:—అయ్యో! మీపదములాన, ఇందొక్కటియు నాకుం దెలియదు. మన్నింపుడు, ఎట్లు? ఈదుర్మతియా? చంపినది ఏల?

శిష్యు:—ఏలనో, నాకుమాత్ర మెట్లు దెలియును? మొఱగోయు చున్నపుడు తాపసేశ్వరుండు కూతఁబెట్టెను. ఆయరపువిని నేను పరుగున వచ్చితినిగాని, వచ్చుటకు లోపలనే పని తీర్చినది. ఏల చంపితివని యెంత యడిగినను పలుకలేదు. ఏమిచేయుదును.

ఇట్లతండు చెప్పగానే రాజున కపరిమితమైనవ్యాకులముజనించినది. తన భార్య మునిని జంపినట్లు వటుండు చెప్పిన మాటలయందు మాత్రము నృపాలుండించుక సంశయించెను. ఆ ఏలనగా, ఆమె న్యాయ ప్రవర్తనయు శీలమగు గుణములును భక్తియు బాగుగా తా నెఱింగి యుండు వాఁడగుటచే 'సాధ్వీమణిగదా? సాహసించి, నాయాజ్ఞను లెక్కచేయక యింతటి ఘోరకృత్యము ధైర్యముతో చేయఁగడంగునా?' యనెడి సందేహమతని బాధింపదొడంగెను. అచ్చటి స్థితినిఁ గాంచినచో మునిశిష్యుని మాటలకునట్టి లక్షణములే కనుపట్టుచుండెను. ఇందలి నిజమెయ్యది? అతండు తటాలున మరల లోపలికిబోయెను.

ఖడ్గహస్తయై దుఃఖాక్రాంతయు, భయభ్రాంత చిత్తయునై మిణుకరించుచున్న భార్యను జూచి యిదమిత్థమని యెఱుగని వాఁడగుటచే "ఏమీ? ఈతపోధనుని నీవు చంపితివా?'' యని యడిగెను.

కళా:— ఔను! చంపినది నేనే!

రాజు:—అవునా? ఏల చంపితివి?

ఆమె నోటినుండి జవాబు వెడలలేదు. పలుకలేక పోయినది. పాపము! అట్టిస్థితిలో నమ్ముగ్ధియ యేమి చెప్పఁగలదు. 'అవును, అవును, నేనే చంపితిని. నేనే చంపితినని' మాటిమాటికి నాయొక్కమాట మాత్రము పలుకుచుండెను. ఆమె తీఱంతయు గనుచున్న రాజున కావిషయమున

నేదియో గొప్పతంత్రము జరిగియుండ వలయునని తోచినది. దానిని తెలిసికొనవలయు ననెడి యుద్రేకముగలవాఁడై "సరే! నీవు చంపినట్లు తోలుతనే యొప్పుకొంటివిగదా? ఆమాట యింకఁ జాలును, ఏల జంపితివో యాకారణమును వివరింపుము. వృధా తడవుఁ జేయవలదు" అని త్వరపెట్టెను. కళావతి కన్నులనుండి శోకాంబువులు దిగజారుచుండఁగా యెక్కుడు ప్రయత్నమున చిత్తమును కుదుటపరచుకొని "నాథా! చెప్పు మనియెదవా? ఇది కడు వింతయైన వృత్తాంతము నేను చెప్పినను నెవ్వరును నా పలుకులు నమ్మఁజాలరు. ఇందలి సందర్భము లిట్టివై యున్నవి" అనెను.

విజ:- అవి యెట్టివో జరిగినది జరి... ట్లు

కళా:— వినుమనఁగా, మునివరుఁ ... మా... జెనాన

విజ:— ఇది నా ... అడవు... గొప్పమాట.

కళా:— వినుండు వినుండు.

విజ:— త్వరితముగా వచింపుము,

కళా:— నేనును నలంకృతాంగినై యిచ్చోటికి వచ్చితిని.

విజ:— సరే! అటు తరువాత యేమి జరిగినది?

కళా:— నేను వచ్చునంత లోపలనే మునీంద్రుఁడు నిద్రించెను. అని యచ్చోటికి వచ్చిన దాదిగా తనకున్ను మునివరునకును జరిగిన సంభాషణయు, సతండు తన కంఠమును ద్రుంచుట కాజ్ఞాపించి వాలునొసంగుటయు, పిమ్మట నమ్మహాత్ముని వధింపనొల్లక తానసేకరీతుల నట్టితలంపును వదలుకొనుమని ప్రార్థించుటయు, నతండాపలుకులు లెక్కచేయక యత్యుగ్రుండై "నేను చెప్పినట్లు చేయవైతివేని నిన్నును నీ పతిని నాశ మగునట్లు శపించెద" నని వెఱపించుచు తొందఱ చేయుటయుం జెప్పి, హృదయేశ్వరా! నాకు నెట్టి చెడ్డ గలిగినను నేను జంకనుగాని నిరపరాధివైన నీకు యేకీడు గలిగించునో యనెడి భయ మధికరించి, నీవు ముని యాజ్ఞ మీరవలదని కట్టడఁజేసి యుండుటయుం దలంచి ఈశ్వరునిపై భారంబిడి, నీపాదములు చిత్తంబున నిలిపి సాహసినై యీయకార్యంబు మహా పాపకరమైనదని యెఱింగియుం ద్రుంచితిని. అపుడీ తపసి గట్టిగా, 'శిష్యా! ఈ పాపాత్మురాలు నాకంఠమును దునుముచున్నది' అని యఱచి ప్రాణములు విడిచెను. ఆధ్వని విని యెచ్చటనుండెనో గాని శిష్యుఁడు

తటాలున వచ్చి యచ్చటఁజేరి, నీవు వినిన చందమున బలుకుచుండె. భగవంతుఁడే దీనికి సాక్షి” అని చెప్పెను.

భార్య యెఱుంగఁబలికినరీతిని యంతయును విన్నంతట మహీపాలునకు మిక్కుటమైన సంశయము గలిగినది. జరిగిన యానాటకమంతయుం గపట నాటకముఁగా దోఁచినది. పరమ సుశీలయైన తన భార్య నిబ్బరమున నకారణంబుగా, నంతటి ఘాతుక కృత్య మొనరించునట్టి క్రూరస్వభావము గలదిగాదనుట యతం డెఱుంగనివాఁడా? ఎట్లు జరుగవలయునో దోఁచక నిలిచి యాలోచింప దొడంగెను. మునిశిష్యుం డతనిం జూచి “ఓయిరాజా! నీభార్య జెప్పినదంతయు నసత్యము. తాపసేశ్వరుండు తనకుఁ దగినవాఁడు కాఁడనియు, వృద్ధుడనియు, ననహ్యరూపుఁడనియు, నక్రమముగా తనపై ప్రియమొందిన పాపాత్ముండనియు దిట్టి కసరి బెదరించి వాలుందెచ్చి మెడఁగోసినది. కాదేని యూహించి కైకొన్న మునీంద్రుండు సుఖంప నొల్లక ‘మెడఁగోసి చంపుమని చెప్పునా? ఎంత తెలివిహీనుఁడైనను రిత్తకురిత్త తాను చావఁగోరునా? ఇది మోసగత్తె. మాయలాడి దీని మాటలు నమ్మవలదు, నీవు న్యాయవంతుఁడవని పేరొందితివి. అది నిక్కమైనచో యీవిషయమున ధర్మమును గుర్తెఱింగి కర్తవ్యంబు నాలోచింపుము. భార్యమాటలు గదా! యని నమ్మి యక్రమముగా ప్రవర్తించితివేని, నీ సర్వసంపదలును దొలంగునట్లు శపింపుదుం జుమీ!” యని గగ్గోలు పెట్టుట కారంభించెను.

విజయాశ్వుండు మంచి మాటలలో నతని శాంతచిత్తునిఁ జేసి తనలో ‘ఇదియంతయు దలంపఁగా భగవన్మాయగాఁ దట్టుచున్నది. ఇటువంటివింత కనినదియువినినదియు లేదు. పరాత్పరుండైన రమారమణుండు నాయొక్కయు, నా భార్యయొక్కయు మనశ్శుద్ధిని బరీక్షించుటకొఱకిటువంటి పన్నాగముఁ గావించి యుండునేమో! ఏది యెట్లుండినను నేను ధర్మమును దప్పక నడచుకొనుట యావశ్యకము. ఈ సుందరాంగి యపరాధిని గాకున్నను, నేకారణము నైననేమి, ఋషీశ్వరుఁడు చెప్పగానే లోఁబడి యుక్తాయుక్తము లెంచక చంపిన తప్పునకు బద్ధురాలుగాక తప్పదు. తానే చంపితినని యొప్పుకొనుచున్నదిగదా? ఇంక సాక్ష్యమేల?” అని యాలోచించి భార్యంగాంచి “భామినీ! ఈకత్తి యెవరొసంగెఁ?” అని ప్రశ్నించెను.

కళా:—మునియే పడకలోనుండి తీసి యిచ్చెను.

విజ:—అతని కెటనుండి వచ్చినది?

కళా:—దేవునికే యెఱుక నాకుఁ దెలియదు.

ఇటుల నడుగుచుండఁగా శిష్యుఁడు "ఇంతకుఁ బెంచిన బొంకుమాట యుండదు. నీ యపకీర్తి కారిణియైన దీని నుంచకుము. ఇపుడే ఖండించి కీర్తి నిలుపుకొను" మని కేకలిడుచు తొందఱపెట్టసాగెను. ధర్మశీలుండైన రాజున కతని తలంపు ననుసరించుటయే యుచితమని తోఁచినది. అతఁడు భార్యంగాంచి "ఏది యెట్లుండినను మునిని వేఁరపడి చంపిననేరము నీయందు దృఢముగా నేర్పడినది. న్యాయమునకు వ్యతిరిక్తముగా, నర్ధాంగి వగుదువని నిన్ను విడిచి యపకీర్తింబొందుట యుక్తంబుగాదు, కావున గావించిన నేరమునకై నిన్ను వధింపదలంచితిని" అనియెను. పతివ్రతా శిరోరత్నంబైన యామె "నాథా! పరమసంతోషముతో నే నంగీకరించుచున్నాను. నీచేతఁ జచ్చుటకంటె ముక్తి నాకు వేఱొకటి లేదు. ఎటులనైనను నీకీర్తిలోకంబున శాశ్వతంబుగా నుండవలయును. సంశయింపక నన్ను వధింపుము" అని సంసిద్ధయై నిలిచెను.

విజయాశ్వనృపతి భగవంతుని ధ్యానించి 'ఓదేవా! న్యాయబద్ధుఁడనై సకల గుణరాశియు, పరమ సాధ్వియునైన యర్ధాంగిని వధించుచున్నాను. నా పాపములు క్షమింపు" మని పలికి వాలునెత్తి యొక్క వ్రేటున కే తెగిపడులాగున నామె కంఠమున వ్రేసెను. ఆహా! దైవమాయ, తటాలున నతని చేతిలోని ఖడ్గము దూసిపోయి పుణ్యమానసయైన కళావతీదేవి అరుత దేవకుసుమ మాలికయై పొలిచెను. అంతట నచ్చట నుండిన ముని కళేబరముగాని, శిష్యుఁడుగాని, కానబడరైరి. ఆ మాయా ప్రకారముంగాంచి భూపతి యత్యాశ్చర్యమును బొంది యట్టు నిర్విణ్ణుడై నిలిచెను.

అట్టి సమయమున క్రొక్కఱు మెఱుఁగుబోలె యొక గొప్ప వెలుఁగు తళుక్కున దోఁచినది. అంతలో, లక్ష్మీసమేతుఁడై గరుడవాహనారూఢుండై, వెంటనే వీణాహస్తుండగు నారదుండరుదేర శ్రీమన్నారాయణుండు ప్రత్యక్షంబయ్యెను. పుణ్యదంపతులా కళావతీ విజయాశ్వులు తమకు సాక్షాత్కరించిన వారి శుభ లక్షణంబులంబట్టి వారు లక్ష్మీనారాయణులని తెలిసికొని యత్యంతానందముతో ప్రదక్షిణనమస్కారములు గావించి పెక్కు తెఱంగుల స్తోత్రముఁ గావించిరి. శ్రియఃపతి వారి

వినుతికి సంతసించి, "ఓయి రాజేంద్రా! నీవదాన్యతయు నీసతి పాతివ్రత్య మహిమయు నారదుండు చెప్పఁగా విని; మీ శీలముం బరీక్షించుటకై నేను మునివలెను నారదుండు శిష్యునివలెను రూపములుదాల్చి వచ్చి, యిచ్చోట వంచనతో నీసర్వస్వమును హరించి, నీభార్య శీలముం గనుటకై యంతఃపురమునఁబలుపోకల వర్తించితిని. ఆమె పరమ సాధ్వి యగుటఁ దెలిసికొని సంతసించితి. మీకు వ యు వరంబు లొసంగెద నేడుం"డని పలికెను.

ఆ రాజదంపతులు లేక వాక్యముగా తమకు మోక్షముదక్క యన్య వరములు వలదని చెప్పిరి. కాని భగవంతుఁడు కొంత కాలము మీరు భూలోకవాసుల కాదర్శకులై సుఖించుచుండి, పిమ్మట నాపదవినిఁ బొంద గలరని" యాదేశించి కరుణావృష్టులచే వారి నెంతయు సుస్నిగ్ధించితిరో హితుఁడయ్యెను.

అంతట నిందిరా ముకుందులకు మ్రొక్కి, వారలిరువురును లోకం బున దాతృత్వంబునను, పాతివ్రత్యమునననుసరియుగ వారు లేరనెడి ప్రఖ్యాతిని గడించి, యేకొంతయును నెఱుంగక దైవభక్తిపరులై సకల సుఖములు ననుభవించుచు, పెద్దకాలంబు పరమానందంబున నొప్పుచుండిరి.

కళావతీదేవి కథ సంపూర్ణము

# 13. దుర్గావతి కథ

ఉత్తర దేశమున భువనగిరి యను చిన్నపట్టణంబున శంభుదాసుం డను పేరుగల కాఁపువాఁ డొకండు గలఁడు. పరిపాటియైన కలిమి గలిగి వ్యవసాయము వృత్తిగా యాసంసారి సుఖముగా కాలముఁ గడుపుచుం డెను. అతనిభార్య పేరు దుర్గావతి ఆదంపతులకు పద్మనాభుండనెడి పుత్రుం డొకఁడు గలఁడు కాని, యాబిడుతఁడు తండ్రికార్యములకుఁ దోడ్పడగల శక్తిగలవాఁడు కాఁడు. పసివాఁడగుటచేతను నేక పుత్రుండగుటచేతను, గారాబముతోఁ బెంచబడుచున్న వాఁడగుటచేతను తండ్రి వానిని తనపను లలో ప్రవేశింపఁజేసి కష్టము లొందించుట కిష్టములేక యానగరంబునం గల పాఠశాలలోఁ జేర్చి విద్యాభ్యాసముఁ జేయించుచుండెను.

పద్మనాభుఁడు మిక్కిలి చురుకైన బుద్ధిగలవాఁడగుటచే ఒజ్జలు బోధించు విషయములను త్వరలో గ్రహించుచు, కొలఁది దినములలోనే బుద్ధిమంతుఁడను ప్రఖ్యాతినిగడించెను దుర్గావతి మహాపతివ్రత. ఆమె మనోవాక్కాయ కర్మములందు తనకు భర్తను మించిన దైవంబు వేఱు గలుగదనెడి నిశ్చయముతో సదా పతిశుశ్రూషయందే నిమగ్నమై యధికమగు దైవభక్తిగలిగి పేదలయందు దయయు, నతిథి యభ్యాగతుల నాదరించుటయుం దత్యంత ప్రియంబును నొప్ప, సదాచార సద్గుణసంపద లతిశయింపఁగా సర్వజనులు గొనియాడు తెఱంగున వర్తించుచుండెను.

వారు నివసించుచున్న పట్టణమునకు సమీపములో నుత్తరపుదిక్కున 'విశాల'—యనెడి నది యొకటి సర్వదా జలపూరితమై ప్రవహించుచుండెను. ఆవాహిని కవ్వలి యొడ్డున విష్ణ్వాలయ మొకటిగలదు. అందలి దేవునిపేరు మాధవస్వామి, దుర్గావతికా మాధవస్వామి యందు భక్తి మెండు కావున నపుడపు డచ్చోటికి బోయి దేవుని నారాధించి వచ్చుచుండును. ఆ నగరవాసు లచ్చటికిఁ బోవలసినపుడు యేఱు దాఁటవలసి యుండుటచే, యెల్లపుడును జనుల రాకపోకల సౌకర్యమునకై రాజుగారిచే యేర్పాటు చేయఁబడి యుండెడి తెప్పపై నెక్కిపోయి వచ్చుచుండుదురు. ఇదియచ్చటి పద్ధతియైయుండినను దుర్గావతి తానెపుడునుం దెప్పపై నెక్కి యేఱు దాటిపోయి యెఱుంగదు. మఱి యేలాగున లోఁతు నీరు గల నదిని దాటిపోవును? ఆమె సాధారణముగా నేలపై నడచినట్లే నీటి మీఁదనడచిపోవుచుండును. సాధారణముగ గుడి కాదుర్గావతి యుందఱివలె పోవునది కాదు. ఆమె పగలు పోవుటయే లేదు. మఱి యెట్లనగా, తన యింటఁగావలసిన పనులన్నియుం దీర్చుకొని, భర్తకును కుమారునకును భోజనంబిడి వారు భుజించి శయనించినంతట, పశ్చిమంబున బూజాద్రవ్యములను బెట్టుకొని యొంటరిగాఁబోవును. అపుడామె దారిలో యేటినీరు గట్టిపడి నడచుట కనువుగా నేర్పడుచుండును. పుణ్యవతియైన యామె యివ్విధమున యేఱు దాఁటి యాలయమువాకిలిఁ జేరఁగానే పూజారి మూసి తాళము వేయఁబడియున్న తలుపులు తమకు తామే విడి తెఱచుకొనుచుండును.

దుర్గావతి గుడిలో ప్రవేశించి స్వామిని సందర్శించి మ్రొక్కి తాను కొనివచ్చిన పూజవస్తువులతో మహాభక్తితో పూజించి ప్రార్థించి తన పతికిని సుతునకును నాయురారోగ్యము లొసంగి రక్షించుటకు వరంబు వేఁడి

యటనుండి వెలువడుచుండును. ఆమె రాగానే గుడితలుపు లెప్పటివలె మూసుకొనుచుండును. ముందువలెనే యామె నదినిదాఁటి యింటికి వచ్చి పిమ్మట తాను భోజనంబు జేసి దేవుని ధ్యానించి శయనింపఁ బోవును. ప్రతిదినము నామె యిట్లే చేయుచుండును. ఈలాగునఁ గొంత కాలము గడచెను.

ఒకనాఁడు దుర్గావతి మగఁడామెనుజూచి "సుశీలా! ఒకవిషయము నాకు బోధపడకున్నది. అడిగెదను నాసందేహమును నివారింపుము" అని యడిగెను. ఆసాధ్వి, "నాథా! నాయెఱింగిన విషయమైనచో, దానిం జెప్పకుండుదునా? అడుగుఁడు" అనెను. శంభుదాసుం డర్ధాంగిని "నీవు ప్రతి దివసంబును రాత్రివేళ నిర్భయముగా దేవుని గుడికిబోయి యారాధించి వచ్చుచుండెదవు. దారికడ్డముగా నగాధజల పూరితమై ప్రవహించుచు యేఱుగలదు. తెప్పున్ననో, నీవుపోవు సమయంబున దాటించు వారలెవ్వరు నచ్చోటనుండరనుట నేనెఱుంగుదును. మఱియొక విశేషమేమనఁగా దేవాలయపు వాకిలి మూసి తాళము వేయఁబడిగదా యుండును. ఇటువంటి యాటంకములను, మార్గమున సంభవింపగల చోరుల దెస్సరమును దప్పించుకొని, నిస్సహాయముగా జని దేవుని బూజించి వచ్చుచున్న దానవు. ఇదియెట్లు? ఏదేనియు మంత్రమహిమచేతనా? ఇంద్రజాలవిద్యయా! ఏలాగున నీకాకార్యమును దినముదప్పక గావింప నేర్చియుండెదవో యారహస్య మెట్టిదియో వివరింపవలయునని కోరుచున్నాఁడను. ఎక్కునాళ్ళనుండియు నివ్విషయ మడుగవలయునని తలంచుచుంటిని. కాని ఆ తలంపున కపుడపుడే మఱపుగలుగుచుండెడిది. ఏలాగుననైన నను నేఁడు తెలిసికొనవలయునని జ్ఞప్తియందుంచుకొని యడిగితిని. ఇదియే నేనడుగ నెంచినది" అని పలికెను.

పతిమాటలువినిన దుర్గావతి ముఖము వికసించెను. మొగంబున చిఱునగ వంకురింపఁగా "ప్రాణేశ్వరా! ఏమంత్రముగాని నేనెఱింగినదానను గాను. జాలవిద్యయుం దెలియదు నాకార్యమును నేను నియతిదప్పక నెఱవేర్చుకొనుచుండుటకు మీరు చెప్పిన నెవ్వియుం గారణములుగాఁజాలవు. అటువంటి వానితో నాకెట్టి సంబంధమును లేదు. మఱి యెట్లనఁగా మీపాదారవింద ధ్యానమును మీయందుఁగల నాలోనిభక్తియునే యిట్టి నాశక్తికి కారణములు. కళంకరహితమైన చిత్తముతో, మిము దైవము గాభావించి సేవించుచుండెడి దాననగు నాకు దుర్ఘటమగు కార్యమెట్టి

నైన నేలగలుగునా! హృదయమున మీపాద కమలములను స్థాపించు కొని భక్తపరాధీనుండైన భగవంతుని స్మరింపుచు నితరచింతలు వీడి పోవుచుందును. కావున యేటినీరు గట్టిపడి, నేనరుగుట కనువుగా నేర్పడును, గుడితలుపులును తెఱచుకొనుచుండును. నారాధన ముగిసి వచ్చినంతట నవి యథాస్థితిని బొందుచుండును. ఇంత మాత్రమే నేనెఱుంగుదును. మంత్రములును మాయలును నాకెవ్వియుం దెలియవు" అని చెప్పెను.

ఆపలుకులు వినగానే యతని కాశ్చర్యముగలిగెను. తనలో 'అవురా! ఎట్లు? నాయందు తనకుఁగల భక్తియే యీమహిమకు కారణమఁట. ఇవి వింతమాటలు గదా? ఆభక్తియెట్టిదగునో పరీక్షించి తెలిసికొనిననేగాని నాబుద్ధికి నమ్మకము బుట్టదు'అని తలంచెను. తన భార్య సుగుణ శీలంబులఁ జక్కగా నెఱింగినవాఁడైన యాశంభుదాసుడా విశేషమును దెలిసి కొనవలయునని తలంచి "గుణవతీ! నీమాటలవలన నాకుమిగుల నచ్చెరువు బొడముచున్నది. నీవు సాధ్వివే యగుదువుగాక, ఐన? ఏటినీళ్లు గట్టిపడు టయు, బీగము వేయఁబడిన గుడి తలుపులు వీడిపోవుటయునెట్లు సంభవిం చును? ఇంతటి గొప్పమహిమ యొకటి పతిభక్తిగల పడతికిఁ గల్గియుం డునా? దీనిని శోధించి తెలిసికొనిన నేగాని నేను నమ్మఁజాలను. నాసందే హము నెవ్విధమునఁ దొలగింపఁగలవో యాలోచనఁజేసి తెలియఁబలు కుము" అనియెను.

దుర్గావతి పతినిజూచి "ప్రాణేశ్వరా! ఎట్టిమంత్రములును, మాయ లును నేనెఱింగినదానను గాను. నాకృత్యమునకు సదా మీపాదములను మనంబున స్థాపించుకొని ధ్యానించుచుండుటయు, పరమేశ్వరుని నిర్మల భక్తితో భజించుచుండుటయునే కారణము మీయొక్క చరణాబ్జముల స్మరించుటయును శ్రీమన్నారాయణుని నామంబులను విడువక మననముఁ జేయుటయు, నను నివియే నాకుఁ దెలిసిన మహామంత్రంబులు, మీపాద ములు సాక్షిగా నన్యమహిమాస్పదంబగు విద్య యేదియుం దెలియదు" అని పలికెను.

ఆమె మాటలు వినఁగానే శంభుదాసుని యాశ్చర్యము మఱియు నధికమయ్యెను. "ఏమీ? ఆలాగా, దైవభక్తియు, పతిభక్తియుం గలిగి యున్న ప్రవాహ జలములు గట్టిపడునా? గుడి తలుపులు బిగంబు లూడి పోవునా? ఇటువంటి వింతను నేటివరకును విన్నదియుం గన్నదే

లేదు. అది యెట్లో నిదర్శన పూర్వకముగాఁ దెలిపిననేగాని నాయందలి సంశయమునివారణము కాఁజాలదు'' అని చెప్పుటయునమ్మగువ ''మంచిది మీసందేహము నివారణమగునట్లు చేసెదను. నేటిరాత్రి నేను హృషీకేశారాధనార్థము బోవునపుడు మీరును నావెంటరండు. మీకుసర్వమును విశదము కాఁగలదు'' అని పలికిన యతఁడటుల చేయుటకు సమ్మతించుటయు, నామె మరల నిట్లనియె. ''నాథా! మీరు నావెంట వచ్చుటకుఁ దలంచినది నిక్కమేయైనయెడల నొకనియమంబు నవలంబింపవలయును, ఎట్లనఁగా మనముపోయి దేవుని సందర్శించి పూజించి మరలి వచ్చునంత వరకును భుజింపక, స్నానముఁజేసి, శుచిగా దైవమును స్మరించుచుండ వలయును. ఇదియే యా నియమము'' అని చెప్పెను.

భార్య చెప్పినట్లు చేయుటకు శంభుదాసుం డొప్పుకొనెను. భార్యా భర్త లిరువురును శుచిర్భూతులై యుండి, పగటి భోజనముదప్ప వారు దేవుని పూజించువరకునుకూడదని రాత్రిభోజనము మాటఁ దలంపకుండిరి. 'ఎప్పుడు ప్రొద్దు గ్రుంకునా, ఎపుడు నాభార్యమహిమను దెలిసికొందునా' యని గడియలు లెక్కించుచుండెను. సూర్యుడ స్తమించి నంతట దుర్గావతి యింటిపనులు తీర్చుకొని కమారున కన్నముఁబెట్టి నిద్రబుచ్చి శుచియై పూజాద్రవ్యంబులుగొని భర్తనుదోడ్కొని దేవాలయమునకు ప్రయాణమై పోవఁదొడంగెను.

నాఁడు పయినీరు వచ్చుటంజేసి యేఱు రెండుదరులునంటి మహాయినుమడితో పాఱుచుండెను. ఆనీటివేగమును జూడగానే శంభుదాసుడు తనలో 'అయ్యో! ప్రవాహ మెక్కుడై నదే! నేడు దాటుట కెట్లువలను పడును?' అని వెఱగుపడిచూడఁదొడంగెను. దుర్గావతియన్ననో లేశమైనను భీతినొందక వాడుకప్రకారము నీటిచెంతకుఁజని మనంబునఁ బతిపాదములను స్మరించి రమారమణునిం దలంచి, జలంబులం బ్రార్థించి వల్లభుని జూచి 'నాథా! నాయడుగుల ననుసరించి వెనుకనే రావలసినది వెఱవవలదు. భగవన్నామమును స్మరింపుచునే నడువవలయును. ఈ మాట మరువవలదు' అని చెప్పి నీటిపై నడుగుబెట్టెను. నీరుగట్టిపడి రాయువలెనయ్యెను. నేలమీఁద నడచినలాగుననే యామె సులభముగను నిర్భయముగను నడువసాగెను. భార్య చెప్పిన పద్ధతి ప్రకారము వెనుకనే శంభుదాసుఁడును బోవఁ దొడంగెను. త్వరితముగా నడిచి యిరువురును నదిని దాఁటి గుడివాకిలిఁ జేరిరి.

అపుడా సాధ్వీమణి తలుపుల నంటగానే బీగము లూడిపోయెను. ఆమె యాలయంబులోఁజొచ్చి ధూపదీప నైవేద్యాది విధులచే భగవంతుని పూజించి సాష్టాంగ నమస్కారము లు గావించెను. అంతవరకును భార్యచేయు పూజలం గాంచుచు చేతులుమోడ్చి నిలిచియున్న శంభు దాసుఁడును దేవునకు నమస్కరించి స్తుతించెను. అంతట నిరువురును గృహంబునకుఁ బోవుటకై దేవళములో నుండి వెలుపటికి వచ్చిరి. తలుపులు మెప్పటి తీరున మూసికొనియెను.

ఇదియంతయుం జూచుచున్న శంభుదాసుఁ కది స్వప్నమా?నిజమా? యని సంశయింపవలసి నట్లుండినది. సతీపతులు నది దాటుటకై నీటిపై నడువ నారంభించిరి. మధ్యభాగమున వచ్చుచున్నప్పుడు శంభుదాసుఁడు తనలో 'ఆహా! ఇంతవరకు నేమోగదా యని సామాన్యముగా దలంచుచుంటిని, ప్రత్యక్షముగా చూచినంతట, నాభార్య పతివ్రతిమహిమ స్పష్టముగా నేర్పడినది. మేలు మేలు. ఇంతటి ప్రతిభావతియైన భార్య గలనాకు నేకొదువయుండును? లోకంబున నన్ను మించఁగల ధన్యుఁ డెవ్వఁడు? సంపన్నుఁ డెవ్వఁడు? ఎంతటి దుర్ఘట కార్యమును గాని నాయర్ధాంగి మూలమున నేను నెఱవేర్చుకొనఁగలను. ఇంక నెట్టిభయమునుం గలుగదు. ఎంతవానినైనను గణింపవలసినదియే లేదు'అని యహంకార చిత్తుఁడై తలంచెను తత్ఫలంబుగా నాక్షణమె యతండా మహాప్రవాహ జలంబులలో దిగ్గన మునింగిపోయెను.

పతి నీటిలో మునిగిపోవుటంగాంచి దుర్గావతి దిగులొందె. 'ఆకటా! విభుండు మునిగిపోయెనే. యింక నెట్లు? ఏమిగతి? ఈదుటకైనం దెలియని మద్వల్లభుండు యీ పెను వెల్లువలోఁబడి ప్రాణముల నెట్లుదక్కించుకొన నేర్చును? గొప్పయాపద సంభవించెనే! నేను చెప్పిన నియమమును మఱచెను కాఁబోలు! కాదేని వచ్చునపుడు నిర్భయముగా జనుదెంచెను ఇపుడేల మునిఁగిపోయెను? హరిహరీ! పరాత్పరా! రమావల్లభా! భక్తవత్సలా! భవదీయ పాదారవిందములను నమ్మి నిశ్చలభక్తితో సంతతము నారాధించుచుండెడి మీ సేవకురాలనగు నాకిపుడిటువంటి దుఃఖమును గలిగించితివేల? నేనేమి నేర మొనరించితిని? జగద్రక్షకా! ఆపద్బాంధవా! పుణ్యస్వరూపా! కరుణింపుము. నా మొఱాలకించి మదీయ వల్లభుని ప్రాణములు రక్షించి నా దుఃఖమును నివారించుము' అని దేవునిఁ దలంచి ప్రార్థనముఁ గావింపఁ దొడంగెను.

మహా పతివ్రతయైన యామె కారాత్రికాలమున నదీమధ్యమున నొక యశరీరవాక్కు వినఁబడినది. ఎట్లనగా! ఓ పుణ్యశీలా! దుర్గావతీ! నీయందెట్టి దోషమును గలుగదు. కాని, నీవిభుండు మిక్కిలి యహంకారమును బొంది, తలంపున నెన్నెన్నియో కోరికలంబొంది యోచించెను. తత్కారణంబున నీభర్తమునింగిపోయెను. అతండు జీవించుట దుర్లభము అయినను నీవు మిక్కిలి సాధ్వివి, నిష్కళంక మానసవు. నిశ్చలభక్తి గలుగుదానవు గావున నొక యుపాయంబుచే పతిని బ్రతికించుకొన వచ్చును. అది యెట్లనఁగా వినుము నీవు యింటికేగి యీరాత్రిఁ గడపి యుదయమున నీ యేటిదరికి వచ్చి చూచితివేని నీపతియొక్క మృతకళేబరంబు గట్టునొక గడ్డనందునఁదగుల్కొనియుండుట నీకుఁ గండ్లఁబడును. అంతట నీకుమారుని రావించి స్వయముగా నీవా కుమారుని మెడద్రుంచి యా నెత్తురు నామృత కళేబరంబుపై జిలికినచో యతండు ప్రాణంబు బొంది లేచి వచ్చును. ఇదిదక్క మరి పతిని బ్రతికించుకొనఁదగిన యుపాయము వేఱు గలుగదు. భర్తగావలయునన్న కొడుకును జంపవలయును. కొడుకు గావలయుననిన భర్త జీవింపజాలఁడు. ఇరువురిలో నొకని జీవంబులు పోవలసి యుండును. పుణ్యాచిత్తవగుటచే యీ రహస్యము నెఱిఁగించితిని. ఇందు యేది యిష్టమగునో యా తెఱగున నొనరింపుము'' అని పలికి యశరీరవాణి చాలించెను.

ఇట్టి మాటలు వినగానే దుర్గావతికి మిన్ను విఱిగితలపైఁ బడినట్లు తోఁచినది. ఈ సందిగ్ధ విషయమును గూర్చి యేమిచేయుటకును దోఁచినదికాదు. మహా దుఃఖముతో మందిరమున కరిగి యాలోచింపఁదొడంగెను. ఆమె యెట్లు చేయును? పాపము! భర్తను బ్రతికించుటకై చేజేత కన్న కొడుకును వధించుట కెటుల సాహసింపఁగలదు? అలాగు చేయకున్నచో ప్రాణతుల్యుఁడగు భర్తను కోల్పోవలసినదేనా? పతివిహీనయగు తన జన్మమేటికి? జీవిత మేమిటికి? రెండును నుపద్రవకరములగు విషయములే! అయ్యో! ఆ రాత్రియంతయు నామె శోకించుచు గడపి తెల్లవారగనే నదీతీరములకుఁ బోయి యాయొర నొకచోట చిక్కుకొనియున్న భర్త కళేబరముగాంచి రోదనముఁ జేయుచు మెల్లగా నొడ్డునకుఁ జేర్చి, యాతనువుపైఁబడి యల్లాడఁ దొడంగెను.

ఎంతతడవటుల నేడ్చినను, అశరీరి చెప్పినట్లుచేయకుండిన నతండు బ్రతుకునా? లేదుగదా? అమ్మహాపతివ్రతల్ స్త్రీల కేడుగడయును పతులే.

యనుటం దలంచి కొడుకును జంపినైనం బతిని బ్రతికించుట యుత్తమపథం బని నిశ్చయించి, యింటి కేగి, వర్తమానము తనయున కెఱింగించిన యా బాలకుండు తండ్రి జీవించుటకుగా తన ప్రాణమును సంతోషముతో నర్పించెదనని నిబ్బరముతో నంగీకరించెను.

అంతట దుర్గావతి వాలు నొకదానిం గైకొని ప్రియనందనునిం దోడ్కొని యేటియొద్దనుం బడియున్న కళేబరము దగ్గరకువచ్చి భగవంతుని ధ్యానించి "దైవసమానుండైన నాభర్త జీవించును గాక" యని యధిక దృఢబుద్ధియై తటాలున సంసిద్ధుడైయున్న కుమారుని కంఠమును ద్రుంచి యారక్తమును పతిదేహముపై జల్లెను. వెంటనే శంభుదాసుండు నిదురించువాడు మేల్కొనునట్లు లేచి భార్యను, ఖండితుండైన కొడుకునుంజూచి భయాశ్చర్యమగ్నుడై విచారించి పత్నివలన జరిగిన దంతయు విని కడుంగడు దుఃఖాక్రాంతుండయ్యెను.

అట్టియెడ లక్ష్మీసమేతముగా కమలనాభుం డాసాధ్వీమణికి బ్రత్యక్షమై "పుణ్యశీలా! నీపతిభక్తికి మెచ్చితిని. భర్తకొఱకై కనిపెంచిన ముద్దుకొడుకును సయితము ప్రియంబువిడిచి వధించితివి. నీతో సరిబోల్ప దగిన పతివ్రత లోకంబున వేఱొకతె లేదు. కోరినవరంబు నొసంగెద నడుగు"మని పలికెను. దుర్గావతి తనకుం దోచినవారు లక్ష్మీనారాయణు లని యెఱింగి భక్తియతిశయింపగా ప్రదక్షిణనమస్కృతులం జేసి చేతులు మోడ్చి నిలిచి స్తోత్రముగావించి "మీసందర్శనమువలన కృతార్థురాల నైతిని. పాపంబులు తొలంగినవి. మీదివ్యస్వరూపములను గనుచున్న నాకు మఱియేమి గోరుటకు తలంపుగలుగును? నన్ను మీకృపాపాత్రురాలనుగాం జేయుండు. ఇదియే నాకోరిక" యనియెను.

దయామయుండైన భగవంతుం డామె సద్భావంబున కలరి కృపాదృష్టులంగాంచి, "మానినీమణీ! నీవు పరమభక్తురాలవు. నాయనుగ్రహంబు కలిమిని నీకే కీడునుం గలుగనేరదు. నీపతిభక్తి లోకులకుం దెలుపుటకై నేనే యిట్టి పన్నాగమును గల్పించితిని. నీభర్తనుమునింగి మృతుడగునట్లు చేసినదియు, అశరీరవాక్కులచే గర్తవ్యము నుపదేశించినదియు నేనే యని యెఱుంగుము. ఖండితుండైన నీపుత్రుండు జీవింపగలడు. మీరు సదా నాయందు భక్తిగలవారలై వర్తింపుచు, మదీయ కృపచే సకల సుఖంబులు ననుభవించుచుండుండు" అని చెప్పి తిరోహితుండయ్యెను.

అంతలోనే యామె కుమారుండును జీవించి నిలిచెను. పతితోడను పుత్రునితోడను దుర్గావతి యిల్లుచేరి పరమేశ్వరుండు దయచేసి, తన దుఃఖనివారణం బొనరించినందుల కాదేవదేవు నెంతయేని గొనియాడి సర్వకాల సర్వావస్థలయందును భగవద్భక్తియు పతిభక్తియును విడక యా సాధ్వీమణి స్త్రీల సత్ప్రవర్తనమునకు మార్గదర్శకయై సుఖముగా కాలమును గడుపుచుండెను.

దుర్గావతి కథ సంపూర్ణము

# 14. సులభకథ

మున్నొకకాలమున కాంచీపురములో సహదేవుండను కుమ్మరి యొకడుండెను. వాని భార్యపేరు సులభ. మహాసతివ్రత. సహదేవుని కా పురవాసులకు కావలసిన మట్టిపాత్రలుచేసి యొసంగుచుండుట వాడుక, అయినను నందఱు కుమ్మరులవలె నతండు తానుచేసిన కుండల నావములోఁ బెట్టి కాల్చుటలేదు. మఱియెట్లనిన నతని కులాంగన యంటిన మాత్రమున నతఁడుచేసిన కుండలు గట్టిపడుచుండుటయే గాక, కాల్చఁబడిన వాని కన్నను నెక్కుడు కాలము పగిలిపోవకుండును.

ఈవింతను చూచి పౌరులు విస్మయచిత్తులై, యది యంతయును సులభయొక్క పాతివ్రత్య మహిమ యగుటం దెలిసికొని యామెయం దెక్కుడు గౌరవభావము గలవారై, మూల్యం బెక్కుడని తలంపక యామె తెచ్చిన భాండములం గొనుచుందురు. మరియొక విశేష మేమనగా, నుత్తమవర్ణము వారమని విఱ్ఱవీగుచుండు బ్రాహ్మణాదులు నాలవ కులమునఁ బుట్టిన కుమ్మర చానకుం గల శక్తి తమకు గలుగకుండుటం దలంచి సిగ్గువొంది, చింతాక్రాంతులగుచుండిరి. వారు వారును సులభ వలె తామును పతివ్రతలుగానుండి యంతటి మహిమను సంపాదింపవల యునని తమవలన నైనంతవరకును బ్రయత్నించుచుండిరిగాని సాధ్యము గాదయ్యెను.

ఇట్లుండఁగా పౌరకాంతలు కొందఱు ఒకచోటఁజేరి యాసులభ శక్తి యెట్టిదో పరీక్షింపవలయునని నిశ్చయించి తమయత్నము నెఱవేఱు టకొక యాలోచన గావించిరి. వారలు చేసినపని యేమనఁగా, తమతమ

దమకుఁ గొన్ని భాండములు గావలయుననియు తెచ్చి యివ్వవలసినదనియు సులభకుఁ జెప్పిపంపిరి. వారు వారుఁగోరిన ప్రకారముగా నామె వాడుక ప్రకారము పచ్చికుండలు దెచ్చి యిచ్చెను. ఆమె పోయినంతట యాస్త్రీలు వాని నన్నిటిని బగులగొట్టి పెంకులు జేసి, సులభను రప్పించి యాపెంకుల నామెకుఁజూపి "చూచితివా? అన్నియుం బగిలిపోయినవి. ఏకారణముననో యిదివరకును పగలనివి నీరు బోయఁగనే దబదబ పగిలిపోయినవి. ఔను! కాల్చని పచ్చికుండలు నిలుచునా? అంతటి సత్యకాలమా యిది? మాకు కాల్చిన కుండలను దెచ్చియిమ్ము. ఈపచ్చికుండ లేమిటికి?" అని యేక వాక్యముగాఁ బలికిరి.

ఆ కుండ పెంకులం జూచి వారిమాటలు వినఁగానే, యది యంతయును వారలొనరించిన కపటతంత్రమని తనలో నెంచి 'కానిమ్ము. నేడు కాల్చిన కుండలు మాకెక్కడివి? ఎప్పుడును నేను వీరికిఁ బచ్చికుండలనే గదా? తెచ్చియిచ్చుచుంటిని. ఎన్నఁడును బగలనివి నేఁడుపగిలిపోవనేల? నన్ను శోధించుటకే వీర లివ్విధమునఁ జేసి యుందురనితోచుచున్నది ఐన నేమి, భగవంతుని కృపయున్నచో నాకార్యమునకు భంగమువాటిల్ల నేరదు" అని తలంచి వారలంగాంచి "అమ్మలారా! సదా పచ్చివగుభాండములనే యిచ్చుచుంటిని, నేనొసంగినవి యిప్పటివరకు పగిలిపోయినది లేదు. మీరును చెప్పినదియును లేదు. కొయ్యతో, రాతితో, కొట్టిననే గాని యవి పగులవు. అటుల జరిగి యిదివరకును చూచి యెఱుంగను. ఇపుడన్ననో, నొక్కసారిగా నిందఱకును నాయొసంగిన కడవలు తమకు దామే బ్రద్దలగుట యాశ్చర్యకరముగానే యున్నది. అయినను వగవవలసినది లేదు. నేమి మీకొసంగిన యీమృత్పాత్రము లన్నియు నెప్పటిలాగున నేర్పడఁగలవు" అని పలికి దేవుని స్మరించి, పతి పాదములను మనంబుననిలిపి ధ్యానించి "మనోవాక్కాయకర్మలందు సదానిష్కళంక పతిభక్తిదక్కవెుండుతలంపులేని దాననేని, ఎపుడును నా భర్తయే దక్క యన్యమగుదైవంబుగలుగదని దృఢముగానమ్మి, తదీయసేవా నిమగ్ననై వర్తించుచుండెడి దాననగుదునేని, సర్వకాల సర్వావస్థలందును, ననృతముపలుకక, యకార్యములుజేయక పరిశుద్ధభావముగలదాననై యుందునేని, ఈశకలములైన భాండములన్నియును, నేనొసంగినపు డెటుల నుండెనో యటుల నేర్పడునుగాక" యని పలికి నిమిష కాలము కన్నులు మూసి ధ్యానము గావించెను.

అందఱును నత్యాశ్చర్యముతోఁ జూచుచుండఁగా తటాలున పగిలి పడియున్న పెంకులు దేనిదేనివి యగునో, దానిదానికి, పటపటశబ్దముతో నెగిరి తమంతట తామే యంటుకొని ముందున్నతీరున కుండలుగా నేర్పడియె ఇంచుకయు నంటుకొనిన గుఱుతు యేర్పడక క్రొత్తగా చేయఁబడిన వానివలెనే యుండెను. ఆవింతనుజూడఁగానే పరీక్షింపఁబూనిన వనితలకుఁ గలిగిన యాశ్చర్య మింతింతగాదు. వారలామెను 'దేవతా స్త్రీగానుండి యేదేనియు శాపమువలన మానవమానవతిగాఁ బుట్టినదేమో' యని సంశయించిరి. ఆ భామినులు సురభంజూచి "అమ్మా! వేలుపుటింతివో, మనుష్యకాంతవో, యిట్టిదానవని నిన్ను తెలిసికొనజాలకున్నారము. విన్నదియుం గన్నదియుం గాని యీవిచిత్ర మెట్టిదైయో మాకుఁ దెలియలేదు. పగిలిన కుండపెంకు లంటుకొని యథాప్రకారముగా భాండము లేర్పడుట యనిన సామాన్య విషయమగునా? ఇట్టి యద్భుతమును జూచినంతట సామాన్య మానవమాత్రురాలవుగావని తోఁచినది మనుజవనితవేయైన యెడల యీమహిమ యెట్టిది? జాల విద్యాప్రభావమా? లేక యేదేని మంత్రబలమా? ఓతల్లీ! నిన్ను కులాలకులజవుగాఁ దలంపము. నీకిందరమును మ్రొక్కుచున్నాము. భవద్వృత్తాంతమును వివరించి మమ్ము ధన్యులను జేయుము" అని బహువిధంబుల గొనియాడి ప్రార్థించిరి.

సులభ మందహాస ముఖారవిందయై "అమ్మలారా? ఇంతగా గొప్పవారలైన మీరు కొనియాడఁదగిన యాధిక్యత నాయం దిసుమంతయును లేదు. కుమ్మరజాతిలోఁ బుట్టిన నేను దేవకాంత ననందగిన ప్రభావముగల దానని మీరు తలంచుట యుక్తముకాదు. ఏ మంత్రములును మాయములును నాకుఁ దెలియవు. ఎప్పుడును నామనం బొకటియే. ఎట్లనఁగా యేకగడమును నాకు పతియే యని నిశ్చయించి సదా పతిభక్తి గలిగి భర్తను సేవింపుచు నభిప్రాయంబెఱింగి యాజ్ఞానువర్తినై, సదా నాథుని మనంబున నిర్మలచిత్తముతో ధ్యానించుచు నాచార ధర్మశీలంబులును, శ్రద్ధాభక్తులును విడువక పేదసాదులయందు దయయు నతిథి యభ్యాగతుల నాదరించుటయందు ప్రియంబును గలిగి దేవతార్చనమును, పెద్దలం గాంచిన విధేయతయు నిట్టి మంచి పద్ధతులను విడువక వర్తించుచుండుట నానిత్యవ్రతము. ఇదిదక్క మఱియొక విషయమును నే నెఱుంగను. పచ్చి కుండలు పగులకుండుటగాని, పగిలిన భాండకలశము లంటుకొని యథాస్థితిని బొందుటగాని, మదీయవల్లభుని చరణారవింద ధ్యానమహిమయేగాని

వేఱుకాదు. ఇట్టి యల్పజాతి సంభవనగు నన్ను మీరు పొగడి పలుకుట వినఁగా మిక్కిలి సిగ్గు బొడముచున్నది. గౌరవవంతులైన మీరు తార తమ్యములఁ దలంపక యొక యల్పవిషయమును పెద్దగాఁదలంచి మెచ్చి పలుకుట సరిగాదు సుఁడీ?" అని పలికెను.

సులభ యివ్విధమునఁ జెప్పఁగనే యావాక్యంబును వినుచున్న యువతులకు ముందటికన్న నాశ్చర్య మెక్కుడయ్యెను. వారు "ఎట్లూ? పతిభక్తియా! ఆహా! పతివ్రతల కింతటి మహిమగలదా? ఇంతటి గొప్ప శక్తిని గడించక కీర్తిప్రతిష్ఠలు లేక మన మెంతకాలము జీవించియుండినను నేమి ప్రయోజనము? ఛీ! మన బ్రతుకేమి బ్రతుకు? మనమును యీపుణ్యవతివలె భర్తృభక్తి గలవారమై సదా పతిని దైవముగా నెంచి సేవించుచు పవిత్ర చరిత్రలమై లోకంబున నుత్తమ స్త్రీలననెడి [illegible] శాశ్వత కీర్తినిఁ బడయుదముగాక" అని యోచించినవారై, తమ నాథులయందు మిగుల ప్రియము గలిగి వర్తించుచున్నవారై యున్నను, తద్విధంబును క్రమముగా నెఱింగి వర్తించుట యుచితంబని యెంచి, బహువిధంబుల సులభను ప్రార్థించి యామెవలన పతివ్రతా ధర్మంబులం దెలిసికొని ధన్యులైరి.

సులభ యాస్త్రీ సముదాయంబుతో "అమ్మలారా! పతివ్రతా ధర్మములను గ్రంథములందు చదివి, తత్ప్రకారంబున ప్రవర్తింపవలసిన విషయముకాదు. వారువారును సత్యము, కరుణ, శాంతము, దైవచింతనము పరోపకారము మొదలగు మంచి లక్షణములలో బుద్ధిస్థిరముగా నిలుచులాగున తమకుఁదామే యలవాటు చేసుకొని భర్తమాటకు జవదాటక, కలిగిన వట్టుననుం దృప్తినొంది, శక్తికొలది సత్కార్యములను జేయుచు పరపురుషులను తండ్రులుగను, పుత్రులుగనుం దలంచుచు నిర్మలచిత్తముతో కాలము గడపుచుండుట యుత్తమ స్త్రీల లక్షణము అట్టి పవిత్ర చరిత్రలకు శాశ్వత పుణ్యలోకము ప్రాప్తించునని పెద్దలు చెప్పెదరు. ఇది నామతము. మీకుఁ దెలుపఁదగిన దానను గాకున్నను నడిగితిరిగాన నాకుఁ దెలిసినది చెప్పితిని" అని పలికి వెడలిపోయెను. అచ్చటి భామినులు సులభ యుపదేశమును వేదమంత్రముగా నెంచి యవలంబించి, యదిమొదలు తాము నట్టి మంచి పద్ధతుల ననుసరించి వర్తించుచు, పుణ్యకాంత లనెడి విఖ్యాతిని బొందిరి.

సులభ కథ సంపూర్ణము

# 15 గిరికాదేవికథ

గిరికాదేవి, పైశాఖపురవాసియైన కపర్దియను బ్రాహ్మణుని ధర్మపత్ని, సుశీల, పతిభక్తిగల యుత్తమకాంత, కపర్ది సదాచార సంపన్నుఁడైన బ్రాహ్మణోత్తముఁడు, శాంతశమదమాది సుగుణములు గల సాధువర్తనుఁడు, వారి దాంపత్యము పూవునుందావియువలె శ్లాఘాపాత్రమై యొప్పుచుండెను. వారి కింకను సంతానము కలుగలేదు. పసికాపురము అన్యోన్యము నత్యంతప్రీతిగలవారై యుండిరి. గిరిక చిన్నదైయుండినను మంచి విద్యావతి. ఆమె తల్లిదండ్రులు పసితనము నుండియు పతివ్రతల మహిమయు స్త్రీలు తమ పతులయెడల నడుచుకొనవలసిన రీతులును మొదలుగాఁగల యోగ్యములగు ధర్మములను దెలుపుచును, నేర్పుచు నున్నందున నామె మొదటనుండియు, మేలైన వర్తనము గలిగినదై యుండెను. పరిణయమై భర్తృగృహమునకు వచ్చినంతట నయ్యుత్తమాంగన తన నాయకుని సర్వేశ్వర స్వరూపునిగా భావించి యతని మానసమున కెక్కులాగున మెలంగుచుండెను. ఇటువంటి భార్యను బడసిన కపర్ది కామె ప్రాణసమానయని వేఱుగాఁ జెప్పవలయునా?

గిరికాకపర్దులు యీరీతి కొలదికాలము సుఖముగా కాలము గడపుచుండఁగా, కర్మవశమున నాయుత్తమ భూసురునకు దేహాశక్యత సంభవించి యెన్నిమందుల నుపయోగించినను దీఱక, దినదినాభివృద్ధి నొందుచుండ మిక్కిలి కృశించి పోవఁజొచ్చెను. తన ప్రియకాంతునకు యిట్లు ఆరోగ్యము గలుగని దీర్ఘవ్యాధి సంభవించుటం దలంచి గిరికాదేవి యత్యంత విషాదమునుబొంది 'తచ్ఛాంతి రౌషధైర్దానైః జపహోమ సురార్చనైః' అని శాస్త్రము గలుగుటచే, భర్తరోగము శాంతిల్లుటకై, మంచిమందుల నిప్పించుచు దానధర్మము లొనరించుచు జపములు జేయుచు, హోమాది సత్క్రియలును భగవదారాధనాదులును గావింప, జేయుచు, తనవల్లనైనంతవరకును జరిగించుచుండుటయే గాక తానుసర్వకాల సర్వావస్థలయందును లక్ష్మీనారాయణులను పరమ భక్తి సంకలిత చిత్తయై పూజించుచుండెను. కాని, పాపము ఆమెచేయు కార్యములన్నియు బూడిదలోఁ జేసిన హోమమువలె నిష్ప్రయోజనములగుచుండెనేగాని, యొకదానివల్లనైనను ఫలము సిద్ధింపకుండెను, అనుభవింపక కర్మఫల మూఱక తీఱదు.

భర్తకు సౌఖ్యము లేకుండుటవలన నమ్మగువ తీఱని మనఃక్లేశము బొంది యలయుచుండెను. ఏమిచేయును? మఱి యిట్లుండఁగా నొకనాఁడు సన్యాసియొకఁడు భిక్షార్థియై వారి యింటికివచ్చెను, ఆమె యాతని నెంతయు భక్తితోఁ బూజించినాఁడు తమయింట భిక్షమొసంగి సత్కరించెను. అతఁడు రోగపీడితుఁడై యున్న కపర్దిఁజూచి గిరిక కతండు పతియగుటం దెలిసికొని తనలో 'పాపము! ఈ పుణ్యవతి తనపతివ్యాధిచే బాధపడుచున్నను, నతిథులను, నభ్యాగతులను భక్తితో నాదరించుచున్నది. ఇటువంటి సుగుణవతి యీవిధముఁ దుఃఖ మనుభవించుట న్యాయమగునా? దీనికేదేనియు బరిహార క్రియ దెలిపిపోవుట నాకు కృతజ్ఞతాలక్షణమగును' అని తలంచి మహిమగలవాఁడగుటచే కొంతతడవట్టె యోచనఁగావించి, విషయనిర్ధారణఁ జేసికొని, యాగృహిణింబిలిచి యిట్లని వక్కాణించెను. "పుణ్యాత్మురాలా! నేఁడు నిర్మలచిత్తవై భక్తితో భిక్ష యొసంగి యాదరించితివి. ఇటువంటి సుశీలవగు నీవల్లభుండు తీరని రుజచే వందురుచుండుటఁ జూడఁగా, నామనంబున నెంతయును జాలి బొడముచున్నది. ఇతని వ్యాధి పూర్వకర్మఫలముచేఁ గలిగినదిగాని, యీ పుట్టుకయం దెట్టిపాపమును జేసి యెఱుంగఁడు. ఇతని పాపములు తొలంగి యారోగ్యవంతుఁడగుట కొరకు యుపాయము గలదు. చెప్పెదను వినుము. ఎట్లుగాని శ్రమకోర్చి నీనాథుని వేంకటాచలంబునకుం దోడ్కొనిపొమ్ము. ఆకొండపై గోగర్భమను తీర్థసమీపమున, శిలలచేనేర్పఱచఁబడిన చిన్నయింటిలో నొక పుణ్యవతి, మహాపతివ్రత, తనపతితో వసించుచు తపస్సును చేసుకొనుచున్నది. ఆమెను సందర్శించి యామె నాశ్రయించితివేని, నీభర్త యామె యనుగ్రహముచే రోగము తీరి యారోగ్యవంతుఁడు కాఁగలఁడు ఇది నిజము' అని యాదేశించి తన యిచ్ఛం బోయెను. అతఁడు తమ యింటికి వచ్చినపుడు చూడఁగానే మహాప్రభావ సంపన్నుండని తెలిసికొనియున్న గిరికాదేవి యా పరివ్రాజకుఁడు చెప్పినమాటలయందు దృఢవిశ్వాసము గలదై కొందఱు కూలివాండ్ర నేర్పఱచుకొని, ప్రాణేశ్వరునిం దగిన యుపాయముతో నెత్తించుకొని, సన్యాసి దెలిపిన గురుతుల ప్రకారము శేషాద్రి మీఁది గోగర్భతీర్థము దాపుననుండెడి పుణ్యవతిని వెదకికనుంగొని జటావల్కల ధారిణియై తపోనిష్ఠగూర్చుండియున్న యామె పాదముల కెఱఁగి ముకుళితహస్తయై నిలిచెను.

వృద్ధురాలైన యా యుత్తమస్త్రీ కొంతతడవునకు నిమ్మనుచాలించి కన్నులు విచ్చిచూచి తనయెదుట నిలిచియున్న గిరికాదేవిని, తత్సమీపమున రోగపీడితుఁడై నేలఁ బరుండఁ బెట్టబడియున్న యామె వల్లభునిం గనుంగొని నవ్వుమొగముతో "తల్లీ! గిరికాదేవి! పావన స్వరూపుఁడైన సన్యాసి, యిచ్చటికినిన్ను పంపినందునవచ్చితివా? మంచిది కూర్చుండుము. నీభర్త రోగపీడితుఁడై చావునకు సిద్ధమైయున్న తరుణమున నమ్మహాత్ముండు వచ్చునది, నీయదృష్టమే కాని వేఱుకాదు. నేనును నీవంటి స్త్రీమాత్రురాలను. నీవన్ననో, మహా పతివ్రతవు. మహిమయందు నీకంటె అతిశయశక్తి నాయం దేదియుం గలుగదు. అయినను నిన్నిచ్చోటికిఁ బనిచిన మహాత్ముని వాక్యానుసరణిని వర్తింపవలసినది నా విధియై యున్నది"—అని పలికెను.

ఈలాగున పరివ్రాజిక చెప్పగానే గిరిక కొంతయు నద్భుతముగాఁ దోఁచి తనలో 'భళీ! ఇది యెట్లు? నా పేరును, మదీయవృత్తాంతమును నీమె స్పష్టముగా నెఱిఁగినట్లు పలుకుటయు, ఇచ్చోటికి నన్ను బొమ్మని చెప్పిన సన్యాసిని యీ పుణ్యస్వరూపిణి తెలిసియున్న దానివలెను వచించుటయుం జూడగా, నీమె మానవ స్త్రీమాత్రురాలు గాదని తోఁచుచున్నది. మహనీయులగు పుణ్యవతుల శక్తి నెవ రెఱుంగ నేర్తురు? ఈమె ప్రభావ మద్వితీయమైనది. కావుననే యా యతివరుం డిచటికిఁ బోవలసినదని చెప్పెను" అని తలంచి, యామెకు పునః ప్రణామంబుఁ గావించి, "జననీ! నీవు నన్ను మిక్కిలి సుగుణవతి ననియుం, బతివ్రత ననియు శ్లాఘించి పలికితివి. అంతటి గొప్ప లక్షణంబు లెవ్వియు నాయందు గలుగవని నే నెఱుంగుదును. పావనస్వరూపిణీ! నాయందుఁ బొడమిన యవ్యాజ ప్రేమాతిశయంబున నిట్లు చెప్పితివని, నిశ్చయముగా తెలిసికొంటిని. నీవు పలికిన విషయమంతయును వాస్తవము. నానా కష్టములంబడి భవద్దర్శనార్థినై వచ్చినదానను. ఇంక నిన్ను జూచినంతనే నాదోషములును, సంకటములునుం దొలంగు ననెడి, దృఢవిశ్వాసముగలిగినది." అని వినయముతోఁ బలికి మఱియు నిట్లనియె.

"తల్లీ! నీవు నన్నుఁగాని నేను నిన్నుగాని ఎప్పుడును చూచి యిది వరకు నెఱుంగము. ఇట్లుండగా, నన్ను చూడఁగానే నాపేరుం దెలిసికొని మదీయ వృత్తాంతము సర్వమును, చూచినట్లు చెప్పితివి. సన్యాసి నాతో చెప్పినమాటలును, నతం డిటకు నన్నుఁ బనుచుటయు నేను తెలుపుటకు

పూర్వమే యెటులగనుగొంటివి? ఈవిషయము నామనంబున కెంతేనియు నాశ్చర్యముఁ గలిగించుచున్నది. ఇది యెట్లో కరుణించి యెఱింగింప వలయునని వేడుచున్నాను" అని ప్రార్థించి యడిగెను.

సాధారణముగా దయాస్వభావముగల యాపతివ్రత మందహాసముఁ గావించి "గిరికాదేవీ! ఇది నీకు వింతగాఁ దోఁచినదా? అయిన వినుము. నాకొఱకు వ్యాధిపీడితుండైన నీ పురుషుం గొనిపొమ్మని చెప్పిన యామహాత్ముండైన యతీశ్వరుండు నాభర్త. నేనతని ధర్మపత్నిని, నా పేరు సత్యవతి, ధర్మవరంబనెడి గ్రామంబున వసించుచుండిన బ్రాహ్మణ దంపతులము. నేను సర్వకాల సర్వావస్థలందును, పతిసేవఁ జేయుచు నిష్కళంక చిత్తనై తదీయనామంబునే పరమ మహామంత్రముగా నెంచి ధ్యానింపు          పవిత్ర చరిత్రుండు, క్రమముగా నతండు సంసృతియందు విరక్తి గొంచి విజన ప్రదేశంబుననుండి తపస్సు జేసికొనవలయునని తలంపుఁగొని యారామవంతమైన వేంకటాచలమునకు వచ్చెను. పతి వెంట నీడయుంబోలె నేనును నమ్మహాత్మునను సరించి వచ్చితిని. మేమిచ్చోటఁ జేరినంతట నమ్మహాపురుషుండు కొంతకాలము తపంబుఁ జేయుచుండి నన్నుఁజూచి "సాధ్వీ! ఇచ్చోట నేవుండి నీవు వ్రతంబును నడుపుచుండుము. కొన్ని దినములు నేను దేశసంచారముఁ గావించి మరల నిటకు వచ్చెదను. నీకు దూరశ్రవణమును, దూరదృష్టియుం గలుగునట్లు నిన్ననుగ్రహించితిని. మదీయ తపోమహిమచే నీకుం గలిగెడి యీ గుణంబులచే సర్వవృత్తాంతములును నీకుఁ దోఁచుచుండఁగల"వని యాశీర్వదించి వెడలిపోయెను. ఆయన యనుగ్రహమువలననే యిట్టిశక్తి నాకుఁ గలిగినది. ఎట్టి రహస్యమైనను నాబుద్ధికి గోచరించుచుండును. కావున నే నిన్ను చూడఁగనే నీవృత్తాంతమును దెలిసికొంటిని" అని చెప్పెను. ఇట్టి విచిత్రోదంతమును విని గిరికాదేవి యధిక విస్మయము నొందెను.

అంతట సత్యవతి గిరికాదేవియందు మిక్కిలి ప్రియముగలదై "గుణవతీ! నీవు నుతింపఁదగిన సుశీలవు, నిన్నుఁబోలు యువతులు లోకంబున నెచ్చటనో యరుదుగా నుండుదురు. నీపాతివ్రత్య మహిమచేతనే యింత కాలము నీవల్లభుండు జీవించియుండఁ గలిగెను. కాదేని యితనికిం గలిగిన రోగముచే నెన్నఁడో యిదివరకే మృతినొందియుండును. నన్ను పెద్దశక్తిగలదానినిగాఁ నెంచి వెతలకోర్చి కేవల శక్తిహీనుండైన నీనాథు నిచ్చటికిం దెచ్చితివి. కావున, మదీయ భర్త నాయొద్ద కరిగినచో నీ

డుగని రోగము తీఱునని చెప్పి యనిపెను. కావున నే నల్పశక్తిగలదాన నైనను నావలన నుపకార మొనరింపవలసినది నాకు విధియైయున్నది. కనుక నుత్పతి చరణంబులు ధ్యానించి నేర్చిన సహాయము నొనరించెదను" అని చెప్పి కమండలోదకములు చేకొని, దేవుని నామస్మరణము గావించి, పతిపదాబ్జములను చిత్తంబున నెంచి "నేను సదా నిర్మలమానసనై పతిభక్తి గలిగి వర్తించుచుండుదాన నగుదునేని, ధర్మంబు తప్పక నడచుకొనుదాన నగుదునేని, దీర్ఘరోగపీడితుండై నడయుచున్న కపర్ది యనెడి భూసురోత్తముని వ్యాధి నిశ్శేషముగా వొలంగి యారోగ్యవంతుడును, తేజోవంతుండును నై లేచునుగాక" యని పలికి, పుడిసిటి బట్టిన నీటిని మూడుసారులు కపర్దిపై బ్రోక్షించెను. ఆహా! పతివ్రతా మహిమ యెంత గొప్పదియోగదా! వింతగా. మరణావస్థను బొందుటకు సంసిద్ధుడై యుండిన గిరికాపతి నీరోగియుంబోలె లేచికూర్చుండెను. అంతమాత్రమేగాదు. వ్యాధిగ్రస్తుండై యుండిన వాఁడని పలుకుటకును దెలిసికొనుటకు నలవిగాని రీతిగ, పూర్వ మారోగ్యవంతుఁడై యుండినపుడెట్లో, యావిధమున దృఢము గలిగి కృశించిన శరీరము యథాప్రకారమైనది. మఱియొక విశేష మేమనఁగా మున్నులేని క్రొత్తతేజమును వికాసమును నతనికిఁ గలిగినది. గిరికాదేవి యది చూచి, ఎంతకాలము నుండియో కృశించుచుండిన తనభర్త నిమిషకాలములోపల నారోగ్యమును జెందుట కపరిమితానందమును బొంది యా మహాత్మురాలైన పతివ్రతా రత్నమును, తమ్మునచ్చోటికి వచ్చునట్లు చేసిపోయిన పుణ్యాత్ముడైన యామె వల్లభుండగు సన్యాసిని బహుభంగుల స్తోత్రముఁజేసి యామె పాదంబులకుఁ బ్రణమిల్లెను.

ఆరోగ్యవంతుఁడైన కపర్దియును, పరివ్రాజకగనుండెడి యాపుణ్యరూపిణికిఁ బ్రదక్షిణ నమస్కారము లొనరించి "తల్లీ! నీకరుణచే, నా వ్యాధియు, బాధలునుఁ దొలంగి, సౌఖ్యవంతుఁడనైతిని" అని స్తోత్రము జేసెను. సత్యవతి యాసంతోషచిత్తురాలై యున్న దంపతులంగాంచి "ఇది నా మహిమయని మీరు దలంపకుఁడు మిమ్ము నిచ్చోటికిఁ బనిచినట్టియు, సన్యసించి, నిర్మోహుండై వర్తించుచున్నట్టియు, పావనుఁడైన నాపతి యనుగ్రహామే కాని వేఱుకాదు. సంకల్పించిన మాత్రమున తానే యితనిని రక్షింపఁగలవాఁడై యున్నను లోకమున పతివ్రతా మహాత్వము ప్రసిద్ధమగునట్లు చేయుటకై నామూలమున నీకు మేలుఁ గలి

గింపఁ దలంచి, నాయొద్దకు మిమ్ముఁ బుత్తెంచెను. మీరింక సుఖముగా స్వస్థలంబునకేఁగి, సౌఖ్యము ననుభవించుచుండుఁడు" అని బోధించి, గిరికాదేవికి పతివ్రతాధర్మ రహస్యంబులను పెక్కుల నుపదేశించి యాశీర్వదించి యనిపెను.

కపర్దియు, గిరికయు, నామెకు పునఃప్రణామంబు లొనరించి యనుజ్ఞగొని పయనమై వచ్చి యనాయాసంబుగ తమ మందిరమునఁ జేరిరి. అంతట గిరికాదేవి తనకు సత్యవతి యుపదేశించిన పద్ధతుల ననుసరించి వర్తింపుచు, తొల్లింటికంటె నెక్కుడైన మహిమతో మహాపతివ్రతయని భూజనులు పొగడుచుండ నిర్మలచిత్తయై తన వల్లభుని పాదంబులు సేవింపుచు, నేకొరంతయు లేక సంతసంబున కాలముఁ గడపుచుండెను.

గిరికాదేవి కథ సంపూర్ణము

# 16. భద్రదంతికథ

ప్రభాసుండను నతం డొక గొప్ప తపస్వి, అతని భార్యపేరు భద్రదంతి, పతివ్రతలలో శ్రేష్ఠురాలని ప్రఖ్యాతిజెందిన యుత్తమశీలవతి, ఒకనాఁడు యుజ్జవదన తన పతి తపోనిష్ఠఁ జాలించి భుజించి రాత్రికాలమున శయనించియున్న తరి, నతనికి పాదసంవాహనంబుఁ జేయుచు "నాథా! లోకంబున పతివ్రతల నెంతయుం గొనియాడెదరు. అనసూయ, సీత, ద్రౌపది, యహల్య, దమయంతి, చంద్రమతి మొదలుగాఁగల యువతీమణు లెందఱెందరో మహా పతివ్రతలై యుండి జగత్ప్రఖ్యాతిని బొందిరని చెప్పఁగా వినియున్నాను. వారి కథలను వినినపుడు, నేనును వారివలె వర్తించి కీర్తిని గడింపవలయునని నాలోఁ దలంచుచుండును. కాని వివేకము చాలనిదాన నగుటచే యాపద్ధతు లెటువంటివో తెలిసికొనలేక మిమ్ము నడిగి తెలిసికొనుటకు వెఱచి లోలోన నాయాస నడంచుకొని యుంటిని. ఇపుడన్ననో, యేమైన నయ్యె. మిమ్ము నడిగి తెలిసికొనినంగాని బుద్ధి నిలకడనొంది యుండదని నిశ్చయించి ప్రస్తాపించుటకుఁ దెగించితిని. నాయందు కరుణించి పతివ్రతాధర్మ రహస్యము బోధించి నన్ను ధన్యురాలిం జేయుటకై ప్రార్థించుచున్నాను. అనుగ్రహింపు" డని కడుదీనముగా నడిగి వేడుకొనెను.

ప్రభాసుఁడు భార్య యడిగిన విషయమును విన్నవాఁడై, యామె సుగుణ సంపదకలరి, మందహాసము గావించి "మానినీ! నీవు స్త్రీజనులలో నెందునుం దక్కువయైన దానవుగావు. నీ ప్రవర్తనము మిక్కిలి శ్లాఘనీయమైనది. ఇట్టి యుత్తమశీల వయ్యును పతి ధర్మంబు తెలుంగవలయు ననెడి యపేక్ష నీకుఁ గలుగుట యాశ్చర్యముగా నున్నది. అయినను మంచి విషయము నడిగితివి. కావున చెప్పకుండుట యుక్తము కాదు తెలిసియే కాని, తెలియకగాని యెవ్వరేనియు, నొక విషయము నడిగినపుడు నిరాకరింపఁగూడదు. ధర్మము లనియు; ధర్మసూక్ష్మము లనియు నొక్కొక్క విషయమందును గలిగియుండును. కాఁబట్టి చెప్పెదను. శ్రద్ధతో నాకర్ణింపు" మని యిట్లనియె.

"సుగుణవతీ! పతివ్రతా మహిమ యసాధారణమైనది. ఏస్త్రీ పతిభక్తికలిగి వర్తించునో యాస్త్రీని దేవతలు సయితము మెచ్చుకొనుచుందురు. ఉత్తమభామిని పతికంటెముందుగా నిదురమేల్కొని కాలకృత్యములు నిర్వర్తించి స్నానమాచరించి, పరిశుద్ధవస్త్రంబులు ధరించి తిలకంబుఁబెట్టుకొని, భర్తమేల్కొనఁగానే సంతోషముతో పతనికిఁగను పట్టవలయును. అతండు నీరాడివచ్చుటకు లోపల పీఠమును మడుగువస్త్రములు దెచ్చి యునిచి శుద్ధిజేయఁబడిన పాత్రములలో జలంబులను గొని వచ్చి పెట్టి యగ్నిహోత్రక్రియలకుం దగిన పరికరములును, వస్తువులును సిద్ధముఁజేసి దేవారాధనలకు వలయు పూజాద్రవ్యములన్నియు సమకూర్చిపెట్టి భర్త యాకార్యములను నెఱవేర్చు యగునంతిలోన, తమకుఁ గలిగియున్న వస్తుసామగ్రింగొని వంటఁగావించి, నివేదనకు తడవు లేకుండు లాగున పదార్థములను సిద్ధముగా నుంచవలయును. ఆ కార్యములైనంతి పతికివిస్తరివేసి, చేసినపదార్థములను భక్తితో వడ్డించి యతండు భుజించినంతట తాంబూలమును మడిచియొసంగి, భుక్తాయాసము వోలంగ వీవనంగొని కొంతవిసరి, యతండు విశ్రమించినంతట ననుజ్ఞగైకొనిపోయి, భర్తభుజించిన యాకుననే యుచ్ఛిష్టంబని సంశయింపక రోతపడక వడ్డించుకొని తానును భుజించి. మైసంత, నిల్లును, పాత్రములును శుద్ధిఁజేసి యింటిపనులు దీఱగానే, పతికడ కరుగుదెంచి యతనికి వలయు పరిచర్యలను గావించుచుండవలయును. ప్రతిదినంబును, తాము భోజనముఁ జేయుటకు పూర్వము వాకిట నతిథులుగాని యెవ్వరైనను వచ్చియుండెదరేమో యనుటఁ గనుగొని, వారిరాకకై మధ్యాహ్నము పంద్రెండు గడియల

వరకును గాచియుండి, యెవ్వరును రానియెడల నటుమీఁదటనే భుజించుటకు యత్నింపవలయును. ఎవ్వరేనియు వచ్చిరేని వారి నాదరించి భర్తతోడ వారికిని భోజనము నిడి సంతుష్టులను జేయవలయును.

సాయంకాలమున నిల్లు శుభ్రము జేసి, సూర్యాస్తమానము కాఁగానే దీపముఁ బెట్టి, స్నానముఁ జేసి, పూర్వోక్తక్రమంబున సర్వకార్యములును జరిగించి భుజించి శయనింపవలయును. పేదసాదులయందు దయగలిగి పరోపకార చింత విడువక, సత్కార్యములందు ప్రియంబుమీర వర్తింపవలయును. శయనమందు తన నాథుని పాదంబులకడ బరుండవలయును. దయ, సత్యము, శాంతము, నోర్పు, భగవద్భక్తియు, నుత్తమకాంతకు గలిగి యుండవలసిన ముఖ్యగుణములగును. అసూయ, కోపము, దురాశ, క్లేశము, మత్సరము, పౌరుష్యము, పరనింద యిటువంటి గుణములు సాధ్వీమణులు గలిగియుండరాదు. ఎల్లప్పుడును సంతుష్టియు, పెద్దలయందును, బంధువులయందును నాదరబుద్ధియును నుండవలయును. పతియాజ్ఞనుమీరి వర్తించుట, పతిమాటలకు వ్యతిరిక్తముగా బలుకుట, తిరస్కరించుట మొదలగునవి యవలక్షణములగుటచే, యట్టి పద్ధతులను పూర్ణముగాఁ ద్యజింపవలయును. నిర్మల చిత్తముతో, భర్తయే దైవమను దృఢబుద్ధితో, నెల్లప్పుడును నతనియెడల శ్రద్ధాభక్తులువిడువక యే సుగుణవతి సేవచేయుచుండునో, యట్టిదానిని, వాణీ, రమా, పార్వతులకు సరియగుదానిగఁ జెప్పవచ్చును పరపురుషులను తండ్రులనియు, తనయులనియు సోదరులనియు నెంచుచు స్థిరబుద్ధితో వర్తింపవలయును. వ్యర్థ ప్రసంగముఁ జేయుట, పనిలేక పొరుగువారి యిండ్లకరుగుట, కులటలు, దుస్స్వభావము గలవారలు మొదలైన దుష్టస్త్రీలతో స్నేహముఁ జేయుట, యధికముగా నవ్వుట, లభింపని పదార్థమునకై యాశఁగొనుట యాదియైన విషయములు పతివ్రతలకు కూడవు.

పతియు నింటలేక కార్యార్థియై యన్యస్థలంబునకుఁ బోయినపుడు యోగ్యవారాశనముం గొనుచు నేలఁబరుండుచు, నలంకారమును మాని యతని సుఖాగమనము కొఱకు దేవుని ధ్యానింపుచు వ్రతములాచరించుచుండవలయును. పితృకార్యములు తటస్థించినపుడును, వైశ్వదేవాదిక్రియలు జరుపునపుడు మిక్కిలి శ్రద్ధతో శుచియై యాకార్యములకు చేయవలసిన వానినిఁ జేయవలయును. స్నానముఁ జేసినంతట నింట జరుపబడు నిత్య నైమిత్తిక క్రియలు నెరవేఱు నంతవరకును, బహిష్ట

స్త్రీలతోడను, పంచములతోడను మాటలాడకూడదు. ఎప్పుడు నశ్లీలమగు మాటలు పలుకరాదు. పతివ్రతలు పగలు నిద్రించుటయు, భర్త నిదురించునపు డతని మేలుకొలుపుటయును మహాపాతకములని పెద్దలు చెప్పుదురు, అల్పవసనములను ధరించి పురుషులకు గనంబడుటగాని వివస్త్రయై స్నానముఁ జేయుటగాని, సూర్యున కెదురుగాఁ దిరిగి స్నానముఁ జేయుటగాని యిట్టి వక్రము కృత్యములగును.

ఏ యతివ యేవంగుణ విశేషంబులం గలిగి వర్తించునో యాయువతి యిహలోకమం దక్షయంబగుసత్కీర్తినిఁ బొంది పరలోకంబున శాశ్వతముగ సౌఖ్య మనుభవించుచు దేవతలచేఁ గొనియాడఁబడుచుండును. అని యింకను బెక్కు విషయములను దెలిపి "అంగనామణీ! నీవు సహజసుగుణోపేతవు, సుశీలవు, నీ ప్రవర్తనమును నే నెఱుంగుదును. వినఁగోరి నీవిపు డడిగిన విషయంబులను నీకు వివరించినాఁడను. ఈ పద్ధతులనుమరువక, శ్రద్ధాభక్తులు గలదానవై యాచరించుచున్నయెడల, లోకంబున నుత్తమురాలవని సర్వజనంబులును నిన్ను బొగడఁగలరు. పరులు మెచ్చుకొనుచుండెదర నెడి గర్వము లేశముగాని పొందరాదు. అట్టి తలంపు గలిగెనేని వ్రతాచరణఫలము నష్టమైపోవును. ఒరులెవ్వరైనను దూషించినను వగవఁ దగదు. తాలిమితో నుండినయెడల, దూషించినవారు పిమ్మట తమ తప్పును తామే తెలిసికొని పశ్చాత్తాపమును బొంది నీమన్నింపును గోరుదురు" అనియుం జెప్పెను.

భద్రదంతి తన నాథుండు చెప్పిన సదుపదేశ వాక్యములను శ్రద్ధతో విని సంతుష్టాంతరంగయై యది మొదలుగా నతం డాదేశించిన పద్ధతులను మరువక తత్క్రమంబు నవలంబించి ప్రవర్తించుచుండెను. క్రమ క్రమముగా నమ్మహాసాధ్విమహిమ యధికరింపఁ దొడంగెను. ఆమెకు నిక్కలి యద్భుతశక్తి యుదయించినది. జను లమ్మగువం బొగడుటచేఁ బ్రసిద్ధి వహించినది. వంట జేయుటకుం బూనినపు డామె కట్టెలు పొయిలో నిడి రాజఁ బెట్టి మంట వేయుట లేదు. పాత్రములలో జలములు దెచ్చి పెట్టుకొనుట లేదు. పదార్థములను పచనముఁ జేయుటకై సేకరింపవలసిన యావశ్యకమే లేదయ్యెను. మఱి యెటులనఁగా:—

ఒక చిన్న యెండు పుడకను పొయిలోఁ బెట్టి యించుక యూదఁగానే, మఱి యింధనము లక్కఱలేక మండుట కారంభించును. ఆమెకు వంటకార్య మగువరకును నామంట యేపదార్థము పచనమగుట కెంత

వేడిమి కావలసియుండునో, యంత కెక్కుండు దక్కువయుం గాక యట్లే యుండునట్టి వంట కాగానే తనకు దానే చల్లారిపోవుచుండును. ఇంక నీటి విషయమన్ననో, పాత్రలు శుద్ధిచేసి పెట్టగానే యున్నట్టియుండును శుద్ధ రమునైన నిర్మలోదకము నిండుగా సంభవించుచుండెను గాక వానిని ప్రయో గించినంతటను గొఱవడక యభివృద్ధిచెందుచుండును. వస్త్రసంస్కారములు చేయ వలసినదియే లేదు. ఏది తలంచునో యది సిద్ధముగా కలుగుచుండును. కాదు ఏదైన కావలయునని తలంచునో, యదియన్నియు సమకూరు చుండును. వంటచేయు పదార్థములకు పొయ్యి మీఁదఁ బెట్టి దించుకొనుట దక్క మఱి యేదియు నామె చేయవలసినదియే లేదు. వేయేల? ఏది యాపుణ్యవతి తలంచునో యది యపుడే యామెకు లభించుచుండును.

భద్రదంతియొక్క యిటువంటియద్భుతక్రియలం జూచిన యితరులు తమ ప్రవర్తనమునందుఁగల లోపములం దెలిసికొని సిగ్గుపడి, యాసాధ్వీ మణి నాశ్రయించి, మంచినడవడులం దెలిసికొని తాము తామును నది మొదలుకొని యుత్తమ పథంబు ననుసరించి వర్తింపఁదొడంగిరి. ఔరా! పతివ్రతల సామర్థ్యంబును గొనియాడ నెవరికి తరముగును? ప్రాతఃసాయం కాలములందు వారిని స్మరించుచుండినచో సకల పాపములును నశించి సాయుజ్య ప్రాప్తి గలుగునఁనుట కించుకయు సంశయము గలుగబోదు. మహాపతివ్రతయైన యాభద్రదంతి సదా పతిభక్తిగలిగి పూర్వోక్త ప్రకా రంబున వర్తించుచు సంతసమున చాలకాలము సుఖ మనుభవించు చుండెను.

భద్రదంతి కథ సంపూర్ణము

## 17. సు ము ఖా దే వి క థ

ఒక యూరిలో ధర్మసిద్ధి యనువాడి బ్రాహ్మణుం డొకండు గలఁడు. భాస్వర యను నామె యతని కులాంగన. చాలకాలమువరకు వారికి సం తానము లేక యుండిన పిమ్మట నొక కూతురు గలిగెను. తల్లిదండ్రులా మెకు సుముఖాదేవి యని పేరుఁబెట్టి మిక్కిలి ప్రేమతోఁ బెంచుచుండిరి. ధర్మసిద్ధి తన కూతురు పుట్టిన జనన కాలగ్రహ సంపత్తిఁ గూర్చి జ్యోతి ష్కులను విచారించెను. వారు జన్మలగ్నాదులను పరికించి "భూసుకోత్త

మా! నీకూతురు సకలసుగుణములును గలదిగనేయుండును. కాని యామె పురాకృత పాపమువలన పెండ్లియైనంతట ముప్పదిదినములలో వైధవ్యమును పొందును. ఈ గొప్పదోషమే లేకున్నచో నీపుత్రిక లోకంబున సత్స్త్రీరత్నముగా నుండును'' అని చెప్పిరి.

ఇట్టి యశుభవాక్యములు వినినంతట సుముఖతల్లిదండ్రులు మిక్కిలి చింతాక్రాంతులై, అంతటి మంచిబిడ్డ కటువంటి దుఃస్థితి యేర్పడుటం గూర్చి వందురుచుండిరి. క్రమముగా వృద్ధచంద్రునివలె సుముఖి వర్ధిల్లుచు, పండ్రెండేండ్ల వయస్సుగలదయ్యెను. రూపమందును బుద్ధివిశేషమునను, సుగుణసంపదయందును, విద్యయందును నప్పటిదినములలో యాబాలిక కామెయే సాటియని చెప్పఁదగి యొప్పుచుండెను. అటువంటి సుగుణనిధియగు తనయం జూచుచు, నామెకుఁ గలుగనుండెడి కీడు నెఱింగిన తల్లిదండ్రుల హృదయంబెటుల నెఱియకుండును.

ఆముద్దియ సౌందర్యముజూచి పెక్కండ్రు తమ పుత్రుల కాకన్య నడుగుటకు వచ్చిరి. ధర్మసిద్ధి వచ్చిన వారి కందఱకును, జాతకమును జూపి పెండ్లాడిన వాఁడొక నెలలో మృతినొందుననుటను దాపక చెప్పుచుండెను. ఆజాతకమును జూచియు బాలిక తండ్రి చెప్పిన విషయమును వినియు, వచ్చినవారు వచ్చినట్లే మిన్నక తమదారినిఁ బోవుచుండిరి. కలాతీతంబగు ననెడి భయమును, వివాహముఁజేసినఁ గలుగఁబోయెడి యాపదను గూర్చిన భయమును, భాస్వరాధర్మసిద్ధులను మిగుల బాధించుచుండెను. యేమి సేయుదురు?

ఇట్లు కొన్నిదినములు గడచెను. ఒకనాఁడు మంచి తేజస్వియు సాంగవేదాధ్యాపకుండును రూపవంతుఁడును నగు సద్బ్రాహ్మణ యువకుండైన బ్రహ్మచారి యొకఁడు వివాహార్థముగా కన్యను వెదకుచు ధర్మసిద్ధి మందిరమున కరుదెంచి, వారియింట సుగుణలక్షణవతియైన కన్యక యుండుటంగాంచి సంతసించి. తన కాపడుచు, నొసంగి పెండ్లిజేయవలసినదిగా గోరి ప్రార్థించెను. సుముఖ తల్లిదండ్రు లాయువకునిం జూచి, యతండు తమ కుమార్తెకు సర్వవిధంబులం దగిన వరుండుగా నుండుట నెఱింగియు నటువంటివానికి తనయ నొసంగి వివాహ మొనరించి యతని మృతికి తామే కారణంబై యామహాపాతకము నొడిగట్టుకొన నొల్లక, ఉన్నమాటఁ జెప్పక దాచరాదనియెంచి ''అయ్యా! నాకొమార్తెనొసంగి యుద్వాహముంజేయు విషయంబున నెట్టి యభ్యంతరమును లేదుగాని,

పెండ్లియైన పిమ్మట గొప్ప కీడు గలుగును. దానినిఁ గూర్చియే యోచించుచున్నార" మని చెప్పి యీరహస్యము నతని కెఱింగించిరి.

పశుపతియను పేరుగల యాబ్రహ్మచారి ధర్మసిద్ధి చెప్పిన విషయమును విని కొంత చింతించి, తుదకేదియో నిర్ధారణ జేసికొని 'అయ్యా! మీరు భయపడవలదు. ఒకవేళ వివాహానంతరము నేను మృతినొందినచో నామరణమునకు మీరు కారణము కాఁజాలరు. అందువలన నిసుమంతయును మీకు పాపము గలుగదు. దేవునిసాక్షిగాఁ జెప్పుచున్నాను. ఇది నేను తెలిసి మనఃస్ఫూర్తిగా నంగీకరించిన కార్యమగుటచే మీ కేల కిల్బిషము గలుగును? ఆచింత మీరు పొందవలసినది లేదు! కాని యొక పనిమాత్రము చేయుటకు సమ్మతింపవలయునని మిమ్ము వేఁడుచున్నాను. ఎట్లనఁగా, పెండ్లియైన వెంటనే నాభార్యను నావెంటఁ బంపవలయును. ఇదియే నాప్రార్థన" అని యధిక ధైర్యముతో బలికెను.

పశుపతి యిటుల నంతధైర్యముగా బలుకుటఁబట్టియు, కూతునకు పెండ్లియాడు తలంపు నుండుటఁ బట్టియు వేరుమార్గము దోచమిచే నట్టకేలకు భగవంతునిపై భారమును మోపి తమపుత్రిక నయ్యువకున కొసగి వివాహ మొనరించుటకా కన్యక తల్లిదండ్రులు సమ్మతించిరి. అనతికాలముననే ముహూర్తము నిశ్చయించి సుముఖా పశుపతులకు పెండ్లి విధ్యుక్తముగా జరిగింపఁబడినది. అయిదు దినములును గడచినంతట బ్రాహ్మణకుమారుఁడు తన యత్తమామల యనుమతిపై భార్యను వెంటఁబెట్టుకొని స్వస్థానమునకు బోవక, పింగళాగ్రహార మనెడి గ్రామంబునకుం జనియెను.

ఆ యగ్రహారములో సీమంతిని యను మహాపతివ్రత యొకర్తు గలదు. ఆమె మహిమ యసాధారణమైనదని పశుపతి వినియుండెను. పుణ్యశీలయైన సీమంతిని యనుగ్రహము గలిగెనేని తన భార్యకుఁ గీడు సంభవింపదనెడి యుద్దేశముచేతనే పశుపతి సుముఖను పెండ్లాడెను. భార్య నచ్చటికిఁ దోడ్కొని వచ్చుటకును నదియే కారణము. అచ్చోటికిఁ జేరుటకు మున్నే సందర్భము లన్నియుం దెలిసియున్న వాఁడగుటచే యిల్లాలి నామహాసాధ్వి పాదంబులపైఁ బడవైచి "నీకుమార్తెవలె భావించి యీముద్దియను రక్షింపుమని" ప్రార్థించెదను. ఇంతమాత్రమే యతండు చెప్పినది.

పిమ్మట తనభర్తచే బోధింపబడియున్న సుముఖాదేవి పరమపావనమానసయైన సీమంతినికి నమస్కరించి తన జనన మాదిగ నప్పటివరకును

జరిగిన దంతయుం జెప్పి "పతిభిక్ష యిడి నామాంగల్యమును రక్షింపు" మని మహాదుఃఖముతో దీనాననయై వేడుకొనెను. సీమంతిని యా యువతీమణి చరిత్రమును విని జాలినొంది "ఓ సుముఖా! నీకథ మనంబున కెంతయు దైన్యమును బుట్టించుచున్నది. అయినను, దైవకృతంబగు కార్యమునకు నేనుగాని మఱియొకరుగాని యేమి సేయఁగలరు? విధివిధానమును దప్పించుకొనుట వేలుపులకైనను శక్యముగాదని పెద్దలు పలుకుదురు. మానవమాత్రులమగు మన మనఁగా నెంతటివారము? ఈగొప్ప విపత్తును దప్పించుటకు నాకుం దరమగునా? నీవంటి యాఁడుదాననే గదా! నన్ను ప్రార్థించిన నేమి ఫలము గలుగును? కుమారీ! నన్ను వేడుకొంటివగుటచే నావలననైన యుపకృతి నీకుఁ జేయుట ధర్మము. చేసెదను. మదీయోపదేశప్రకార మాచరించితివేని యొకవేళ దేవునకు నీయందు కరుణగలిగెనేని మేలు గలుగవచ్చు"నని పలికి మహాపతివ్రతాశిరోమణియైన సీమంతిని సుముఖాదేవికి లక్ష్మీమంత్రము నుపదేశించి, "సకల క్లేశ నివారణియైన యిందిరాదేవిని నిర్మలచిత్తవై పూజించుచు, పతివ్రతలకథలం జదువుచు దేవునిగాఁ జూచి నీవల్లభుని సేవింపుచుండుము. పిమ్మట భగవత్సంకల్ప ప్రకారము జరుగుఁగాక" అని కఱపి, యాదంపతులను కొన్నిదినములు తమయింటనే యుండునట్లు చెప్పి నిలుపుకొనియెను.

సుముఖయన్ననో, యద్వితీయంబైన భక్తితో లక్ష్మీమంత్రమును జపించుచు, తన పతికిఁ గలుగనుండెడి కీడును దప్పించి రక్షింపుమని ప్రార్థించుచుండెను. అయిననేమి? విధివ్రాత దప్పునా? జోస్యులు చెప్పినట్లే ముప్పదవనాఁడు పశుపతి కున్నట్టులుండి కడుపులో నొకసంకటము గలిగి, కొంతతడవు నటునిటుం బొరలుచుండి యసువులు విడిచెను. ఇంక సుముఖ శోకమునకు పారము గలుగునా? ఆమె పతి కళేబరంబుపైఁ బడి రోదనముఁ జేయఁదొడంగెను. పాపము ముగ్ధగదా! ఆమె నూఱడించువారెవ్వరు గలరు? సీమంతిని తద్వృత్తాంతంబు నెఱింగి చేరవచ్చి ధైర్యము గఱపి సుముఖాదేవి నూఱడించి "నాపాతివ్రత్య ఫలంబులో నొక్కనాటి పుణ్యము యీమృతుఁడైన విప్రకుమారున కొసంగితిని, ఆపుణ్యమువలన నితండు సజీవుఁడై లేచి దీర్ఘాయుష్మంతుడై మనునుగాక" యని చెప్పి తన పతి పాదకమలంబులను ధ్యానించి పవిత్రజలంబులుగొని మృతకళేబరంబుపైఁ బ్రోక్షించెను.

ఆమె పుణ్యదానఫలంబుచే చూపరుల కాశ్చర్యము గలుగునట్లు పశుపతి దగ్గర లేచి నిదుర మేల్కొనినవానివలె గూర్చుండెను. అపుడు దేవతలు సీమంతినిపై బుష్పవృష్టిఁ గురియించిరి. జను లామెను పెక్కుతెఱంగులఁ గొనియాడిరి. అసుముఖా పశుపతులను సీమంతిని మఱికొలది దినములు తనయింట నిలుపుకొని సుముఖకు పతివ్రతా ధర్మంబుల నుపదేశించి వారి నాశీర్వదించి వీడ్కొలిపెను.

పశుపతి భార్యాసహితుఁడై యత్తవారింటికిఁ బోయిన సుఖులై వచ్చిన కుమార్తెను నల్లునిం జూచి వారు పరమానందమును బొందిరి. జామాత తన శ్వశురులకు జరిగినదంతయుం జెప్పి స్వస్థానంబున కరుగుటకు పయనమయ్యెను. సుముఖ తల్లిదండ్రులకు మ్రొక్కి దీవనలంది, యత్త వారింటికేగి, తన పతితోఁగూడి సుఖముగా కాలము గడపుచుండెను.

సుముఖాదేవి కథ సంపూర్ణము



# 18. రథంతరకథ

రథంతర లోకములోని సాధ్వీమణులలో నగ్రగణ్యురాలు, ఆమె సమంజసుండను మహామునివర్యుని ధర్మపత్ని, వింధ్యాటవిలో విశ్రవంతి యనెడి నదీతీరమున భద్రవటంబనుచోటు వారి నివాసమగునాశ్రమము. ఆ యాశ్రమమునకు సమంజసుఁడే యధ్యక్షుఁడు, మఱియుం గొందఱు ఋషు లతని ప్రాపున నచట నివసించుచుండిరి.

రథంతర చరిత్రము భూలోకమందేగాక దేవలోకమున నయితము వ్యాపించెను. ముజ్జగంబులను నిమిషకాలములో తలక్రిందులుగాఁ చేయు మహిమ యా పుణ్యాంగనయందు గలుగుననెడి ప్రసిద్ధియతిశయించెను. వేలుపులు నయితము కొనియాడుచున్న యా యుత్తమాంగన పతివ్రతా మహాత్వం బెట్టిదియో తెలిసికొనవలయునని తలంచి దేవేంద్రుండు శత వృద్ధుడగు బ్రాహ్మణాకృతిని దాల్చి, తన కపట కృత్యమునకుం దగిన యేర్పాటులు గావించి మధ్యాహ్నమున రెండు జాముల కాలము మించి నంతట, సోలుచు సొక్కుచువచ్చి సమంజసుని యింటివాకిట పంచటరుగుపై బరుండెను.

తత్పూర్వ మతిథులునభ్యాగతులునెవ్వరైన వచ్చెదరేమో యని రథంతర వాకిట గనుచుండి యెవ్వరును గనుపట్టకుండుటయు తనభర్తకు భోజనము పెట్టినది. అతఁడు భోజనముఁ జేసినైమిత్తి కార్యార్థియై యపుడే యెచ్చటికోపోయెను. ఇఁక తాను భుజించుటకుఁ గూర్చుండబోవుచుం డఁగా యామెకు వాకిటఁ బరుండియున్న వృద్ధబ్రాహ్మణుని మూలుగు వినిపించెను. ఏమోయని బిరబిరవచ్చి తొంగిచూచి, తమపంచ యరుగుమీఁద బడియున్న విప్ర వృద్ధునిఁజూచి దగ్గఱకువచ్చి "అయ్యో! పాపము! మిక్కిలి ముసలివాఁడు ఎచ్చటనుండియోగాని యెండలో బడలివచ్చి పడిపోయినాఁడు. ఆహారము లేనట్లు ముఖలక్షణములను బట్టి తెలియు చున్నది. ఎంత తడవునుండియో యెవ్వరైనను వచ్చెదరేమో యని యెదురు చూచుచుంటిని. ఎవరును రాలేదు. ఇంతలో యీ జడివం డెందుండి వచ్చెనో తెలియకున్నది. దినదాకిసాక్షియున్న యితని కిపు డాహార మొసంగి యుపచరింపకుండిన చో నితని ప్రాణంబులు నిలువవని తోఁచుచున్నది. నాపాలియన్నము గలదుగదా! దాని నీముసలివాఁడున కొసంగి యితని ప్రాణంబులు రక్షించెదఁగాక" అని తనలో నిశ్చయించి కొనెను.

ఆమె ఆవిప్రునిఁ బిలిచి "స్వామీ! లేచి మెల్లగా నింటిలోనికి రండు. మిక్కిలి బడలియున్నారు. ఒక కబళ మన్నమును దిని పుడిసెడు నీరుఁ గ్రోలినఁగాని మీకాహ్యాయత గలుగదు. ఆహారముఁగొని తేరుకొన్నంతట మీవృత్తాంతమును దెలిసికొనియెదను" అని మిక్కిలి భక్తి శ్రద్ధలతోఁ బ్రార్థించెను. రథంతర ప్రార్థనావాక్యములను విని ముదుసలి వాఁడు మెల్లగా కన్నులువిచ్చి యామె వంకజూచి మంచినీరు నిమ్మని సంజ్ఞగా తెలిపెను. ఆమె నీరుం గొనివచ్చి యొసంగుటయు కొంచెము త్రాగి తెప్పరిలినవానివలె కూర్చుండి యేమో చెప్పఁదలంచెను. కాని భుజించి యగునంతవరకు నామె యొద్దియుం బలుకవలదని యింటిలోనికి గ్గొనిపోయెను. అతఁడును మాటాడక కష్టః
మునిపత్ని పీటయు విస్తరియును వేసి కూర్చుండఁబెట్టి వడ్డించిన వృద్ధుండు భుజించుటకు పరిషేచనమును గావించెను.

అట్టి సమయమున వాకిట నెవ్వరో పిలిచినట్లు శబ్దము వినవచ్చెను. రథంతర పోయిచూడఁగా కృశాంగుఁడగు బ్రాహ్మణుం డొకండు నిలిచి యుండెను. అత డాగృహిణిం గని "తల్లీ! భుజించి రెండుదినములైనది.

నావృత్తాంతము జాలిని బుట్టించుచున్నది. దానిని దెలుపుట కిది సమయము గాదు. భోజనముఁ జేసిననేగాని నాప్రాణములు మేన నిలువవు. కరుణించి యున్నదానిచే జీవంబులను రక్షింపు''మని వేడుకొనెను ఆమె యేమి చేయును? తాను భుజింపనై యుండిన యన్నమును పదార్థములును వృద్ధబ్రాహ్మణునకుఁ బెట్టినది. ఇపుడెట్లు? వంట చేయుటకు యత్నించిన యెడల కొంతకాలము పట్టును. ఆగంతకుని స్థితియన్నన్నో యంతవరకును నోర్చియుండఁ దగినదిగాఁ దోఁచలేదు. ఆకలి బాధను సైపజాల'' నని యతఁడు తొందరపెట్టఁ దొడంగెను. ఆమె కేమియుం దోఁచినది కాదు. యయ్యిప్రునిఁ గూర్చుండ నియోగించి బిరబిర లోనికరిగి వంట కారంభించెను. కట్టెలు మంచివి గావయ్యెను. పొయ్యి బాగుగా మండకుండెను. ఎట్లో కష్టపడి బియ్యముఁగడిగి యెసట వేసెను. సంభోగముడికెను. గుటగుట శబ్దము బుట్టినది. ఇంక రెండు నిమిషములలో నతిథికిఁ బెట్టవచ్చునని యెడి ధైర్యము గలిగినది. అయ్యా! స్నానముఁ జేసి రండు. వంటయైన'' దని చెప్పెను.

అతఁడు ''అన్నియు ముస్నేయైనవి. పుడిసెడన్నమును బెట్టుము నీకు పుణ్యము గలుగును'' అనుటయు నామె యతనిని లోనికి దోడ్కొని పోయి పీటపై గూర్చుండఁజేసి విస్తరివేసి. యప్పటికి యుడికి పక్వమైన యన్నమును, తత్పూర్వము చేసి మిగిలియున్న పదార్థమును బెట్టి భుజింపుమనియెను. బ్రాహ్మణుండు భోజనము జేయుట కారంభించెను. ఇంతలో నెవ్వరో పిలిచినట్లు శబ్దము వినఁబడినందున యామె వాకిటికి వచ్చి చూచెను. ఇంక నేమిగలదు? నలుగురు బ్రాహ్మణులు నిలిచియుండిరి, వార లాకటిబాధచే నక నక లాడుచున్న వారని తెలుసుకొని యామె మిక్కిలి జాలినిఁ బొందెను. ఏమి చేయవలయును? ''కొంచెము తడవు మున్ను వచ్చియుండిరేని తత్పూర్వముచేసిన వంటకములో వీరికిం జేసి పెట్టియుందునే! అకాలమయ్యెనే! అయ్యో? అన్నాతురులై యల్లాడుచుండెడి వీరింక నిమిషమైనను ప్రాణములు నిలుపుకొనగల లక్షణములు గనుపట్టకున్నవే! ఏమిచేయుదును? మరల వండుదునన్నచో వంటయగు వరకును వీరలు నిలువఁగలరా?'' యని తత్తరించుచు, యేమైనను వండి పెట్టుట దక్క వేరుదారి దోఁచమిచే, యాగంతులను, యింటిలో గూర్చుండ నియోగించి తరగా వంటచేయుటకై పోయిచూడగా, సంభారము లెవ్వియును లేదయ్యెను, ఏవైన నొకటి రెండున్నను చాలి

నట్లు దోచలేదు. ఆమె కపుడు గలిగిన వ్యాకుల మింతింతగాదు. 'హా! దైవమా! యేమిచేయుదు?' నని కర్తవ్యము నిశ్చయింపలేక చింత నొందదొడంగెను.

ఆ సమయమున శతవృద్ధులు యిరువురు నడువలేక మెల్లగా నడుగులు బెట్టుచు యింటిలోనికి వచ్చి "పుణ్యాత్మురాలా! మూడు నాళ్ళనుండియుఁ పిడికెడు గిరము దొరకక యల్లాడుచుండెడి దీనులమైన మమ్ము రక్షించు వారెవ్వరైన నిచ్చట నుండెదరో? హరి హరీ! సర్వేశ్వరా! ఆకలిబాధ యెంత దుర్భరమైనది? అకటా! జీవములు నిలుచు నట్లుండ లేదే! ఏమిగతి?" యని మాటలు తడబడఁ బలుకుచు పై బట్టలను నట్టింట బరచుకొని పరుండి మూలుగఁజొచ్చిరి. రథంతర వారిఁ జూడఁగానే పొందిన దుఃఖమునకును దిగులునకును పారము లేకుండెను. ఆరుగు రతిథులన్నములేక యల్లాడుచు నింటిలోఁ బడియున్నారు. ఇరువుర కెటులనో భోజనము బెట్టబడెను. తక్కిన వారికి వంటజేసి పెట్టుటకైనను నింట నే పదార్థములు లేకుండెను. కొనివచ్చువారైనను లేరు. భర్త యెచ్చటికో పోయెను. ఒకవేళ యుండినను వస్తువులు సంగ్రహించి తెచ్చువరకును నాకలిబాధచే పీడితులై యున్న వీరు బ్రతికియుండఁ గలరా? పొరుగువారి నడిగి తేదలంచినను ప్రయోజనము లేదు. అందఱును తనకు క్రిందైనవార లేగాని యధికులుగారు ఆపూటను గడపుకొనుటయే వారికి కష్టముగా నుండుననుట యాసాధ్వి స్పష్టముగ నెఱుంగును. ఎటులఁదలంచినను, సమయోచితమైన పద్ధతి యేదియు గనుపట్టినది కాదు. ఆమె తనలో నిట్లు తలంచెను.

'ఇది యేదో దైవమాయగా నున్నది. భగవంతుఁడు నన్ను శోధించుటకై యిటుల కపట తంత్రముఁ జేయఁదలంచెను కాఁబోలు. కాదేని యిటువంటి వింత యుండునా? కుతపకాలము దనుకను నతిథు లెవ్వరైనను వచ్చెదరేమో యని కాచియుంటిని. ఒకరైనను రాలేదు. ఇంతలో నిందఱు వృద్ధులు క్షుద్బాధాపీడితులై నకనకలాడుచు నెచ్చట నుండి యోగాని యొకరివెనుక నొకరుగా వచ్చిరి. ఇందఱకును నేకకాలమున నెచ్చటను నన్నము దొరకదయ్యెనా? ఇది భగవన్మాయయే కాని వేఱుకాదు. ఏ పరమేశ్వరుండు నా చిత్తశుద్ధిని పరిశీలించుటకై యిటువంటి తంత్రమును కల్పించెనో, యాదేవుఁడే యీ దీనురాలి కిపుడు రక్షకుఁడగును గాక! నామనఃక్లేశంబును నివారించి యాకలి చిచ్చున

పడుచున్న యీ బ్రాహ్మణుల బాధను బోకార్చి పాలించునుగాక' అని యామె నిశ్చయముఁ గావించుకొని, నిజవల్లభుని పాదాంబుజంబులను ధ్యానించి శ్రియఃపతియైన పరమేశ్వరు నిట్లని స్తుతించెను.

సీ॥ కరిమొఱాలించి న ♦ క్రంబును దునుమాడి
పాలింపవే నీవు ♦ పద్మనయన!
మానభంగము సేయఁ ♦ బూనినఁ గరుణతో
బాంచాలిఁగావవే ♦ పరమపురుష!
పగఁగొని తండ్రి చం ♦ పఁగ నడంగిన వేళ
ప్రహ్లాదు బ్రోవవే ♦ భక్తవరద!
మునిశక్తి యంబరీ ♦ షునిమీఁది కడరిన
నతని రక్షింపవే ♦ యనఘచరిత

గీ॥ హేమమయచేల యిందిరా ♦ హృదయలోల!
నీలవర్ణశరీరమా ♦ ణిక్యహార!
యసుర చయ గర్వభంగద ♦ యాంతరంగ
పాహిమాం పాహిమాం ♦ పాహి పాహి పాహి.

దేవా! ఈబ్రాహ్మణులకు క్షుద్బాధ నివారణమగునట్లుచేసి, ఇందు వలన నాకు గలుగనుండె మహా కిల్బిషము నడంపుము. కరుణింపుము.

క॥ నీపాదములను నమ్మిన నేపాపము లంటవంద్రు ♦ హృద్యచరిత్రా
తాపసనుత సుశ్లోకా! గోపాలా! సుగుణశీల ♦ గోకులబాలా!

అని బహుభంగుల స్తోత్రముగావించి "మనోవాక్కాయకర్మముల యందు సర్వకాల సర్వావస్థలచేతను నేను నాపతియే దైవంబనియెంచి నిర్మలబుద్ధితో సేవించుచుండెడి పతివ్రతనగుట నిక్కమేని, శీలమున వర్తించుచుండెడి దాననేని, సదా భగవద్భక్తి విడువక పరమేశ్వరుని నారాధించుచుండు దాననేని, దేవదేవుండైన శ్రియఃపతి యీబ్రాహ్మణుల కష్టంబును తొలగించి నామనఃక్లేశం బడంచి రక్షించుఁగాక" యని తనలో నత్యంత భక్తితో ధ్యానముఁ గావించెను.

మహాపతివ్రతయగు రథంతర పరిదేవనంబునువిని, యామెస్తోత్రము సంతసించి కరుణగలవారై యా వచ్చియున్న బ్రాహ్మణులెనమండ్రును, తమ విప్రాకారములను త్యజించి దివ్యవస్త్రమాల్యాంగరాగ విరాజిత రమ్యాకారంబులతో దిక్పాలకులై ప్రత్యక్షంబై యెదుటనిలిచిరి. మహా తేజోమూర్తులగు నవ్వేలుపులం గాంచి, యత్యంత భక్తితో నైపులక

రింపఁగా రథంతర వారికి ప్రదక్షిణ నమస్కృతు లొనరించి చేతులు మోడ్చి "దివ్యాకారములు గలిగి యొప్పుచుండెడి మహాత్ములగు మీర లెవ్వరో నే నెఱుంగఁజాలకున్నదానను. సేవకురాలనైన నాయందు కరుణించి మీర లెవరగుటయు నివ్విధమున విప్రాకారములతో వచ్చుటకు కారణ మేమగుటయుం జెప్పి నన్ను ధన్యురాలింజేసి రక్షింపు" దని మిక్కిలి వేడుకొనియెను.

అపుడు వారిలో దేవేంద్రుం డామెను జూచి "ఓసాధ్వీ శిరోమణీ! నేను వాసవుఁడను. వీరు నావలెనే తక్కుందిశల కధిపతులైన యగ్ని, యమ, నైరృత, వరుణ, వాయు, కుబేర, యీశానులు. పాతివ్రత్యమున నీకు దేవతలందు నయితము సమానులు లేరని వేల్పుటింతు లగ్గించుచుండఁగా విని, నీ గుణశీల భక్తివిశేషంబుల నెఱుంగఁగోరి నేను వీరలకు నా యభిప్రాయంబుఁ దెలిపి, వీరు సమ్మతించుటయు నిందఱమును భూసురాకృతులు దాల్చి యొకరివెంట నొకరుగా వచ్చి నీచిత్తవృత్తిని పరిశీలింపఁ గడంగితిమి. పరిశోధించి తెలిసికొంటిమి. మేము వినినదానికంటె నధికమైన గుణంబులు నీలోఁ గలుగుటం గంటిమి. నీ చరిత్రంబు పావనమైనది మెచ్చి నీకు వరంబొసంగఁ దలంచితి. ఇచ్చెద నడుగు"మనియెను.

ఆమె సంతుష్టాంతరంగయై "దేవా! నాయం దేదేనియుం గొప్ప గుణము గలిగియున్నట్లు మీకుఁ దోఁచెనేని యది మీయవ్యాజ కరుణా విశేషంబువలనఁ గలిగినదియే యగును. కృపాయత్తచిత్తంబున వరం బొసంగఁ దలంచినచో సదా నాబుద్ధి ధర్మమందే వర్తించునట్లును, నా యతిథి పూజకు, పతిభక్తికి, దైవభక్తికి నెప్పుడును నెట్టి యంతరాయము గలుగకుండునట్లును నాకును నా విభునకును శాశ్వత పుణ్యలోక సౌఖ్యము గలుగునట్లునుం బ్రసాదింపు"మని యడిగెను ఇంద్రుం డామె కోరిన భంగి వరం బొసంగి దిక్పతులతోడంగూడి యదృశ్యుఁడయ్యెను. రథంతర తన పతి వచ్చినంతట జరిగిన వృత్తాంతంబంతయుం దెలియఁ బలికి యెప్పటిరీతిని తన నియమం బాచరించుచు పరమపావనియైన పతివ్రత యనెడి విఖ్యాతినిఁబొంది సంతోషముతో వర్తించుచుండెను.

రథంతర కథ సంపూర్ణము



---

ఆనందభారతి పవర్ ప్రెస్, మదరాసు-1. 15-4-77 5000 ప్రతులు

| | |
|---|---|
| **వైద్య గ్రంథములు** | |
| గృహవైద్య దీపిక | 6.00 |
| అనుభవ వైద్యము (4 భాగములు) | 15.00 |
| సహదేవ పశువైద్య శాస్త్రం | 3.00 |
| పులిప్పాణి వైద్య శాస్త్రం | 10.00 |
| ...రక మర్మములు | 10.00 |
| ధన్వంతరి వైద్య చికిత్సాసారం | 5.00 |
| బాలగ్రహ దోష చికిత్స | 1.00 |
| నాడీజ్ఞానం (తాత్పర్యంతో | 3.00 |
| గోసాయి చిటికలు | 4.00 |
| బైరాగి చిటికలు | 4.00 |
| **జ్యోతిష గ్రంథములు** | |
| అష్టదిక్కుల ఆరూఢ శాస్త్రము | 8.00 |
| సంపూర్ణ గుణ అదృష్టదీపిక | 5.00 |
| జ్యోతిష రత్నమను శ్రీకృష్ణమిశ్రీయ దశాభుక్తి నిర్ణయము | 15.00 |
| జ్యోతిష బాలశిక్ష | 3.00 |
| నవగ్రహ చింతామణి | 2.00 |
| హస్త సాముద్రికము | 4.00 |
| నీతిశాస్త్రము : తాత్పర్యముతో | 2.00 |
| సహదేవ ప్రశ్నశాస్త్రము | 1.00 |
| కుక్కుట శాస్త్రము | 3.00 |
| పుట్టుమచ్చల శాస్త్రం | 5.00 |
| కృష్ణవాస్తు | 6.00 |
| గంగావివాహము | 3.00 |
| కళలవుల యుద్ధము | 5.00 |
| ధర్మాంగదచరిత్ర పాముపాట | 3.00 |
| కళలాయకము | 3.00 |
| దశావతారం | 2.00 |
| శశిరేఖాపరిణయం | 2.00 |
| లంకాయాగము | 2.00 |
| క్ష్మణమూర్ఛ | 2.00 |
| రస్వతీకళ్యాణపాటలు | 5.00 |
| ...క్కుబాయి చరిత్ర | 3.00 |
| రీచుక్క పగటిచుక్క కథ | 3.00 |
| నందశిష్యుల కథలు | 3.00 |
| ర గ్రామఫోను పాటలు | 5.00 |

| | |
|---|---|
| స్త్రీలపాటలు (27 పాటలుగలది) | 8.00 |
| నూతనవేడుక పెండ్లిపాటలు | 1.00 |
| సనాకీవి ... ర సంవాదము | 12.00 |
| త్యాగరాయ కృతులు | 1.50 |
| మహాగారడి జాలరహస్యం | 6.00 |
| సర్వదేవతా వశ్యమను మలయాళ మంత్రములు | 10.00 |
| దాంపత్య రహస్యములు | 10.00 |
| కామకళారంగము | 6.00 |
| శ్రీరామగురుబోధామృతము | 6.00 |
| నల చరిత్ర ద్విపద | 6.00 |
| శ్రీమద్భగవద్గీత : తాత్పర్యసహితం | 10.00 |
| విఘ్నేశ్వర పూజావిధానము | 0.50 |
| పెద్దబాలశిక్ష (తిక్, కలరురాపరు) | 6.00 |
| ,, (అట్టబైండు) | 8.00 |
| గణితబోధిని (పెద్దఎక్కములు) | 1.00 |
| నవీన ఆంధ్ర ద్రావిడ బాలశిక్ష | 2.00 |
| ఇంగ్లీషు-తెలుగు విద్యాబోధిని | 8.50 |
| హిందీ-తెలుగు బోధిని | 6.00 |
| ముగ్గుల పుస్తకం | 8.00 |
| కుట్టుపని స్వబోధిని | 10.00 |
| వేమన పద్యములు పెద్దవి (3,200) | 12.00 |
| **శ్రీమాన్ పోకల శేషాచలంగారి వేదాంత గ్రంథములు** | |
| అచల గ్రంథము | 6.00 |
| పరమపద మార్గము | 6.00 |
| సుజ్ఞాన రత్నావళి | 6.00 |
| అచల సద్గురు సంకీర్తనలు | 6.00 |
| సుజ్ఞాన దీపమను గురుగీతలు | 6.00 |
| ముక్తిప్రదాయిని | 6.00 |
| కృష్ణబోధామృతం(12రాజుల కథలు) | 8.00 |
| నిర్వచన స్వరదర్పణము | 8.00 |
| బుద్ధ్యుపదేశిని | 8.00 |
| **టీకా తాత్పర్య శతకములు** | |
| సుమతి శతకము టీకా తా॥ | 3.00 |
| కృష్ణ శతకము టీకా తా॥ | 3.00 |
| బాలరామాయణము టీకా తా॥ | 3.00 |

వి. గోపాల్ అండ్ కో., నెం. 18, గోపాలపురం 8వ వీధి, మదరాసు-86